# జీవన్ముక్త ప్రకాశిక

## సారాంశ జ్ఞానము



గ్రంథకర్త

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులు

T. Bheeshma

శ్రీ సీతారామాయనమః

# జీవన్ముక్త సారాంశజ్ఞానం

## శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువుల వారు జాలమాంబకు బోధించిన ద్వాదశబోధలు


గ్రంథకర్త

**శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు**



ప్రకాశకులు

**శ్రీమత్ ఫీల్కాన లక్ష్మణదేశిక అచల గురు మందిరము**

నెం. 11-1-140, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.

ఫోన్ : 27505032



సంపాదకులు

**సమిష్టిబోధానంద శ్రీ ఉప్పలంచి క్రిష్ణమూర్తి షోడశీ విలక్షణస్వామి**

లాలాపేట - సికింద్రాబాద్-500 017.




# జీవన్ముక్త సారాంశజ్ఞానం

రచన
**శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువర్యులు**
శ్రీ తారణ నామ సం॥ర కార్తీక శుద్ధ ఏకాదశి
సోమవారం తేది 22-11-2004


ప్రథమ ముద్రణ
1000 ప్రతులు

**వెల : రూ. 25.00**

ప్రకాశకులు :
**శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణదేశిక**
**అచల గురు మందిరము**
నెం. 11-1-140, సీతాఫల్‌మండి,
సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ : 27505032

ముద్రణ :
ఉదయ్ ప్రింటింగ్ ప్రెస్,
సీతాఫల్‌మండి,
సికింద్రాబాద్ - 061
ఫోన్ : 27501184

# విషయ సూచిక

శ్రీమత్పరశురామ సీతారామస్వాముల వారి
ప్రియశిష్యులు



శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులు

శ్రీమద్భాగవత శ్రీ కృష్ణదేశిక ప్రభువుల వారి
ప్రియశిష్యులు



శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణదేశిక ప్రభువులు

శ్రీమత్ పీల్ఖాన లక్ష్మణదేశిక ప్రభువుల వారి
ప్రియశిష్యులు



**శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్యులు**

శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్య దేశికుల వారి
ప్రియశిష్యులు



**శ్రీ సముక్షి బోధానంద ఉప్పలంచి కృష్ణ మూర్తి**

# శ్రీ సీతారామాయనమః

# జీవన్ముక్త సారాంశజ్ఞానం



శ్రీ॥ పరబ్రహ్మ స్వరూపం । ప్రకాశ జ్ఞానరూపం । ఆనందరూపం । చిన్మాత్రం । చిదాకాశం । పరిపూర్ణం । తానేవున్నాది । అస్వయంప్రకాశాకాశబ్రహ్మంలో । అహం స్ఫురణ అయ్యింది । ఆస్ఫురణపేరు మాయ । దాని పేరెఅ విద్య । ఆస్ఫురణయుక్త చైతన్యం పేరు ఈశ్వరుడు । అదేస్ఫురణ జీవునిది అంతఃకరణ । దాని పేరె అవిద్య । ఆ అంతఃకరణయుక్త చైతన్యంపేరు జీవుడు । అహంస్ఫురణ పేరుమాయ । అదేఅహంస్ఫురణ పేరుఅంతఃకరణ । అహంస్ఫురణ చైతన్యానకు । సర్వజ్ఞత్వం । సర్వసాక్షిత్వం । సర్వ ప్రకాశత్వం । సర్వవ్యాపకత్వం । సర్వనియంతృత్వం వున్నాది । యిందుకోసానకు । స్ఫురణయుక్త చైతన్యాన్ని ఈశ్వరుడనవలెను। అదె స్ఫురణ అంతఃకరణ రూపం అయింది । ఆ అంతఃకరణయుక్త చైతన్యాననకు । కించిజ్ఞత్వం। అవస్థాత్రయసాక్షిత్వం । అవస్థాత్రయంలో వ్యాపకత్రయం । అవస్థాత్రయానకు సాక్షిత్వం । అవస్థాత్రయానకు ప్రకాశత్వం యిందుకోసానకు । అంతఃకరణయుక్తచైతన్యాన్ని జీవుడనవలెను। ఆ జీవునికిదేహత్రయతాదాత్మ్యం అయింది । ఆతాదాత్మ్యంపేరుబంధనం । దేహత్రయతాదాత్మ్యం విచారంచాతపోతుంది । దానిపేరుమోక్షం । చైతన్యానకు బంధనంలేదు। మోక్షంలేదు । తాదాత్మ్యం పేరుబంధనం । తాదాత్మ్యం విచారం చాతపోతుంది । దానిపేరు మోక్షం। దేహత్రయతాదాత్మ్యం చాత బద్ధత అనిపిస్తుంది । గాని జీవునిస్వరూపం చిన్మాత్రం । చిదాకాశం । అక్కడదేహతాదాత్మ్యం వున్నాను । దేహతాదాత్మ్యంలేదు । తనస్వరూప విచారంచాత। దేహతాదాత్మ్యం పోతుంది । దానిపేరుమోక్షం । ఆమోక్షత్వం । చైతన్యానకు । యెమీఅక్కడ బంధత్వం లేదు । ముక్తత్వం లేదు । బంధమోక్షంకల్పనామాత్రం । జీవస్వరూపంలో యెమీలేదు। ఆజీవుని స్వరూపం । స్వప్రకాశం । చిద్రూపం । కేవలచైతన్యం । బ్రహ్మంవున్నది । అక్కడ యెకల్పనాలేదు । అహంస్ఫురణ రూపంమాయ। అంతఃకరణస్ఫురణ రూపం అవిద్య। యిద్ధరిదిత్యాగం చెస్తె ఆచైతన్యానకు । ఈశ్వరత్వం । జీవత్వం యెమీలేదు । ఆ చైతన్యస్వరూపం అఖండైకరసం। బ్రహ్మం పరిపూర్ణం । వున్నాది । అక్కడినామరూపాత్మక జగదాభాసం యెమీలేదు। మాయాలేదు । ఆవిద్యాలేదు । ఈశ్వరత్వంలేదు । జీవత్వంలేదు । సర్వజ్ఞత్వం లేదు కించిజ్ఞత్వం లేదు । సర్వంలేదు । సర్వసాక్షిత్వం లేదు । కించిత్తు లేదు । కించిత్సాక్షిత్వం లేదు । అదికేవల చైతన్యం । ఆ చైతన్యస్వరూపం । పరిపూర్ణం । వున్నది । స్వప్రకాశజ్ఞానరూపం । నిరావేశం । యిందుకోసానకు । ఆకాశంవలెను అనవలెను । ఆస్వప్రకాశ ఘనంలో ఆకాశత్వంలేదు । నిరావేశంవున్నాది । గనక యిందుకోసానకు । ఆకాశం అనవలెను । స్వప్రకాశ ఘనంలో

ఆకాశత్వంలేదు । నిరవయవమంవున్నాది । అందుకోసానకు ఆకాశంఅనవలెను । అషువంటి చిదాకాశబ్రహ్మం । అదే ఈశ్వరరూపం । అదే జీవరూపం । పరంతు అక్కడ జీవేశ్వరుల పేరులేదు। అషువంటికేవలచైతన్యం తనకు తానెవున్నాది । ఈస్వరూపంలో ఓంకారం లేదు। నాలుగు వేదాలు లేవు । ఆరుశాస్త్రాలు లేవు । పద్ధెనిమిది పురాణాలు లేవు । భారత భాగవత రామాయణాలులేవు । యిదిఅంత్తాశబ్దబ్రంహ్మ ఝుంకారం । నుంచ్చియీవల ఝుంకారం యవ్వరినుంచి పుట్టింది । అక్కడ యేమి లేదు । ఝుంకారం యేవ్వరి నుంచి పుట్టింది । అది కేవలచైతన్యం । ఆకేవలచైతన్యం చిదాకాశం । ఆచిదాకాశస్వరూపంలో । సకలమంత్రాలూలేవు। బ్రహ్మ అనాదికం । నాలుగువర్ణాలులేవు । సన్యాసాదికంనాలుగు ఆశ్రమాలులేవు । వర్ణధర్మం। ఆశ్రమధర్మం । చైతన్యస్వరూపంలో లేదు । యిదిఅంతామాయ । మాయమిథ్య । స్వరూపంలో యెమీలేదు । అషువంటి కేవలచిన్మాత్రఘనం తన స్వరూపం । యీలాగునతెలశి । ఆస్వరూపం తోటివుండవలెను । యట్లావుండవలెను । స్థూలసూక్ష్మ దేహద్వయమూలం అంతఃకరణ । దానిపేరుహృదయం । దానిలోపల తనస్వరూపం । స్వప్రకాశం । చిద్రూపం । ఆనందరూపం। సచ్చిదానందబ్రహ్మం । పరిపూర్ణం । చైతన్యఘనం । చిదాకాశం । చిన్మాత్రం । అవినాశం । నిర్వికాశం । ఆసంగం । పరిపూర్ణం । తనస్వరూపం । వున్నది । యిట్లాయెరింగి । దేహాభిమానం విడిచిపెట్టవలెను । వర్ణాభిమానం । ఆశ్రమాభిమానం । కర్మాభిమానం । జాత్యభిమానం । యిషువంటిఅనేక అభిమానాలు వున్నావి । యీ అన్ని అభిమానాలు విడచిపెట్టవలెను । తన స్వరూపంతోటి తానువుండవలెను । తనస్వరూపం ఈశ్వరరూపం । కేవలచైతన్యం । వొక్కటివున్నాది । దీని పేరుబ్రహ్మాత్మైక్యజ్ఞానం । బ్రహ్మాత్మైక్యజ్ఞానంపేరు । బ్రహ్మ సాక్షాత్కారం। యిట్లాయెరింగి వూరికెవుండవలెను । యిదినిశ్చయం యిఁ జీవన్ముక్తకృతసారాంశ జ్ఞానం మొదటి అధ్యాయం

ఎ శ్రీ॥ భగవంతుడు పంన్నెండో అధ్యాయంలో తనస్వరూపం చెప్పినాడు । తనస్వరూపంకేవల చైతన్యం । నామరూపరహితం । నిరుపాధికం । అగోచరం । అవజ్ఞానగోచరం। **యతోవాచోనివర్తంతె। అప్రాప్యమనసాసహ** । తనస్వరూపం స్వయంప్రకాశచైతన్యం । పరాత్పరం। అగమ్యం । యెవ్వరికీగమ్యంకాదు । దైవానకు । రుషేశ్వరానకు । సకల జీవానకు । అగమ్యం। అదెతనస్వరూపం । సకల జగత్తులోనిండివున్నాది । పరంతు । సకల జగత్తుకు । అగమ్యం అయింది । యెందుకు అయింది । దైవానకు । దైవాభిమానం । రుషీశ్వరానకు తాపసాభిమానం। జీవునికి దెహాభిమానం । యిందుకోసానకు అగమ్యం అయింది । సకలానకూమనస్సు ఇంద్రియాలతోటి బాహ్యప్రవర్తనలో ప్రీతివున్నాది । బాహ్యప్రవృత్తిలో చిక్కుబడడు । యిందుకోసానకు అగమ్యం అయింది । నేను సర్వానకూ ఆత్మను । నన్ను యెవ్వరూ యెరుగరు। యిట్లావుండంగా । దేవతులుగాని । మనుష్యులుగాని । సకల జీవులుగాని । యెవ్వరువెనకకు మర్లుతారు । వారికేతెలుస్తుంది । యట్లామర్లుతారు । మనుస్సు యింద్రియాల

తోటిగూడి బాహ్యాప్రవర్తనలో వుంటారు । మహాభజన చేశినారు । వారి మీద నాయొక్కకృపాకటాక్షం అవుతుంది । నాకటాక్షంచాతదశ ఇంద్రియాలను । మనుస్సును ఆకర్షణం చేస్తారు । బాహ్యాప్రవర్తన త్యాగం చేస్తారు । అంతర్ముఖం అవుతున్నారు । పాంచభూతిక శరీరాన్ని వెనకకు విడుస్తున్నారు। ఆ శరీరాభిమానం విడిచిపెట్టి । లోపలికి పోతున్నారు । అంతఃకరణ । పంచసూక్ష్మమహాభూతాలు । అందుట్లోమనస్సు ఆది జేశినాల్గు వెనకకు విడుస్తున్నారు । అంతఃకరణ మహాభూతం । దానిది మస్తకంలో యెక్కుతారు । మస్తకంలో అంటె యేమి । అంతఃకరణలోపలికి పొయ్యివూర్ధ్వముఖం అవుచున్నారు । అంతఃకరణ అంటెయేమి । అహంయుట్లాస్పురణ । ఆస్ఫురణవెనకకు విడిచి । ఆస్ఫురణ మీదనిశ్చలంవుంటారు । యిట్లానిశ్చలంవుండగా అజ్ఞానాంధకారం పోతుంది । స్వప్రకాశం అవుతుంది । స్వప్రకాశం అంటెయేమి । తనస్వరూప జ్ఞానం । అవుతుంది । పాంచభూతిక శరీరంనేనుగాను । సూక్ష్మపంచమహాభూతాల లింగశరీరంనేగాను । అంతఃకరణలోపటి । అంతఃకరణానకు సాక్షిప్రకాశకుడు స్వప్రకాశచైతన్యానకు కనిపిస్తుంది । అదేనేనువున్నాను । యిట్లా స్వప్రకాశం అవుతుంది । ఆ స్వప్రకాశంసిద్ధం । అక్కడ । అవిద్యాస్పర్శలేదు । యిందుకోసానకు। శుద్ధం । ఆస్వరూప జ్ఞానంచాత । భగవత్స్వరూపం యిదే స్వయంప్రకాశ చైతన్యం । నాది స్వరూపం । అది అజం అయినాది । సకల విశ్వప్రకాశకచైతన్యం నాది స్వరూపం । అది అజం అయినాది । సకల విశ్వప్రకాశానకు యెట్లాతెలుస్తున్నారు । అజంఅంటె జన్మంలేదు । అనాది అంటె ఆదిలేదు। పరిపూర్ణచైతన్యఘనం । అదేనేనువున్నాను । యిట్లాజ్ఞానదృష్టి చాతతెలుస్తున్నారు। ఆ మహాస్వరూపం తెలిశి ఆస్వరూపమేనేనైవున్నాను । యిట్లా తనకు చూస్తున్నారు । అమనస్వరూపంలో అయిక్యంతోటి । వుంచారు । వారికినాయొక్క స్వరూపం తెలిశింది । పరంతు పలుకరాదు । బుద్ధిచాత యెర్గరాదు । కన్నులచాత చూడరాదు। అట్టినాస్వరూప నిష్ఠచాతసదాసర్వదా వుంచున్నారు । ఆషువంటిసాధూలయొక్క అంశ ఆనవలెను । దేవతులుగాని । రుషులుగాని । జీవులుగాని । యీలాగుయెవ్వరికి జ్ఞానం అయిందో । యిట్లానా స్వరూపనిష్ఠతో యెవ్వరువుందురో వారు నేనైవున్నాను । వారి సకల పాపాలు । అవిద్యాదికం। నివర్తి అవుచుంది । నాస్వరూపప్రాప్తి వారికి అవుచుంది । యిదినిశ్చయం ॥

3 శ్రీ॥ తోమ్మిదో అధ్యాయంలో భగవంతుడు అర్జునునికి రాజవిద్యారాజగుహ్యం చెప్పినాడు । రాజ విద్య అంటె శ్రేష్ఠ విద్య । **"అధ్యాత్మ విద్యా విద్యానాం"** । రాజగుహ్యం అంటె యేమి । సకల గుహ్యాలలో పరమగుహ్యం । యిదితోమ్మిదో అధ్యాయంలో చెప్పినాడు । పరమాత్మ పరబ్రహ్మం । అఖండైకరసం । కేవల చైతన్యం । వున్నాడు । ఆపరమాత్మ నుంచి మాయాభాసం నిర్మాణం అయింది । ఆమాయాభాసం నుంచి పంచమహాభూతాలు నిర్మాణమైనవి । ఆపంచమహాభూతఅంగలో త్రిగుణాలు । ప్రాణాలు । మనోబుద్ధులు ।

ఇంద్రియాలు । పంచవిషయాలు । యివ్విఅన్నీ వున్నావి । చైతన్యసత్తాచాత । పంచమహాభూతాది విశ్వాకారం అయింది । ఆవిశ్వంలో ఆచైతన్యం అంతర్బాహ్యాల వ్యాపించివున్నాడు । అవ్యక్తమాయచాత ఆచైతన్యం జగద్రూపంమూర్తి వంతం । అయివున్నాడు । యిందుకోసానకు భగవంతుడు తానె । యేమంచున్నాడంటెను । **"మాయాతతమిదం సర్వంజగదవ్యక్తమూర్తినా"**। చైతన్యస్వరూపంలో మాయ అదిచేశిజగత్తు అభాసం అయింది । అదియట్లా అయింది । అద్దంలోయట్లానగరం కనిపిస్తుందో । అదిచూచెటివారికికనిపిస్తుంది । అద్దంలో నగరంలేదు। అట్లాయెవ్వరు పరమాత్మచైతన్య స్వరూపంలో విశ్వాభాసంవున్నాది అని అంటారు వారికి కనిపిస్తుంది । చైతన్యంలో యేమీలెదు । చైతన్యం మాత్రంవున్నది । యిందుకోసానకు భగవంత్తుడు అంటాడు ॥శ్లో॥ **మస్థాని సర్వభూతాని నాచహంతేష్వవస్థితః॥** నాలో సర్వభూతాలు వున్నావి । నేనుసర్వభూతాలలేదు । అద్దంలో నగరంయట్లాకనిపిస్తుందో । అట్లానాలో విశ్వభాసం। మిథ్యానె । నేనుయెవ్వరిలో ప్రవేశంకాలేదు । యిందుకోసానకు । **నతెష్వాహం** అన్నాడు । మరి భగవంతుడు । **అంచాన చమత్స్థాని భూతాని** । నాలో భూతభాసంలేదు । నేను మాత్రం వున్నాను । యిట్లాభగవంతుడు అంటాడు । విశ్వభాసం కనిపిస్తుందిలేదు । యట్లాను । ఆకాశంలో నీలవర్ణంకనిపిస్తుంది । పరంతు ఆకాశంలో నీలవర్ణంలేదు । రశ్మిలో మృగజలం కనిపిస్తుంది । పరంతు అక్కడ జలంలేదు । పర్వతాలలో పొగకనిపిస్తుంది । పరంతు యేమీలేదు। యట్లాలేదు। మాయమిధ్య । మాయనుంచి ఈశ్వరత్వం వచ్చింది । అదీ మిధ్యా । అవిద్య నుంచి । జీవత్వం వచ్చింది । అది మిధ్యా । మాయయుక్త ఈశ్వరకల్పితం జగదాభాసం । అవిద్యాయుక్త జీవకల్పితం అవస్థాత్రయం । బంధమోక్షం । అదిమిధ్యా ॥శ్లో॥ **రుత్యర్థం యత్ప్రతీయ్యేత । నప్రతి య్యేతచాత్మని।** సత్యంవలెనుకనిపిస్తుందీ । మాయాభాసం । నామరూపాత్మకం । జగత్తు । ఆచైతన్యదృష్టిచాతచూస్తె యెమీలేదు । మాయాలేదు । అవిద్యాలేదు । ఈశ్వరత్వంలేదు । జీవత్వం లేదు । జగదాభాసం లేదు । యిందుకు శాస్త్రవాక్యం ప్రమాణంవున్నాది । **మాయా విద్యా ద్వయోర్మిధ్యా । చిదాభాసద్వయోర్నహి అఖండైకరసంబ్రహ్మా। తదాత్మానం సునిశ్చితం । ఉపనిషద్వర్తివాక్యం । ఆత్మసత్యం జగన్మిధ్య । జీవోబ్రంహ్మైవనాపరా ॥** శృతివాక్యం । **ఏకమెవాద్వి తీయ్యం బ్రహ్మ । నేహనానాస్తికంచన** । స్వయంప్రకాశచైతన్యం । పరిపూర్ణం వున్నాది । రెండోదియేమీలేదు । యిందుకోసానకు । మీ జ్ఞానాననకు రాజ విద్యారాజగుహ్యాం । అని భగవంత్తుడు అన్నాడు । యీ జ్ఞానం కన్న । యెక్కువబ్రహ్మ జ్ఞానం లేదు । సకలజ్ఞానం యీ జ్ఞానగర్భంలోను । యిందుకోసానకు యీ జ్ఞానం । పరమగుహ్యాం। గుహ్యాద్గుహ్యాతరం । యిదితొమ్మిదో అధ్యాయంలో సారాంశ జ్ఞానం చెప్పినాడు ॥

౪ శ్రీ॥ పదమూడో అధ్యాయంలో భగవంతుడు చెప్పుచున్నాడు । దేహంఆత్మకాదు । ఆత్మ స్వరూపం వేరే । దేహస్వరూపం వేరే । దేహపంచభూతిక ఆకారం । అది యట్లాగంటె । పంచభూతాల నుంచి ధాన్యం నిర్మాణం అయింది । పంచభూతి కధాన్యందిఅన్నం అవుతుంది।

ఆ అన్నం నుంచి దేహనిర్మాణం అయ్యింది । **అన్నాద్భవంతి భూతాని** యిది గీతా వాక్యం-యీదేహం । అస్థిమాంసరక్తత్వక్కులది । యిదిదేహరూపం । దానికి తొమ్మిదిద్వారాలు వున్నావి । యీ తొమ్మిదిద్వారాలది దేహం । యిదేగృహం । ఆదేహంలోనె ఆత్మ వున్నాది । అని అంటారు । పరంతు ఆత్మ దేహంలో లేదు । ఆ ఆత్మ ఆత్మ స్వరూపంలోనే వున్నాది । ఆకాశం ఘటంలో వున్నాది అని కనిపిస్తుంది । పరంతు ఆకాశం ఆకాశంలోనే వున్నాది । యింటివాడు యింట్లోనె వున్నాడు । యిల్లువాడుకాదు । అట్లా అజ్ఞానదృష్టిచాత । ఆత్మదేహంలోనె వున్నాడు। అని అనిపిస్తుంది । పరంత్తు ఆత్మదేహంలేదు । ఆకాశంయట్లా సర్వవ్యాపకం వున్నాదో । అట్లా ఆత్మ చిదాకాశం । సర్వజగత్తు । దేహం ఆత్మకాదు । ఆకాశంవ్యాపించి వున్నాది । పరంత్తు ఆకాశం సర్వంకాదు । అట్లాఆత్మవున్నాడు । గ్రంథంలో చెప్పినాడు । ఆత్మ దేహంలోవున్నాడు । ఆత్మపేరుదేహి । జీవుడు । యిట్లాచెప్పినాడు । పరంత్తు వాడు దేహికాడు। జీవుడుకాడు । యట్లాసూర్యప్రతిబింబంవుదకంలో కనిపింస్తుంది । ఆప్రతిబింబంమీద సూర్యుడు ఆకాశంలో యట్లావున్నాడో । అట్లాగెవున్నాడు । అట్లా ఆత్మ ప్రతిబింబం । బుద్ధిలో అయ్యింది । బుద్ధి ఆ ప్రతిబింబం జీవుడు మీద వున్నాడు । ఆత్మ ఆత్మత్వంచాత యట్లావున్నాడో అట్లాగెవున్నాడు । ఆ ఆత్మస్వరూపం యట్లావున్నదంటె ॥శ్లో॥ **అనాదిమత్పరం బ్రంహ్మ నసత్తంనాసదుచ్యతె** । ఆత్మకు ఆదిలేదు । ఆత్మస్వరూపం అనంతం । అపారం । యిందుకోసానకు। ఆత్మను పరబ్రహ్మం అనవలెను । ఆత్మా అన్నా । సత్తన్నసతంనేను । వున్నాను । నేను లేను । యీజ్ఞప్తి ఆత్మస్వరూపంలో లేదు । ఆత్మచైతన్యం । చిన్మాత్రఘనం । స్వయంప్రకాశం । సచ్చిదానందం । నిర్గుణం । నిర్వికారం । నిరాకారం । నిరాభాసం । పరిపూర్ణం। ఆత్మవున్నాడు । అషువంటి ఆత్మ స్వరూపం యిట్లావుండంగా నేను దేహంఅనెదివ్యర్థం । చార్వాకమతంలో దేహమెఆత్మ అంటారు । అదివ్యర్థం । కర్మనిష్ఠమంది నేను దేహంకర్మకర్త యిట్లా అంటారు । అది వ్యర్థం । వైష్ణవమతంలో నేను వైష్ణవుడను అని దేహానకు అంటారు। అదివ్యర్థం । శైవమతం నేనుశైవమని దేహానకు అంటారు అదివ్యర్థం । శక్తిమతంవారు । నేను దేహంఅంటారు । అదివ్యర్థం । యోగులు నేనుదేహిప్రాణప్రాణయోగం శెయ్యవలెను అంటారు। అదివ్యర్థం । నేను వొక్కదేహి । యిట్లాఅని యింద్రియనిగ్రహం చెస్తారు అది వ్యర్థం । దేహనిష్ఠతోటి యేదియేదిసాధనం చెస్తారో । అది వ్యర్థం । దేహానకు ఆత్మ అనేదివ్యర్థం । కొందరు మతంలో ఇంద్రియాలకు ఆత్మ అంటారు । యీ ఆత్మ యింద్రియాలకు సాక్షి । ఆత్మ ఇంద్రియాలుకావు । ఆత్మయింద్రియాలు అనె దివ్యర్థం । కొందరు మతంలో ప్రాణం ఆత్మ అంటారు । ప్రాణానకు సాక్షి ఆత్మ । దానికి ప్రాణం యట్లాఅనవలెను । యిందుకోసానకు ప్రాణం ఆత్మకాదు । ప్రాణం ఆత్మ అనేది వ్యర్థం । కొందరు మతంలో మనుస్సు ఆత్మ అంటారు । మనుస్సుకు సాక్షి ఆత్మ । ఆ ఆత్మకు మనుస్సు యట్లాఅనవలెను । మనుస్సు ఆత్మకాదు । మనుస్సు ఆత్మఅనేది వ్యర్థం । కొందరు మతంలో బుద్ధి ఆత్మ అంటారు । బుద్ధి

ప్రకాశ ఆత్మ। వాడు బుద్ధి అని యట్లాఅనవలె। యిందుకోసానకు బుద్ధి ఆత్మ కాదు। బుద్ధి ఆత్మ అనేది వ్యర్థం। కొందరి మతంలో ఆనందమయం ఆత్మ అంటారు। ఆనంద మయంసుషుప్తిలోవున్నాడు। ఆ ఆనందమయానకు సాక్షి ఆత్మ। యిందుకోసానకు ఆనందమయకోశం ఆత్మ కాదు। ఆనందమయం ఆత్మఅనేది వ్యర్థం। ఆత్మ అవస్థాత్రయానకూ సాక్షి। అవస్థాత్రయాతీతంవున్నాడు। దానికి శృతిప్రమాణం। **జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచంయత్ప్రకాశతే। తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా। సర్వబంధైః ప్రముచ్యతే॥** జాగ్రత్స్వప్న సుషుప్తి ఆదిచెశి। యేమేమిప్రపంచం వున్నాది। అసమస్త ప్రపంచానకూసాక్షి। ప్రకాశకఆత్మ పరబ్రహ్మాంవున్నాది। ఆ ఆత్మ పరబ్రహ్మ నేను। యిట్లాజ్ఞానం అయితె। సర్వ ప్రపంచ బంధనంనుంచి ముక్తుడు అవుతున్నాడు। యిట్లాతనస్వరూపం కేవల బ్రహ్మాం వుండంగా। తనకుదేహం అనేది వ్యర్థం ॥శ్లో॥ **అనాది త్వాన్నిర్గుణ త్వాత్పరమాత్మాహమవ్యయః। శరీరస్థోపికౌంతేయ। నకరోతి నలిప్యతె** ॥ ఆత్మ అనాది। నిర్గుణం। పరమాత్మా। అవ్యయం। అషువంటి ఆత్మ దేహంలో వున్నాడు। యిట్లాజ్ఞాన దృష్టిచాత అంటారు। ఆత్మ పరిపూర్ణంగా వున్నాడు। దేహంలో యట్లాయిమిడీని। మంచిది। యిది అజ్ఞానం అంధకారం చాత అంటారు। అనుకోని। ఆత్మదేహంలో నుండి। **నకరోతినలిప్యతె**। ఆత్మసత్తాచాత మనబుద్ధి యింద్రియాలలో కర్మం అవుతుంది। ఆత్మయీకర్మంది కర్తకాదు। చంద్రవుదయం ఆకాశం। సముద్ర వుదకం యెక్కుతుంది। చెంద్రకాంత్తి నుంచ్చి। నీళ్ళు పారుతుంది। చెకోరపక్షికి చంద్రామృతంచాత తృప్తి అవుతుంది। కుముదపుష్పానకువికాసం అవుతుంది। సకలధాన్యంలో పాలునిండుతావి। సకల జగత్తూ చంద్రామృతంచాత శీతలం అవుతుంది। చెంద్రుడు యెమీశాయలేదు। యీ అన్ని కార్యాలు చంద్రప్రకాశంచాత అవుతుంది। అకర్త వున్నాడు। యిట్లా ఆత్మచిదాకాశం ।లో। స్వయం జోతిస్వయం ప్రకాశంపరిపూర్ణం వున్నాడు। ఆ ఆత్మప్రకాశంచాత। ఆత్మ సత్తాచాత। మాయా ఆది చేశితృణపర్యంతం సకల ఆభాసం ఆత్మప్రకాశంచాత ప్రకాశించె। ఆ మాయా ఆది జేశిసకల ఆభాసంమ్మాయ। మాయమిథ్య। అభాసరూపం। జగత్తులో సకల మతాలు అదేమాయ। మాయమిథ్య। ఆత్మ। అఖండైకరసం। **బ్రహ్మసచ్చిదానందమద్వయం। స్వయంప్రకాశ ఆత్మానం నిర్మలంగగనోపమం**। యిట్లా ఆత్మ స్వరూపం వున్నాది। తనది జీవత్వం। ఈశ్వరుణిది ఈశ్వరత్వం। యిది వుపాధిచాత అయింది। యీ వుపాధి ఆత్మ స్వరూపంలోలేదు। యిందుకోసానకు। జీవేశ్వర బేదం ఆత్మ స్వరూపంలోలేదు। ఆత్మస్వరూపం కేవల స్వయంప్రకాశ చైతన్యం। యిట్లాగురుముఖంచాత। శాస్త్రవాక్యంచాత। తన అనుభవంచాతను। ఆత్మ స్వరూపం యెరింగి। నేనుదేహం అనె యీదేహాభిమానంత్యాగంచెశి। అంతర్ముఖం అయ్యిమనోవృత్తికి వుపరమంచేశి। తన స్వరూపసుఖస్థితితోటి। వుండవలెను। వానికి అదేప్రాప్తి। దీని పేరు పరమగతి। పరమసాయుజ్యం అయ్యింది। యిది నిశ్చయం। సారాంశజ్ఞానం భగవంతుడు అర్జునునికి బోధచెశినాడు। ఇతి శ్రీ గురు జీవన్ముక్తకృతం ॥

౭౹ ॥శ్రీ॥ పదమూడో అధ్యాయంలో క్షేత్రక్షేత్రజ్ఞ విచారం । క్షేత్రం అంటెను దేహం । క్షేత్రజ్ఞుడు అంటెను జీవుడు । దేహానకు క్షేత్రంఅని యందుకు అన్నారు । జీవుడుదేహంలో వుండి । మనుస్సు ఇంద్రియాలచాత కర్మం చేయిస్తాడు । కొంత విధిపూర్వకం కొంత అవిధిపూర్వకం । అవిధిపూర్వకం తోటి చేస్తె పాపం । విధిపూర్వకంగా చేస్తె పుణ్యం । యీపాపపుణ్యం పంట దేహంలో అవుతుంది । యిందుకోసానకు । దేహానకు క్షేత్రం అన్నారు। యీపాపపుణ్యఫలం సుఖ దుఃఖం యిదెజీవునికి తగిలింది । యందుకు తగిలింది । జీవుడు క్షేత్రజ్ఞుడు । తనస్వరూపంయేమి వున్నాదో ఆ జ్ఞానంలేదు । దేహంలో కర్మకర్తనేను అంటాడు। తనస్వరూపమెరుగక । నాదిదేహం । నేను దేహం యిట్లావిపరీతజ్ఞానంచాత దేహబుద్ధి పట్టి వున్నాడు । యిందుకోసానకు సుఖదుఃఖభోగంతగిలింది । పరంత్తు జీవునికి యెమీలేదు । తన స్వరూపంయెరుగక నేనుకర్తను । నేనుభోక్తను అంటాడు । యిదివ్యర్థం । క్షేత్రజ్ఞం అంటె యెమీ। క్షేత్రానకుయెరింగెటివాడు । క్షేత్రజ్ఞుడు । క్షేత్రంకాడు । యట్లాకాడు అంటెను । క్షేత్రంపాంచభూతికం। నాశవంతం । క్షేత్రజ్ఞస్వరూపం అవినాశం । శాశ్వితం । జాగ్రత్స్వప్నసుషుప్తి మూడవస్థలకుసాక్షి। క్షేత్రజ్ఞుడు జీవుడు । ఆసాక్షిరూపుడు జీవుడు స్వరూపం । చైతన్యం । ఆ చైతన్యం । నిరాకారం । నిరాభాసం। నిరావస్థస్వరూపం । క్షేత్రజ్ఞుడు । ఆషువంటి జీవుని స్వరూపం వుండంగా । నేను క్షేత్రం అనెది వ్యర్థం । బ్రహ్మాది పిపీలికాపర్యంతం । సకలదేహాలలో క్షేత్రజ్ఞుడు వున్నాడు । ఆసమస్త క్షేత్రజ్ఞుడనునేను । అని యిట్లాభగవంతుడు అన్నాడు ॥శ్లో॥ **క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి సర్వ క్షేత్రెషుభారతా** । శృతినేను । **ఏకమేవాద్వితీయ్యం** బ్రహ్మమును వుండంగాను । బహువిధక్షేత్రజ్ఞుడవు యట్లాఅయినావుఅంటె । నానాదేహఉపాధిచాత । అయింది। యట్లా అయ్యింది । ఆకాశంవొక్కటె । నానా విధఘటోపాధిచాత నానా ఘట ఆకాశం అయింది। పరంతు దాని నుంచ్చీ । మిథ్యా ఆభాసంచాత మాయ పుట్టింది । ఆమాయాయుక్తచైతన్యం అయింది । దాని పేరు ఈశ్వరుడు । సమస్త క్షేత్రజ్ఞ రూపంచాత నేను వున్నాను । సమస్తక్షేత్రం మాయామయం మిథ్య । నాకు సమస్తక్షేత్రజ్ఞుడనె పేరువచ్చింది। అది మిథ్య । నేను అఖండైకరసం బ్రహ్మను । పరిపూర్ణం వున్నాను । యీలాగున భగవంతుడు చెప్పినాడు । క్షేత్రజ్ఞ స్వరూప యట్లావున్నాది । దానివిచారం। చిదాకాశం । చిన్మాత్రం । పరబ్రహ్మ స్వరూపం। దానినుంచి మహత్తత్వం పుట్టింది । మహత్తత్వం నుంచి త్రిగుణంపుట్టింది । త్రిగుణం నుంచి ముప్పైతత్వాలు పుట్టినవి । యీ అన్నీగూడా । ముప్పైయారుతత్వాలు పుట్టింది । క్షేత్రం । యీ ముప్పైయారుతత్వాలలో బ్రహ్మాది పిపీలికాపర్యంతం । సకల జగత్తూ। పద్నాలుగు భువనాలు। పాతాళలోకం మర్త్యలోకం । దేవలోకం । స్థావర జంగమం । చరాచరం సకల విశ్వాభాసం । యివి అన్నిమాయాకారం । యిందుకోసానకు । సకల అకారానకు । క్షేత్రం అనవలెను । యీ సకల జగదాకారంలో । పరమాత్మవ్యాపించి యున్నాడు । సకల దేహంలో జీవరూపంచాత పరమాత్ముడు వున్నాడు । దానికోసానికి జీవునికి । క్షేత్రజ్ఞుడు అనవలెను । యిందుకోసానకు సకల క్షేత్రజ్ఞుడుకూడా వొక్కపరమాత్మవున్నాడు । సకల క్షేత్రం

మాయామయంచిత్రం । పరమాత్మకు క్షేత్రజ్ఞం పేరువచ్చింది । అది మాయామయం । మిథ్య। పరమాత్మ సచ్చిదానందరూపం । పరిపూర్ణం । చైతన్యఘనం । వున్నాడు । క్షేత్రజ్ఞుడు జీవుడు। క్షేత్రాభిమానం విడిచి పెడితే । తనస్వరూపం పరమాత్మా । పరబ్రహ్మం । యిట్లాయెరింగి। ఆస్వరూపస్థితిచాత వుండవలెను । యిట్లా జ్ఞానం అయితె ఆజీవునికి బ్రహ్మ సాయుజ్యం అవుతుంది । యిది నిశ్చయం ॥ అనుమానంలేదు । యీలాగున భగవంతుడు । భగవద్గీత । అర్జునునికి బోధచెప్పినాడు । ఇతి శ్రీ గురుజీవన్ముక్త కృతబోధ ॥

౬ శ్రీ॥ క్షరపురుష అక్షరపురుషఉత్తమ వురుషవివేకం । అవస్థాత్రయానకుసాక్షి ఆత్మ । అదే ఉత్తమ పురుష పరమాత్మ । పరిపూర్ణం । చైతన్యఘనం । అదేతాను వుండంగా । ఆస్వరూపానకు । మరిచిపోయ్యి । ఆమరుపుచాత తన స్వరూపం యెరుగడు । స్థూలసూక్ష్మదేహద్వయంనేను అని అభిమానంపట్టి వుంటాడు । యిందుకోసానకు తనకు క్షరపురుషత్వం పేరువచ్చిందంటెను । దేహానకు జన్మనాశంవున్నాది । దేహంజన్మిస్తేను । నేను జన్మించినాను । అని అంటున్నాడు । దేహంచచ్చిపోయితెను । నేను చచ్చిపోయినానని అంటుంన్నాడు । యిందుకోసానకు । క్షరత్వం పేరువచ్చింది । జాగృతి అవస్థవుంన్నంత శెపూ। జాగృతిలో యేమియేమి సుఖదుఃఖం అవుతుందో అదినాకు అని అంటున్నాడు । కర్మకర్తృత్వ వ్యవహారం । అది నాకు అని అంటాడు । శరీరానకునిద్రవస్తేను స్వప్నం కనిపిస్తుంది । ఆస్వప్నసుఖ దుఃఖం తనకు అంటాడు । యిట్లా అవస్థాద్వయంలో తిరుగుతున్నాడు । యీ అవస్థాద్వయం నాకు అని అంటాడు । యిందుకోసానకు క్షరత్వం వచ్చింది । తనస్వరూప మెరుంగదేహద్వయమేనేను అని అంటాడు । కర్తాభోక్తా నేనేఅంటాడు । యిందుకోసానకు తనకు జీవుడు అనవలెను । నాశవంతం శరీరం అదితాను అని చూస్తాడు । యిందు కోసానకు। క్షీరంవలెను శెరీరం అనె । యిట్లాతన స్వరూప అజ్ఞానంచాత వుంటాడు । యిందుకోసానకు। పురుషదేహమెనేను అనెది నిద్ర । దేహ బుద్ధి తోటి తనకు క్షరపురుషత్వం వచ్చింది । మనుస్సు। యింద్రియాలు సకల వృత్తి సహితం అజ్ఞానకారణ శరీరంలో లయం అవుతుంది । ఆ మనస్సు తాను అజ్ఞానంలో పోతాడు । ఆవేళక్షరపురుష పేరుపాయను । అజ్ఞానకారణశరీరంలో మనుస్సు వృత్తిలయం అవుతుంది । దాని పేరుసుషుప్తి । నిద్ర । ఆవేళ్ల స్వప్నజాగృతి రెండూ లేకపోతుంది। కేవల సుషుప్తిలోను । సుషుప్తి మయం అయ్యివుంటాడు । దాని కోసానకు తనకు అక్షరపురుషుడు అనవలెను । ఆసుషుప్తి నుంచి బైలువెళ్లి స్వప్న జాగృతిమీదవస్తాడు। ఆవేళ్లక్షర పురుషుడు అనవలెను । అజ్ఞానశరీరం సుషుప్త్యవస్థ । ఆత్మజ్ఞానం వినహాదానికి నాశనంకాదు । ఆసుషుప్తిలో వున్నంతశెపూ అక్షరపురుషుడు అనవలెను । అజ్ఞానసుషుప్తి వొక్కపురం । అందుట్లో శయనం చేశివున్నాడు । శయనం అంటెను అజ్ఞాన తాదాత్మ్యం । యిందుకోసానకు పురుషుడు అనవలెను। నాశనంలేదు । యిందుకోసానకు అక్షరం అనవలెను। యిది అజ్ఞానసుషుప్తిలో వున్నంతశెపూ । అక్షరత్వం తనకు అనవలెను । యీ జాగృతి

స్వప్నంకువస్తే । తనకు క్షరపురుషుడు అనవలెను। యీలాగున వుండగా । అక్షరపురుషజీవుడు। దానికి జన్మం మరణం సంసారాది దుఃఖం తెలిశింది । విరక్తి పుట్టింది । ఆ విరక్తిచాత భగవద్భజనం చెస్తాడు । ఆవెళ్లఅంతరసాక్షి। భగవంతునికి తెలుస్తుంది । యీ జీవుడు విరక్తుడు అయినాడు । యీ జీవునికి జ్ఞానాధికారంవచ్చింది । యిట్లాభగవంతుడు తెలిశి । ఆజీవుని మీద । కృపాకటాక్షం వుంచినాడు। భగవాన్ । ఈశ్వరకృపచాత ఆజీవునికి సత్సహవాసం అవుతుంది । ఆ సత్సహవాసంచాత । ఆసచ్ఛాస్త్రశ్రవణంచాత ఆజీవునికి। నిత్యానిత్యవివేకం తెలుస్తుంది । ఆవేళ్లస్థూల సూక్ష్మకారణదేహత్రయంనేను కాను । జాగ్రత్స్వప్నసుషుప్తి నేనుగాను। జాగ్రత్స్వప్నం అనృతజ్ఞానం। సుషుప్తి అజ్ఞానం । యిదినేను కాను । యీ అవస్థా అతీతం అవస్థాప్రకాశక సాక్షి ఆత్మ నేను వున్నాను । యిట్లాగురుకటాక్షంచాత। జ్ఞానం అయితె క్షరాక్షరరెండు పురుషతనం తనకు వచ్చింది। అదిపోతుంది । అన్యథాజ్ఞానం అజ్ఞానంలో లయం అయితె క్షరతనంపోతుంది । జ్ఞానంచాత అజ్ఞానంనిరసనం అయితె అక్షరతనం పోతుంది । క్షరాక్షరతీతం ఉత్తమ పురుష ఆత్మ నేనువున్నాను। యిట్లాగురుకటాక్షంచాత। జ్ఞానం అవుతుంది। ఆ ఆత్మ ఉత్తమపురుషుడు తాను అదేపరమాత్మ। పరమాత్మ అంటె ఈశ్వరుడు । బ్రహ్మాండహిరణ్యగర్భ అవ్యాకృతమాయా । యివ్వి ఈశ్వరుని దేహత్రయం । మాయామయం మిథ్య । ఈశ్వరస్వరూపం । సచ్చిదానందం । అఖండైకరసం । అద్వైతపరిపూర్ణ బ్రహ్మం । దానికి పూర్ణ చైతన్యం అనవలెను । అవస్థాత్రయాతీతం ఉత్తమ పురుషుడనేను । నాకు ప్రత్యక్చైతన్యం అనవలెను । నేనుప్రత్యక్చైతన్యం । ఉత్తమపురుషఅదే పూర్ణ చైతన్యం । పరమాత్మా। యిందుకోసానకు । నేను పరమాత్మా వొక్కటి। వున్నాను । యిట్లాతెలిశి ఆపూర్ణ స్థితితోటి వుండవలెను । దాని పేరు భక్తి । దాని పేరు బ్రహ్మస్థితి। దాని పేరు ఆత్మ నిష్ఠ । దాని పేరు జ్ఞాననిష్ఠ । దాని పేరు బ్రహ్మప్రతీతి । దాని పేరు బ్రహ్మసాయుజ్యం । మనుస్సు దేహానకు వచ్చి యిట్లాతలిస్తే బ్రహ్మస్థితి తోటి వుంటెనువాడు తన స్వార్థకంతాను చేసుకున్నాడు। యిట్లాగాకుంటె వానిజన్మం వ్యర్థం । యిందుకోసానకు । మనుస్సు దేహానకు వచ్చి క్షరాక్షర ఉత్తమపురుషవిచారం చాయవలెను । యీ విచారం చేస్తె వానికి పరమాత్మ స్వరూపప్రాప్తి అవుతుంది । యి దినిశ్చయం । ఇతి శ్రీ జీవన్ముక్తకృతక్షరాక్షర ఉత్తమ పురుష ప్రకరణం ।

౭ శ్రీ॥ యెడో అధ్యాయంలో చతుర్విధభక్తి భగవంతుడు అర్జునునకు చెప్పుచున్నాడు। భక్తి అంటెనుయేమి । తొమ్మిదివిధాలభక్తి వున్నాది । యెట్లాఅంటెను । శ్రవణం । కీర్తనం । విష్ణుస్మరణ । పాదసేవనం । అర్చనం । వందనం । దాస్యం । సఖ్యం । ఆత్మనివేదనం । యివ్వితొమ్మిది । శ్రవణం అంటెను యేమి । భగవంతుని అవతారచరిత్రలు వినేది । కీర్తనం అంటెను । మృదంగతంబూరాలు । తాళాలు తీసుకొని । భగవచ్చరిత్రలు కీర్తనం పాడేది । స్మరణ అంటెను । భగవంతుని రామకృష్ణుని నామాలు స్మరణచేశేది । పాదసేవనం అంటె । భగవంతుని చరణారవిందాలు సేవచేశేది । అంటెనుయేమి । గురుచరణాల సేవచేశేది ।

అర్చనం అంటెను యేమి । భగవంతునికి పూజచేశెది । యిదియట్లాచేశెది । భగవంతునిరూపం। విగ్రహపూజనం । సాల గ్రామపూజ । గురుపూజ । సాధుసంత్తూల పూజ । బ్రాహ్మణపూజ । భగవద్భావంచాతచేశెది । వందనం అంటెను యేమి । భగవంతవిగ్రహానకు నమస్కారం । గురువుకు । సాధుసంతూలకు । బ్రాహ్మణులకు । వందనం చేశెది । దాన్యం అంటెనుయేమి। దేవాలయాలకు పోయి సేవచెశెది । గురుదాస్యం చేశెది । సఖ్యం అంటెను యేమి । భగవంతుని మీద ప్రేమవుంచెది । గురువుమీదసాధుసంతుల మీద । బ్రాహ్మల మీద ప్రీతివుంచేది । ఆత్మనివేదనం అంటెను । కాయావాచా మనస్సు భగవదర్పణచేశెది । యిదితొమ్మిది విధాల భక్తి । సమస్త జగత్తులో చతుర్విధ భక్తులు వున్నారు ॥శ్లో॥ **ఆర్తోజిజ్ఞాసురర్థార్థిజ్ఞానీచభరతర్షభ**। ఆర్తభక్త తనఅర్ధంకొరకు । నవవిధభక్తి చెస్తాడు । ఆర్తఅంటెనుయేమి । అపేక్షజగత్తులో కొందరికి। రోగాలు అయింది । ఆరోగనివర్తికోసానకు । భజనం చెస్తారు । కొందరికియెమి అయినా సంకటంవస్తె ఆసంకటం కోసానకు । నివారణ అయ్యెటందుకు భజనం చేస్తూన్నారు । కొందరు జన్మంమరణసంసారనివర్తి కోసానకు భజనంచెస్తున్నారు ఆమువంటి అర్తులు జగత్తులో బహువిధంవున్నారు । తనతన అపేక్షకోసానకు కావలెను అని । భజనంచెస్తూన్నారు। వారు ఆర్తభక్తులు । రెండవవాడు । జిజ్ఞాసుభక్తుడు । యీ జగత్తులో యవ్వరికి భగవత్కృపాజ్ఞానం కావలెను । యీ ఆపేక్షయెవ్వరికి పుట్టిందో । యిది అందరికీ జిజ్ఞాసహ । అవుతుంది । ఆజిజ్ఞాసతోలేకోసానకు భజనం చేస్తున్నారు । మూడోది । అర్థార్థిభక్తి అర్థం అంటెను। ద్రవ్యానకుప్రాప్తం కావలెనని । యీయాపేక్షానకు । భాగ్యంకావలెనని । భాగ్యంతోటి సుఖాన వుండవలెను । మరికొందరు । నాకులగ్నంకావలెను । పుత్రూలు మిత్రూలు కావలెను । నాకు ధనధాన్యంసమృద్ధికావలెను । యిట్లానైన అర్థాది ఆపేక్షచెశి భజనంచేస్తారు । నాలో జ్ఞానిభక్తుడు। వాడుయట్లాభజనంచేస్తాడు । అది చెప్పచున్నాను । అన్వయవ్యతిరేకంచాత భజనంచేస్తూన్నారు। అన్వయం అంటెను । యేమి । భగవంతుడుతన మాయచాత సకల జగత్తులునిర్మాణం చెశినాడు। సకల జగత్తులో అంతర్బాహ్యంవ్యాపించివున్నాడు । అంతరంలో సర్వసాక్షి । యీశ్వరతనంచాత వున్నాడు । బాహ్యంజీవరూపంచాతవున్నాడు । యిందుకోసానకు సకల జగత్తు । భగవత్స్వరూపం వున్నాది । బ్రహ్మాదికీటకపర్యంతరం వొక్కభగవంతుడు పరమాత్మయైవున్నాడు ॥శ్లో॥ **సమొహంసర్వభూతేషు** । యిదిభగవద్వాక్యంవున్నాది । యిందుకోసానకు । సకల జగత్తు భగవత్స్వరూపంచూచెది । అన్వయభక్తి । వ్యతిరేకభక్తి । యట్లానో అదిచెప్పచున్నాను । మాయాఆది చేశితృణపరియంతరం సకల నామరూపాత్మకం జగత్తుమాయ । మిథ్య । భగవద్రూపంకేవల చైతన్యం । అదిపరిపూర్ణం వున్నాది । చైతన్య నుంచి వేరే రెండోదియెమీలేదు । తనకుయట్లాను చూస్తాడు । తనదేహత్రయంమాయామయం। మిథ్య। తానుసాక్షిరూపచైతన్యం । అదేకేవల పూర్ణచైతన్యం । పరమాత్మ । యిట్లాతనకూ పరమాత్మకు ఐక్యతయెరింగి । ఆ చైతన్యస్వరూపంలో। మనుస్సువుంచ్చి ।తననిష్ఠతోటి వుంటాడు। దీని పేరువ్యతిరేకభక్తి । యిట్లాఅన్వయవ్యతిరేకం తోటిజ్ఞాని భజనంచెస్తాడు ।

ఆభక్తుడు **ప్రియోపిజ్ఞాని । నోత్యంతమహంసచప్రియః** । అజ్ఞానభక్తునికి నేనుప్రియుడను । నాకు జ్ఞానిభక్తుడు ప్రియుడు । వున్నాడు । యందుకు ప్రియులు అంటెను। జ్ఞానికి యెమీ అపేక్షలేదు । యెంద్దుకులేదు । జ్ఞానినాస్వరూపం । కేవలచైతన్యం । అదేఅది అయివున్నాడు। యిందుకోసానకు । జన్మమరణ సంసారసంకటం నివారణం కావలెనన్న ఆపేక్షాలేదు । యెందు కులేదు । చైతన్యస్వరూపం । అజఅవిభాసం । వున్నాది । ఆ చైతన్యానకు। జన్మ మరణంలేదు। ఆచైతన్యంతానువున్నాను । యిందుకోసానకు ఆపేక్షలేదు । జిజ్ఞాసాపేక్షా జ్ఞానకిలేదు । యట్లాలేదు । తానేజ్ఞానఘన చైతన్యంవున్నాడు । యిందుకోసానకు అపేక్షలేదు । జిజ్ఞాసాపేక్ష జ్ఞానికిలేదు । తానేజ్ఞానఘనచైతన్యంవున్నాను । ఆ చైతన్యానకు । శృతులుయేమీలేదు। యెందుకోసానకు । జిజ్ఞానతజ్ఞానికి అర్థఆపేక్షయెమీలేదు । యెందుకులేదంటె । తనస్వరూపంనిర్గుణం । నిరాకారం। నిరాభాసం । స్వయంప్రకాశచైతన్యం । చిదాకాశం । పరబ్రహ్మం। యిట్లానాస్వరూపంవున్నాది । యిందుకోసానకు ద్రవ్యం ఆపేక్ష । స్త్రీల అపేక్ష । పుత్ర ఆపేక్ష । భాగ్య ఆపేక్షా । యేమి ఆపేక్షా లేదు । యిట్లా అర్థ జిజ్ఞాసం । జ్ఞానికిలేదు । జ్ఞానికేవలంనేను అయివున్నాడు । యిందుకోసానకు వారి ప్రీతి । మాయిదిప్రీతి । యేకమైవున్నాది। యిట్లాజ్ఞానిభక్తుడు వున్నాడు । ఆ జ్ఞానిభక్తుడు నాకు ప్రియుడు । కడమముగ్గురు భక్తులూ తమతమ అపేక్ష కోసానకు మాభజనం చేస్తారు। వారు మీకు ప్రియులై వున్నారు । పరంతు జ్ఞాని భక్తుడు వారిదికేవల ఆత్మ స్వరూపం యీ ప్రకారంగా । వానికిమన్నిస్తాము । యిట్లాభగవంతుడు చెప్పినాడు । ఇతి శ్రీ జీవన్ముక్తచతుర్విధ భక్తి వివరణం ॥

౮ శ్రీ॥ పధహారో అధ్యాయంలో భగవంతుడు అర్జునునికి దైవీసంపదచెప్పినాడు ॥ దైవీసంపద అంటె యేమి । దేవుడూ । ఈశ్వరుడు । ఈశ్వరునిదిమాయ । పేరు దైవీమాయా। దైవీమాయకు దైవీసంపద అని యందుకు అనవలెను । మంచి మంచి సద్గుణాలు ఆమాయలోవున్నావి । దానికోసానకు । ఆమాయకుదైవీ సంపద అనవలెను । దైవఈశ్వరుడు। ఆ ఈశ్వరునిమాయ । దానికోసానకు । దైవీమాయఅనవలెను । ఈశ్వరస్వరూపంయేమి । దైవీమాయ । స్వరూపంయేమి । అదెచెప్పుచున్నాను । ఈశ్వరస్వరూపం కేవలచైతన్యం । అంటె యేమి । ఆ చైతన్యంలో యేమీ మాయలేదు । అవిద్యలేదు । జీవతనం లేదు । ఈశ్వరతనం లేదు । స్వయంప్రకాశ చిన్మాత్రం అఖండైకరసం । పరబ్రహ్మం । అద్వితీయ్యం తనకుతానేవున్నాది। రెండోదియెమీలేదు । అషువంటిది ఈశ్వరస్వరూపం । ఆఈశ్వర స్వరూపంలో। జ్ఞాత । జ్ఞానం । జ్ఞేయం । ధ్యాత । ధ్యానం । ధ్యేయం । యీత్రిపుటులులేవు । తనకుతానే చిన్మాత్రం చైతన్యఘనం। వున్నాది । ఆషువంటికేవల చైతన్యస్వరూపంలో । నేను అని యిట్లాజ్ఞానంస్ఫురణ అయ్యింది । ఆస్ఫురణంపేరు మాయ । చిచ్ఛక్తి । చిత్కళ । బ్రహ్మకళ। యిత్యాదికం యిట్లాపేర్లువున్నాది । ఆస్ఫురణం మాయాయుక్తచైతన్యానకు । ఈశ్వరుడు అని పేరు యెందుకు వచ్చింది । ఆచైతన్యంమాయాప్రకాశం । ఆచైతన్యసత్తా చాతమాయా

ప్రేరణ అవుతుంది । మాయావిస్తారం అవుతుంది । మాయాసంహారం అవుతుంది। మాయా ఆవరణం అవుతుంది । దానికోసానకు। అచైతన్యానకు ఈశ్వరుడు అనవలెను । ఆయీశ్వరుడు। యీశ్వరునిదిమాయ । యీ యిద్దరి నుంచి ముప్పైయారుతత్వాలు పుట్టినావి। ముప్పైయారుతత్వంది । సమస్త జగదాకారంలో చైతన్యం వ్యాపించి వున్నాడు । యట్లాఆకాశంసకలానకు వ్యాపించివున్నాదో అట్లాచైతన్యం సమస్త జగత్తులో అంతర్బాహ్యంవ్యాపించి యున్నాది । ఆకాశంసకలానకు వ్యాపకం వుంటెను। యెక్కడెక్కడాఘటాలు మఠాలు వున్నావి । అక్కడక్కడ । ఘటాకాశం । మఠాకాశం అని పేరు వచ్చింది । అట్ల జగదాకారంలో ఎక్కడెక్కడ చిన్నాపెద్దాదేహాలు వున్నావి । అక్కడక్కడ చైతన్యానకు జీవుడు । అనిపేరు వచ్చింది । అచైతన్యానకు జీవుడనిపేరు యెందుకు వచ్చింది। అచైతన్యసత్తాచాతసమస్తదేహాలు బ్రతుకుచున్నావి । దాని కోసానకు జీవుడని పేరువచ్చింది। అచైతన్యరూప జీవునికి దేహాధ్యాసం తగిలింది । దానికోసానకు నానాదేహాలు ప్రాప్తం అవుతుంది। యిట్లామాయావిస్తారం అయ్యింది । యీవిస్తారం పేరుసంపద । యీసంపదాయుక్తం మాయావున్నాది । యిందుకోసానకు దైవీసంపద అనవలెను । అషువంటిదైవీసంపద విస్తారంలో జీవుడువున్నాడు । ఆ జీవునిలో పుణ్యపాతకంచాత దైవీసంపద ప్రకటం అవుతుంది । అదియట్లాయట్లాప్రకటం అవుతుంది । వైరాగ్యంచాత । వివేకంచాత । శమదమంచాత । వుపరమంచాత । దైవీసంపద ప్రకటం అవుతుంది । మరి ఆ జీవునిలో దైవీసంపద ప్రకటం అవుతుంది । అది యట్లాయట్లాను । జ్ఞానంచాత । ధ్యానంచాత । యోగంచాత । సత్సహవాసంచాత। శ్రవణమనననిజధ్యాసంచాత్త । బ్రహ్మసాక్షాత్కారంచాత ఆదైవీసంపద జీవంలో ప్రకటం అవుతుంది । ఆజీవానకు జ్ఞానంచాత ధ్యానయోగంచాత । తానుకేవలచైతన్యం వున్నాను । అనెజ్ఞానం అవుతుంది । ఆవేళ్లజీవుడు । జీవతనం త్యాగం చేశిబ్రహ్మత్వంతోటి వుంటాడు । ఆవేళ్లవాని మనున్సులో । అమనిత్వాదివద్దెనిమిది గుణాలు। భయాదియిరువైయ్యారు గుణాలు। వాని మనుస్సుకు పుట్టుతుంది । యీ సమస్తగుణాలు దైవీసంపద । అది । యెట్లాదైవీసంపద। యేజీవునిలో ప్రకటం అవుతుంది । ఆ జీవుడు జీవత్వం విడచిపెట్టి । బ్రహ్మస్థితితోటి వుంటున్నాడు । వాడుబంధమోక్షం అతీతుడు అయినాడు। అషువంటి దైవీసంపద । వుత్తమం। యీసంపదలక్షణం యెమేమి । సత్సమాగమంచాత । సచ్ఛాస్త్రశ్రవణంచాత ఆత్మ జ్ఞానం అయ్యింది । యట్లాఅయ్యింది । తానుకేవల పరబ్రహ్మస్వరూపం వున్నాను । బ్రహ్మాత్మైక్య జ్ఞానానకు। దైవీసంపద అనవలెను । యీదైవీసంపద అంగీకారంచాత । ఆజీవునికి బ్రహ్మ ప్రతీతి అవుతుంది। యిందుకోసానకు దైవీసంపద అంగీకరించవలెను । **దైవీసంపద్విమోక్షాయ।** యిట్లాభగవద్వచనం వున్నాది । యిదినిశ్చయం।

☞ శ్రీ॥ పదహారో అధ్యాయములో దైవీసంపద చెప్పిన వెనక । ఆసురీసంపద చెప్పినాడు। ఆసురీసంపద అంటెనుయేమి । అది చెప్పచున్నాను । ఆసురీసంపద అంటెను తామసీమాయ।

భగవంతుడు తొమ్మిదో అధ్యాయంలో చెప్పినాడు । ॥శ్లో॥ **రాక్షసీ ఆసురీంచైవప్రకృతిం మోహినింశ్రితాః** । రాక్షసీ । ఆసురి । మోహిని । యీత్రివిధమాయ పేరుతామసీమాయ । అది యట్లావున్నాది । జీవుడు చైతన్యస్వరూపం వుండంగా। తన స్వరూపంవుండంగా । తనస్వరూపానకు యరుగడు । పాంచభూతికశరీరం యిదినేను వున్నాను । అని యెట్లాయెరింగేది । తామసీఆసురీమాయ । ఆసురి అంటె యేమి। దైవీకాదు । యట్లాకాదు । దేవుడు ఆత్మ । ఆ ఆత్మ సంమంధికాదు దేహసంమంధి మాయ । అంటెనుయేమి। దేహాత్మబుద్ధి। యీదేహాత్మబుద్ధి పేరు । అసురమాయ । రాక్షసిమాయ । అంటారు । ఆ ఆసురీరాక్షసిమాయకు మోహినియందుకు అంటారు । నేనుదేహమును । నేను కర్త । నేను భోక్త అని యీఅహంకారంచాత । తాను చైతన్య స్వరూపంను వున్నాను । యీజ్ఞానం లేకపోయింది। దాని పేరు మోహినీ మాయ । యిట్లాఆసుర రాక్షసీమోహిని । త్రివిధరూపం ఆసురీమాయ । యీ మాయాయుక్తం అయ్యి జీవుడువున్నాడు । ఆ జీవునిలో ఆసురీమాయ గుణప్రకటం అయ్యింది । అది యేదెది ॥శ్లో॥ **అహంకారం బలందర్పంకామ క్రోధపరిగ్రహం** । మరీగుణాలు। **దంభోదర్పోఽభిమానశ్చ** । మరీగుణాలు । పౌరుషం । అజ్ఞానం । మదం । మత్సరం । లోభం । మోహం । యిషువంటినానాగుణాలు । మరీ । ఆశనా । కమనా । తృష్ణా । దుర్వాసన । విషయాసక్తి । యీ నానావిధదుర్గుణాలు । ఆసురీసంపదా । అదియషువంటి ఆసురీసంపద।యవ్వడుదేహాత్మబుద్ధి పట్టి వుంటున్నాడో ఆజీవునిలో యీ ఆసురీసంపద ప్రకటం అవుతుంది । ఆజీవుడు ఆసురుడైవుంటుంన్నాడు । అంటెనుయేమి । నేను దేహం యిట్లా । యెజీవుడు వున్నాడో । ఆజీవునికి । దేహ అహంకారం విస్తారం అయ్యింది । యిదియట్లా యట్లాఅయ్యింది । నాకు జన్మంవున్నాది । నాకు మరణంవున్నాది । నాకు బాల్యత్వం । నాకు తారుణ్యం । నాకువృద్ధతనం । వున్నాది । నేను బ్రాహ్మణుడ । నేనుక్షత్రియుడను । నేను వైశ్యుడ । నేను శూద్రుడను । నేను బ్రహ్మచారిని । నేను గృహస్థును । నేను వానప్రస్థును । నేను సన్యాశిని । నాది జాతి । నాది గోత్రం । నాది కర్మం । నాది ధర్మం । నాది తల్లి । నాది తండ్రి । నా పుత్రులు । నాబిడ్డలు । నాది యిల్లు । నాది క్షేత్రపాత్రం । నాది పెండ్లాము । నాది పదార్థం। యిట్లాదేహాభిమానం పట్టివున్నాడు । మరీ నానా జాతులూవున్నావి । నానా స్త్రీలువున్నారు । నానా పశ్వాదికులు వున్నారు । యెక్కడెక్కడ । యేయేదేహంప్రాప్తి అవుతుంది। ఆజీవుడు దేహాభిమానంపట్టివున్నాడు । మరిదేహాభిమానంపట్టి । సాధుమీద । సచ్ఛాస్త్రంమీద। వేదాలమీద అవిశ్వాసం చేస్తాడు । పాషాండమతం బట్టి లింగంకట్టుకుంటున్నాడు । యవ్వరు తిరుమణి । శ్రీచూర్ణం పట్టెలుపెట్టుతున్నారు । యవ్వరు ముక్కుకొనమొదటినుంచీ బ్రహ్మరంధ్రందనుకా మధ్వాచారంపెట్టుతున్నారు । ఆకోనకు అంగారం । నల్లబొట్టు పెట్టుతున్నారు । రొమ్ముమంచి రెండు బాహూలదనుకా । ద్వాదశనామాలు దిద్దుచున్నారు । ఆనందులను । శ్రీముద్దెర్లు పొడుచుకుంటూవున్నారు । మరియెవ్వరెవ్వరూ భస్మంపెట్టుకొంటున్నారు । మరికొందరు బొమ్మలసందున కుంకుమ పెట్టుతున్నారు ।

మరికొందరు కావిబట్టలు। భోగాలు చేసుకొంటున్నారు। కొందరునల్లబట్టలు చేసుకొంటారు। యిషువంటి పాషాండ్డమతంలో జొచ్చిపాషాండమతం అంగీకరిస్తారు। మరి బ్రహ్మ జ్ఞానానకు। వుడాయిస్తారు। అసత్యానకు। సత్యం అంటారు। సత్యానకు మిథ్య అంటారు। యిట్లానానా విధమతమతాంతరం వున్నది। యిది అంత్తా ఆసురీసంపదది। మరి ఆసురీసంపద। తామశీదైవతాలు। తామశీయాగాలు। తామశీమంత్రాలు। తామశీతాపాలు। దానిది భజనం పూజనం చేస్తారు। దాని తోటి నానావిధజన్మాలు। అవుతుంది। యా,తామశీమాయలో। రాజశీమాయవచ్చింది। రాజ్యంతామశీమాయా వొక్కటి। సాత్వికమాయ దైవసంబంధి। దైవసంపదలో కలిగివున్నాది। తామశీఆసురీమాయ నుంచి ఆజీవుడుయట్లాముక్తి అయ్యాని। దేహబుద్ధితోటి। వర్తసుకం చెయ్యంగా చెయ్యంగా। కాదాచిత్ సాధుసంగతి అవుతుంది। సాధుసంగతిచాత ఆజీవునికి సద్బుద్ధిపుట్టుతుంది। ఆసద్బుద్ధిచాత వివేకంపుట్టుతుంది। ఆవివేకంచాత। పుణ్యాచరణం చేస్తాడు। ఆపుణ్యాచరణంచాత। ఆ చిత్తంలో వున్నషువంటి పాతకాలుపోతుంది। చిత్తంనిర్మలం అవుతుంది। ఆ చిత్తనిర్మలంచాత విషయాసక్తిపోతుంది। విషయాసక్తి పోయితె। కామక్రోధలోభంపోచుంది। యిట్లా సత్సహవాసంచాత పోతుంది। ఆసాధువాక్యం మీద విశ్వాసంవుంచ్చి శ్రవణం చేస్తున్నాడు। ఆశ్రవణంచాత నిత్యానిత్యవివేకం పుట్టుతుంది। నిత్యానిత్యవివేకంచాత పాంచభూతిక శరీరం నేనుగాను। యిట్లా జ్ఞానంపుట్టుతుంది। యీజ్ఞానంచాత। స్థూలసూక్ష్మకారణదేహత్రయం నేనుకాదు। నేనుదేహత్రయానకూ। సాక్షివున్నాను। ఆసాక్షి స్వరూపం నేను వున్నాను। యీలాగునధ్యానంతగులుతుంది। ఆవేళ్లదేహబుద్ధి త్యాగంచేస్తున్నాడు। దేహబుద్ధి త్యాగంచాత దేహాహంకారంపోతుంది। దేహాహంకారంపోయితె। కామంక్రోధంలోభం। మదంమత్సరం ఆశా। కామనాతృష్ణా। విషయాసక్తి। అహంకారంవెంటయీ అన్నిదుర్గుణాలు పాయను। వివేకంచాత దైవీసంపదలో ప్రవేశం అయినాడు। ఆవేళఅసురీసంపద। దానికి సంహ్వారణ అయింది। ఆజీవుడు ఆసురీసంపదనుంచ్చి ముక్తుడు అయ్యిదైవీసంపదలో చొచ్చినాడు। ఆవేళ్ల నేను జీవుడనన్న। అభిమానం విడుస్తున్నాడు। బ్రహ్మరూపం చాత వుంటుంన్నాడు। సదాసార్వకాలం బ్రహ్మచింతనచాత చేస్తున్నాడు। ఆపరబ్రహ్మలోకలశిపోతున్నాడు। ఆవేళ్లదైవీసంపద వెనుకకు అవుతుంది। పరబ్రహ్మస్వరూపం నేను। యిట్లాఘుట్టిగా తెలిస్తే అక్కడ యెమీవుపాదిలేదు। స్వయంప్రకాశం। చైతన్యం। నిర్మలం। పరిపూర్ణం। సచ్చిదానందఘనం। అక్కడదైవీమాయాఆసురీమాయా పేరులెదు। దైవీమాయా అంటె సద్భవమాయా। అసురీమాయా అంటె అ విద్య అ విద్యలో చైతన్యం। అభ్యాసం అయింది। దాని పేరు జీవుడు। మాయలో చైతన్యం అభ్యాసం అయింది। దాని పేరు ఈశ్వరుడు మాయ అవిద్య। చైతన్యస్వరూపంలో జీవుడు లేదు। జివత్వం ఈశ్వరత్వం యిదిలేదు। జీవఈశ్వరులది అయిక్యతనం అదీలేదు। కేవలచైతన్యం అఖండైకరసం। పరిపూర్ణం వున్నాది। యిట్లాజీవునికి జ్ఞానం అయితె। జీవతనంవిడిచిపెట్టి అఖండైకరసబ్రహ్మమును నేనువున్నాను।

యిట్లుతెలిశి। ఆ బ్రహ్మస్థితి తోటివుంటాడు । ఆజీవుడు దైవీసంపద అంగీకారంచాత । ఆసురీసంపదపోయింది । దైవీసంపద ఆపరబ్రహ్మస్వరూపంలో లయం అయింది । అవేళ్ల ఆ బ్రహ్మంవినహా రెండోదియేమీలేదు । అదెనేను వున్నాను । యిట్లా నిశ్చయం అయితె । బ్రహ్మసాయుజ్యం అవుతుంది । వానికి పునఃజన్మం లేదు । **నసపునరావర్తతె** యిది శృతి ॥శ్లో॥ **యద్గత్వానని వర్తంతె** యిట్లా భగవద్వచనం వున్నాది । **బ్రహ్మవిదాప్నోతిపరబ్రహ్మ** విద్రృహ్మైవభవతి। యిట్లాశృతిబలుకుచున్నాది । యవ్వరికి జన్మమరణంనుంచి । ముక్తుడను కావలెను । అనియిట్లా వానసఅయితె । వాడు ఆసురీసంపదత్యాగంచాయవలెను । దైవీసంపద అంగీకరించవలెను । యీ దైవీసంపదచాత బ్రహ్మప్రాప్తి అవుతుంది । దైవీసంపద అంగీకారం అంటెనుయేమి । నేను చైతన్య స్వరూపుడవున్నాను । యిట్లాఅంగీకారంచెయ్యవలెను । దానిపేరు దైవీసంపద అంగీకారం । యీ అంగీకారంచాత బ్రహ్మప్రాప్తి అవుతుంది । యీ వ[illegible]కు సంశయంలేదు । యిదినిశ్చయం। ఆత్మస్వరూపందిజ్ఞానం । ఆ జ్ఞానం పేరు కారణ శరీరం । అజ్ఞానంనుంచి అన్యథాజ్ఞానం పుట్టింది । ఆ అన్యథాజ్ఞానంలో స్థూల సూక్ష్మదేహాద్వయం అయ్యింది । అజ్ఞానంది సుషుప్తిఅవస్థ। అన్యథాజ్ఞానం జాగ్రత్స్వప్నద్వయావస్థ। కారణశరీరంది సుషుప్త్యవస్థది అభిమాని ప్రాజ్ఞుడు । జాగ్రత్స్వప్న అభిమానులు విశ్వతైజసులు । యీదేహత్రయం । అవస్థాత్రయం । అభిమానిత్రయం। యీ సమస్తం ఆసురీసంపద । మహాకారణదేహంఆత్మ జ్ఞ[illegible] । తుర్యం । అవస్థా । యిద్దరిదీ అభిమానిప్రత్యగాత్మ । యివ్విమూడూకూడా దైవీసంపద. ఆత్మ జ్ఞానంఅంటెను । నేను చైతన్యస్వరూపం । తుర్యం అవస్థా అంటెను । స్వరూపసాక్షిత్వం । ప్రత్యగాత్మ అంటెను । నేను చైతన్యం వున్నాను । అనియీఅభిమానం । యీ మూడూకూడా దైవీమాయ । యీ దైవీమాయాంగీకారంచాత ఆసురీమాయది । త్యాగంచాయవలెను । దైవీమాయచాత ఆత్మ స్వరూపం యెరింగి । స్వరూపంలో వుండవలెను । అవేళ్లదైవీమాయ తనకుదానెలయం అవుతుంది। యిట్లాదైవీఆసురీలెకుండాను । అయితెనుకేవల స్వరూపంమాత్రం మిగులుచుంది। అఖండైకరసంపరిపూర్ణం । యిట్లావెలిగె । ఆస్వరూపం యెరింగి। పూరికెవుండవలెను । దానిపేరు బ్రహ్మస్థితి । యిదినిశ్చయం ॥ ఇతి శ్రీ జీవన్ముక్తకృత దైవీసంపద ఆసురీసంపదావివరణం ॥

౧౦ శ్రీ॥ ప్రకృతిపురుషవివరణ భగవంతుడు చెప్పినాడు । పురుషుడు ఆత్మ ప్రకృతిమాయా। పురుషస్వరూపంయట్లావున్నాది । యిదితెలిస్తేప్రకృతి నేనుకాను । పురుషుడనేను వున్నాను । అని అట్లాజ్ఞానం అవుతుంది । దీనిపేరుప్రకృతి పురుషవివేకం । యిదియిట్లానుభగవంతుడు పదమూడో అధ్యాయంలో చెప్పినాడు । పురుషుడు అనాదివున్నాడు । ప్రకృతి అనాదివున్నాది। పురుషుడు అనాది నుంచీ సత్యం । ప్రకృతి అనాది నుంచీ మిథ్య । పురుషుడు అనాది యట్లా। ప్రకృతి అనాదియట్ల । పురుషుడు ఆత్మ । దానికి ఆది లేదు । పరిపూర్ణం । చైతన్యస్వరూపం । ఆత్మ తోడైవుంటెదానికి ఆది చెప్పవచ్చును । పూర్ణంకు ఆది యేమి । ఆది

అంటె యేమి । తల్లీతండ్రి । పరిపూర్ణం వున్నాది । దానికి తల్లీ తండ్రీలేదు । గురువులేడు । దైవంలేడు । వాడేసకలప్రకాశకుడు । తల్లీదండ్రీగురువు దేవుడూ వానికి లేడు । యిందుకోసానకు। సకలానకు। ఆత్మ అనాది । ఆత్మకు ఆది యెవ్వరూలేరు । యిందుకోసానకు । ఆత్మ అనాది। మాయకు అనాది యందుకు । అనవలెను । మాయమిథ్య । మిథ్యకు ఆదియేమి । ఆకాశంలోనీల వర్ణంకనిపిస్తుంది । అదియవ్వరినుంచి నిర్మాణం అయ్యింది । అనవలెను । అది మిథ్యా భాసందానికి । ఆదియేమి । అట్ల మాయా ప్రకృతిమిథ్య ఆభాసం । ఆ మిథ్యకు ఆది యేమి। యిందుకోసానకు । మాయ అనాదియని చెప్పవలెను । పురుష స్వరూపంయట్లావున్నాది । మాయాస్వరూపం యట్లావున్నాది । అదిలెస్సతెలియవలెను । పురుషస్వరూపం నిర్గుణం । నిర్వికారం । నిరాకారం । నిరాభాసంనిరంజనం । నిష్క్రియం । సచ్చిదానందం । అఖండైకరసం। స్వయంప్రకాశం । చైతన్యఘనం । పరబ్రహ్మం । ఆద్యంతరహితం । పరిపూర్ణం । ఏకార్ణవజలం। వలెవున్నాది । ఆ పురుషస్వరూపంలో పంచభూతాలు లేవు । జగదాభాసంలేదు । సూక్ష్మమనుస్సు। బుధ్యాదికంలేదు । సకల లింగదేహాలు లేవు । ఆపురుషస్వరూపంలో అజ్ఞానంలేదు । యిందుకోసానకు సకల కారణశరీరాలు లేవు । ఆ పురుషస్వరూపం । నిష్కళ । చిన్మాత్రం । జ్ఞానఘనం । యిందుకోసానకు। అక్కడ జ్ఞానస్ఫురణం లేదు । తానే పరిపూర్ణం వున్నాది । చిన్మాత్రఘనం । పరిపూర్ణం వున్నాడు। రెండోదియేమీలేదు । యిందుకోసానకు । వానికి అఖండైకరసం । బ్రహ్మం అని శృతిపలుకుతుంది । ఆ ఆత్మ పురుషునికి । పరమపురుషుడు అనవలెను । ఆ ఆత్మ స్వరూపంలో దృశ్యం లేదు ద్రష్టలేడు । జ్ఞేయంలేదు । జ్ఞాతలేడు । ధ్యేయంలేదు । ధ్యాత లేడు । తానేతానుపరిపూర్ణం వున్నాది । ఆ ఆత్మ పురుషుడను నేను । వున్నానని తెలియవలెను । మాయాప్రకృతిది । దాని స్వరూపం యట్లావున్నాది । చెప్పుచున్నాను। మాయాభాసం । దాని పేరు గుణసామ్యమాయా । అదే ప్రకటం అయితె । మూలమాయా । ప్రకటంకాకుంటె అవ్యక్తం । ఆమాయా మిథ్యాత్వంచాత। ఆత్మ స్వరూపంలో వున్నాది అని అంటారు । యట్లారజ్జుసర్పం । శుక్తిరజితం । రశ్మిలో మృగజలం । అట్లామాయాభాసం । ఆమాయాభాసంచాత త్రిగుణ వికారం పుట్టింది । త్రిగుణంనుంచి ముప్పై తత్వాలు పుట్టింది। ముప్పైతత్వాలది దేహద్వయం । అయింది । ఆదేహద్వయంలో నానా వికారంవున్నాది । ఆదేహద్వయంలో ఆత్మ ప్రతిభాసం అయ్యింది । అప్రతిభాసం పేరుజీవుడు । అప్రతిభాస జీవునికి । నేను చైతన్యస్వరూపం ఆత్మ వున్నాను । అనెజ్ఞానం లేకపోయింది । దానిపేరు అజ్ఞానం । ఆజీవుడు చైతన్యస్వరూపం వుండంగా । జ్ఞానం యెందుకు లేకపాయను । ఆ ప్రతిభాస జీవుడు దేహద్వయంనేను అని యిట్లాదేహాహంకారం పుట్టింది । యిందుకోసానకు। తాను చైతన్య స్వరూపం వున్నాను । అని మరిచిపోయినాడు । అదే అజ్ఞానం । మాయా । ప్రకృతి । ఆజీవునికి । యట్లాయట్లాచెశింది। జీవునికి మనోబుద్ధి చిత్తాహంకారం లేదు । ఆమనోబుద్ధిచిత్తాహంకారం జీవుడు పట్టివున్నాడు । జీవునికి పంచప్రాణాలు లేవు ।

నాకుపంచప్రాణాలు వున్నావి । అని అనిపిస్తుంది । జీవునికి దశేంద్రియాలు లేవునాకు దశేంద్రియాలు వున్నవి అని అనిపిస్తుంది । పంచభూతాలు శరీరం। జీవునికిలేవు । నేను శరీరం అనిజీవునికి అనిపిస్తుంది । పంచవిషయాలు జీవునికి లేవు । నేను పరశ్రమంకర్మ । కర్మం జీవునికి లేదు । నేను కర్మకర్త అని జీవునికి అనిపిస్తుంది । సుఖదుఃఖభోగం జీవునికి లేదు । నేనుసుఖిని । నేను దుఃఖిని అని అనిపిస్తుంది । యిట్లాప్రతిభానజీవునికి మాయా అజ్ఞానరూపంచాత । అద్వయం అయిన జీవునికి । తనస్వరూపం విస్మరణంచేశి । దేహబుద్ధికి తెచ్చింది । జన్మమరణం సుఖదుఃఖం యీ ప్రతిభాస జీవునికి తగిలింది । జీవస్వరూపంచూస్తె। కేవల చైతన్యం వున్నాది । దానికి యెమీలేదు । అజీవునికి మాయ భ్రాంతిదెచ్చి దేహమెనేను అనిపించును । సుఖదుఃఖంజీవునికి యెమీలేదు । యీ విధంగా మాయచెశింది । నిద్రవస్తుంది। స్వప్నంలో సుఖదుఃఖం యట్లాఅవుతుందో అట్లాగునెమాయ జీవుణ్ని దేహబుద్ధికి తెచ్చి సుఖ [illegible]ంలో వెశింది । పరంత్తు యిది స్వప్నంవలెను మిథ్య । యెవేళ్ల ఆజీవునికి । సత్సహవాసంచాత జ్ఞానం అవుతుంది । ఆవేళ్ల మూలమాయసహితం నాలుగు దేహాలు । నాలుగవస్థలు । నాలుగభిమానాలు । యివ్వీఅంతా మిథ్యఅవుతుంది । తన స్వరూపంకేవలచైతన్యం వున్నాది । యీప్రకారంగా తెలుస్తున్నారు । ఆవేళ్లనేను జీవుడను అనె మాట విడుస్తున్నాడు । నేనుకేవలశుద్ధచైతన్యం వున్నాను । అని అంటున్నాడు । యీ మాయనాల్గుదేహాలునేను కాదు। నాలుగు దేహాలకూ అతీతం కేవలచైతన్యం । కేవలపరమపురుషుడు । ఆత్మను వున్నాను । అనితెలుస్తూ వున్నాడు । యీ నాలుగు దేహాలు। నేను గాదు । నాలుగు దేహాల అవస్థలు అభిమానులు । సకల విశ్వంమాయ । మిథ్య । నేను ఆత్మ । చైతన్యఘనం । పరిపూర్ణం వున్నాను । యిట్లాతెలిశిఆస్వరూపస్థితి తోటివుంటున్నాడు । గుణసామ్యమాయ ఆదిజెశి ముప్పైఆరు తత్వాలు । ముప్పైఆరు తత్వాలలో । సకల జగదాభాసం అయింది । అది జీవేశ్వర ఆభాసం అయింది । అదిసకల మాయా మిథ్య । యిందుకోసానకు । మాయా ప్రకృతి ఆత్మ పురుషుని మీద మిథ్యా అయింది । అంతా ఆభాసంమిథ్యా । యీ ఆత్మ పురుషుడు । స్వయంజ్యోతి । స్వయంప్రకాశ చైతన్యఘనం । పరిపూర్ణం వున్నాడు । ఆ ఆత్మ పురుషుడనేను। యిట్లాతెలిశిదేహాభిమానం విడిచిపెట్టుచూ వున్నాడు । వానికి జన్మ మరణసంసారం పునః అయ్యేదిలేదు । వానికిస్వరూపసాయుజ్యం అవుతుంది । ఆత్మ స్వయంజ్యోతి స్వయం ప్రకాశ పరిపూర్ణం వున్నాడు । ఆ ఆత్మ స్వరూపం మీద నామరూపాత్మకం మాయా । ఆభాసం అయింది। అది మిథ్యా ఆత్మరూపుడు । పరిపూర్ణం వున్నాడు । అదిసత్యం యిట్లాతెలిశి ఆత్మ స్వరూపస్థితి తోటివుండవలెను । యిట్లాతెలిశిని పురుషునికి । బ్రహ్మప్రాప్తి అవుతుంది । యిదినిశ్చయం । ఇతి శ్రీ జీవన్ముక్తకృత ప్రకృతి పురుష వివరణం ॥

౧౧ శ్రీ॥ అవ్యభిచారభక్తి యోగంచాత గుణాతీతబోధ అవుతుంది । అవ్యభిచారభక్తి అంటెను। యేమి । వ్యభిచారభక్తి అంటెను యేమి । వ్యభిచారం అంటెను భేదంచూచెది । అవ్యభిచారం అంటె అభేదంచూచెది । అదియట్లాను చూచెది । పరమాత్మ పరిపూర్ణం వున్నాడు। వాడుతనమాయచాత విశ్వరూపం అయినాడు । యిందుకు శృతివాక్యం వున్నాది । **పురుష ఏవేదగ్ంసర్వం । యద్భూతంయచ్చభవ్యం । ఆత్మైవెదగ్సర్వం । బ్రహ్మైవెదగ్ంసర్వం ।** సర్వం **ఖల్విదం** బ్రహ్మ । యీలాగున శృతులుచెప్పుచున్నావి । స్మృతివాక్యం ॥ **విశ్వంవిష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః భూతకృద్భూతకృద్భావొభూతాత్మా భూతభావనః । పూతాత్మాపరమాత్మా చముక్తానాం పరమాంగతిః । అవ్యయః పురుషః సాక్షి క్షేత్రజ్ఞోక్షర్వవచ** । యిది స్మృతి వాక్యం । **సమంసర్వేషు భూతెషుతిష్ఠం తంపరమెశ్వరం । మాయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।** యిదిగీతావాక్యం । యిందుకోసానను । సకలజగత్తూపరమాత్మ తానేఅయినాడు । తనదిమాయా తానేఅయినాడు । మాయా మయంవిశ్వాకారంతానే అయినాడు । ఆవిశ్వమయంలో జీవరూపంచాత తానే అయినాడు । సకల అంతర్యామి ఈశ్వరుడుతానే అయినాడు । యిందుకోసానకు **సర్వం ఖల్విదం** బ్రహ్మ । అనవలెను । పరమాత్మ కన్నవేరెయెమీలేదు । అంతావిశ్వమూర్తి పరమాత్మతానేవున్నాడు । రెండో దియెమీలేదు యిందుకోసానకు । బ్రహ్మాది పిపీలికాపరియంతం చరాచరవిశ్వం పరమాత్మ వున్నాడు । యిట్లా అభేదం చూస్తె దీనిపేరు అవ్యభిచార భక్తి ॥శ్లో॥ **మాంచయోవ్యభిచారేణ భక్తి యోగేన సేవతె । సగుణాంత్సమతిత్యేతాః బ్రహ్మ భూయాయకల్పతే** ॥ నాకుఅవ్యభిచారభక్తి యోగంచాత సేవిస్తారు । వారుగుణాతీతం అయ్యి । మత్స్వరూపం ప్రాప్తి అవుతుంద । యిందుకు దృష్టాంతరం । సకల అలంకారం యట్లాబంగారమో । సకలపటంయట్లాతంతో । సకలతరంగాలు యట్లావుదకమో । సకల ఘటంయట్లామృత్తికో । అట్లాసకల విశ్వం పరమాత్మతానే । వున్నాడు । యిందుకు సంశయంపడరాదు । సకల విశ్వం పరమాత్మచూచెటివారు । తాను । తాను పరమాత్మ నుంచి వేరెలేడు । సకల తరంగంవుదకం । వొక్కతరంగం యట్లా అదికంకాదు । సకలఘటం మృత్తికా। వొక్కఘటం యట్లామృత్తికకాదు । సకల అలంకారంబంగారం । వొక్కఅలంకారం యట్లా బంగారం కాదు । సకల పటంతంతు । వొక్కపటంయట్లాతంత్తుకాదు । అట్లాసకల విశ్వంపరమాత్మ । తాను అదెయిట్లాచూచెది అవ్యభిచారభక్తి । పరమాత్మసర్వజ్ఞుడు వున్నాడు। తానుకించెజ్ఞుడు వున్నాడు । పరమాత్మ తానువొక్కటి । యట్లాయీమాటకు వేదాంతం చెప్పుతుంది । మాయఅంగీకారం చాత యీశ్వరుడుసర్వజ్ఞుడు । అవిద్యా అంగీకారంచాత జీవుడు కించజ్ఞుడు। పరమాత్మమాయా అవిద్య ఉపాధిచాత జీవుడు । యీశ్వరుడుతానే । అయినాడు । సర్వజ్ఞుడు కించజ్ఞుడు తానే అయినాడు । యిది మాయా అవిద్యావుపాధిత్యాగం చేస్తె ఈశ్వరతనం లేదు జీవతనంలేదు । సర్వజ్ఞత్వంలేదు కించజ్ఞత్వం లేదు । యిందుకోసానకు। ద్వయఉపాధి అంగీకారంచాత । జీవుడూ ఈశ్వరుడు తానే అయినాడు । వాయువుపాధిచాత సముద్రం తరంగాకారం కనిపిస్తుంది । పరంతుతరంగసహితం వొక్కసముద్రమే । అట్లామాయా

అవిద్య ఉపాధిచాత సకల జీవేశులు । పరంతు । సకల జీవాలు । సకలదైవతాలు । పరమాత్మతానే వున్నాడు భేదంలేదు । భేదంచూచెదివ్యర్థం । పరమాణువుయెలాగుపృధివీరూపం । హిమకణంయట్లాహిమాచలరూపం । యట్లా । అట్లాగునతాను । పరమాత్మ రూపం । తనది । దేహత్రయంనిరాకరణం చేస్తె మిగిలిందితాను । పరమాత్మ స్వరూపమె । యిందుకోసానకు । పరమాత్మకు వేరెతానుకాదు । తనసహితం విశ్వంవొక్కపరమాత్మనె వున్నాడు । అపరమాత్మ అఖండైకరసం । వేరెవేరె జీవాలు । దైవతాలు । కనిపిస్తున్నావి । దాని చాతపరమాత్మ ఖండం కాలేదు । సముద్రంమీద తరంగ్గాలు కనిపిస్తె సముద్రంకు ఖండంకాలెనట్టు । ఆతరంగాలు సహితం అఖండసముద్రం । అట్లాసకల విశ్వసహితం అఖండపరమాత్మ వున్నాడు । తానూ అదెవున్నాడు । యిట్లాతనసహితం విశ్వంపరమాత్మ వున్నాడు । యిట్లాచూచెది । యిట్లాతెలిస్తె యిట్లాసమభావంతోటి । వుంటె దాని పేరు అవ్యభిచార భక్తి । యీభక్తితోటి సత్వరజస్తమోగుణాలు। యెమీలేకపోచున్నారు । బాహ్యాజ్ఞానంపేరుసత్వగుణం । విషయాసక్తిపేరురజోగుణం । మహాభ్రాంతి పేరు తమం । యివెమూడు గుణాలు । తనసహితం విశ్వం పరమాత్మ । యిట్లాచూపు ఆయితె । బాహ్యాజ్ఞానంలేకుండాను అవుతుంది । మోహభ్రాంతి లేకుండాను అవుతుంది । విషయాసక్తి లేకుండా అవుతుంది । యిట్లాను । వారుగుణాతీతం । అయినారు । గుణాలులేవు । గుణాతీతం అంటె యెమి । యిందుకోసానకు । అజ్ఞానికి గుణబంధనంలేదు । యీఅవ్యభిచారభక్తిచాత । **బ్రహ్మభూయాయకల్పతె** । అంటెను యేమి బ్రహ్మప్రాప్తి అవుతుంది। వానికి పునరాగమనం లేదు । పరబ్రహ్మస్వరూపంలో సమరసం అయిపోచున్నాడు। యిట్లాఅవ్యభిచార భక్తి । అపురుషునికి । యట్లాఅయ్యింది । పుణ్యప్రతాపంచాత । కర్మానుష్ఠానం చాత । తపోప్రతాపంచాత । భగవద్భజనప్రతాపంచాత । జన్మజన్మాంతర పాపంపొయ్యింది । నిర్మలం అయినాడు । జ్ఞానాధికారం అయ్యి । వివేకవైరాగ్యంపుట్టింది । సత్సహవాసంచెశినాడు। సద్గురునికి శరణుపోయినాడు । సద్గురువుమహావాక్యబోధచెశినాడు । మహావాక్యబోధచాత । మాయా అవిద్యా ఉపాధి నిరసనం అయ్యింది । జీవెశ్వరభెదాలు పోయినావి । అఖండైకరసం। బ్రహ్మ । కేవలచైతన్యం । తాను వున్నాడు । అనియిట్లా అనుభవం । అయ్యింది । ఆచైతన్యదృష్టిచాత। సకలవిశ్వంచూస్తె । అఖండైకరసచైతన్యమెవున్నాది । రెండోది యేమిలేదు। యిట్లా జ్ఞానిపురుషునికి అయినాది । దానిపేరు ఆవ్యభిచారభక్తి । దానిపేరు జ్ఞానం దాని పేరు యోగం । దాని పేరు మోక్షం । దాని పేరు బ్రహ్మసాయుజ్యం । దాని పేరు బ్రహ్మ ప్రాప్తి । యిట్లాఅనుభవంయవ్వరికి అయింది । వాడు బ్రహ్మ ప్రాప్తిపురుషుడు । వాడేసాధు । వాడే సంతుష్టుడు । వాడేసత్పురుషుడు । వాడేబ్రహ్మనిష్ఠ । వాడేయోగి । వాడే భక్తుడు । యిందుకోసానకు । యీ అవ్యభిచార భక్తి యోగ వివరణం ॥

౧౨ శ్రీ॥ గుణాతీతబోధ । భగవంతుడు పథ్నాల్గో అధ్యాయంలో చెప్పినాడు । స్వయం ప్రకాశచైతన్యం। చిన్మాత్రం । చిదాకాశం । చిదాకాశం అంటెను యేమి । జ్ఞానరూపం । ప్రకాశరూపం ఆనందరూపం। ఆకాశం । దానికి । అదీ అంత్యంలేదు । అదే భగవంతుని స్వరూపం । అదే తనస్వరూపం । ఆచిదాకాశం నుంచి । అహంయిట్లాస్ఫురణ అయ్యింది । ఆ ఆస్ఫురణయుక్త చైతన్యాంశ అయింది । దాని పేరు జీవుడు । ఆజీవునికి అహంస్ఫురణచాత । తాను పూర్ణచైతన్యం వున్నాది । విస్మరణఅయింది । ఆవిస్మరణపేరు అజ్ఞానం । ఆ అజ్ఞానంనుంచి అన్యథాజ్ఞానం పుట్టింది । ఆ అన్యథాజ్ఞానంలో సత్వరజస్తమోగుణం। యీ మూడుగుణాలు పుట్టినావి । బాహ్యాజ్ఞానం పేరు సత్వగుణం । బాహ్యావిషయాసక్తి పేరురజోగుణం । మోహభ్రాంతి పేరు తమోగుణం । యిట్లామూడుగుణాలు । అన్యథాజ్ఞానం నుంచి పుట్టినావి । యిట్లా మూడుగుణాలు దేహద్వయం అయ్యింది । ఆదేహద్వయంలో సకలకర్మాలు చెశెటివాడు । మూడు గుణాలె । యీ మూడుగుణాలతోటి జీవుడు తాదాత్మ్యం అయ్యినాడు । యిందుకోసానకు నేనుకర్త అంటాడు । సత్వగుణంచాతనిత్య నైమిత్తికం । సాత్విక కర్మ అవుతుంది। రజోగుణంచాత కామ్యకర్మం అవుతుంది । తమోగుణంచాత తామసీకర్మం అవుతుంది । యిట్లా త్రివిధకర్మములకు । కర్తనేనని కర్మంతోటితాదాత్మ్యం అవుతున్నాడు । సాత్విక కర్మంతోటిదేవలోకానకు పోయినాము అనిఅనిపిస్తుంది । రాజసకర్మచాత మనుష్యలోకానకు వచ్చినాము అని అనిపిస్తుంది । తామసకర్మంచాతను అధోలోకానకు పోయినాము అని అనిపిస్తుంది । తనస్వరూపంయరగక భ్రాంతిచాత తనకు యీగతిఆయనని। అనుకొంటాడు। యిట్లావుండంగా రజోగుణం తమోగుణం కిందికైసత్వగుణంచెస్తుంది ఆసత్వగుణ ప్రతాపంచాత । నిత్యా నిత్యవివేకం పుడుతుంది । ఆ నిత్యానిత్యవివేకంచాత ఆత్మజ్ఞానం అవుతుంది । యట్లాఅవుతుంది । దేహద్వయంనేను గాను । నేనుదేహద్వయాతీతం। స్వయం ప్రకాశ చైతన్యంవున్నాను । యీదేహద్వయంత్రిగుణం । త్రిగుణకర్మంయిది । అన్నీ అజ్ఞానకల్పితం। యిది మిథ్యవున్నాది । నేను చిదాకాశచిన్మాత్రం వున్నాను । నాకురాకడాపోకడా యెమీలేదు । నాకురాకడాపోకడా నా స్వరూప అజ్ఞానంచాత । రాకడపోకడా నాకు అనిపిస్తుంది। యిదిస్వప్నం వలెమిథ్యా । నాస్వరూపంస్వయంప్రకాశ చైతన్యం సత్యం కర్మాలచాత గతిఅవగతి అవుతుంది। అనేది మిథ్య । నేను సచ్చిదానంద అఖండైకరసం బ్రహ్మను వున్నాను । యిదిసత్యం। నాకు జీవుడని అనేది మిథ్య । నేను అఖండైకరసమును బ్రహ్మను । సచ్చిదానందమును । అద్వయమును । అదే భగవత్స్వరూపం । భగవత్స్వరూపం నాస్వరూపం స్వయంప్రకాశం । చిన్మాత్రఘనం । పరిపూర్ణం । యిట్లాఅజ్ఞానం నిశ్చయం । అయితెవాడు నాస్వరూపములో సమరసం అవుతున్నాడు । దీని పేరు గుణాతీతబోధ । యీబోధచాతగుణ బంధనం లేదు । దానిపేరు మోక్షం । యీ జ్ఞానం అయితె జన్మమరణసంసారం నుంచ్చి ముక్తుడు అవుతున్నాడు। యిదినిశ్చయం ॥ ఇతి శ్రీ జీవన్ముక్తకృతగుణాతీత బోధ ॥

౧౩ శ్రీ॥ భగవంతుడు పదిహేనో అధ్యాయంలో సంసారవృక్షం చెప్పినాడు । **అఖండైకరసం బ్రహ్మ సచ్చిదానంద మద్వయం । స్వయంప్రకాశమాత్మానం నిర్మలంగగనోపమం ॥** యిట్లాతన స్వరూపం వుండంగా మాయా అది చేశిజగదాభాసం కనిపిస్తుంది । యిదియేమి నిద్రవస్తె స్వప్నం యట్లాకనిపిస్తుందో । అట్లాజగదాభాసం కనిపిస్తుంది । తనస్వరూపంలో అహం యీలాగున స్ఫురణం అయింది । ఆస్ఫురణపేరు మాయా । ఆ అహంస్ఫురణకింద విస్మరణం పుట్టింది । ఆవిస్మరణం పేరు అజ్ఞానం । దేహవిస్మరణచాత యట్లానిద్ర వస్తుందొ । అట్లా ఆత్మ విస్మరణంచేత అజ్ఞానం పుట్టింది । ఆ అజ్ఞానం సంసారవృక్షమునకు బీజం । ఆ అజ్ఞానంచాత తనకు తాదాత్మ్యం అయ్యింది । దానినుంచిసంసారవృక్షంమొలిచింది । విత్తనంకు తడితనం తగిలింది । మొల్కవస్తుంది । అట్లా అజ్ఞానంచాత తాదాత్మ్యం అయితె । తనలోనెసంసారి మొలుక మొలుస్తుంది । ముందు అన్యథాజ్ఞానం పుట్టుతుంది । దాని పేరు మహత్తత్వం । మహత్తత్వం నుంచి త్రిగుణ అహంకారం । పుట్టుతుంది । అదియట్లాను । అన్యధాజ్ఞానం బుద్ధిపేరు । దాని పేరు సత్వగుణం । ఆ అన్యధాజ్ఞానం నుంచి విషయవాసనపుట్టుతుంది । దానిపేరు రజోగుణం మనుస్సు । అన్యథాజ్ఞానం నుంచి అహంకారంపుట్టుతుంది । దాని పేరు తమోగుణం । యిట్లామూడుగుణాలు మూడు శాఖలు। సత్వగుణ శాఖ నుంచ్చి అంతఃకరణ పంచకంకొమ్మలు పుట్టుతుంది । రజోగుణశాఖ నుంచి దశయింద్రియాలు కొమ్మలు పుట్టుతుంది । తామసఅహంకార శాఖ నుంచి పంచమహాభూతాలు కొమ్మలు పుట్టుతుంది । పంచమహాభూత శాఖ నుంచి పంచ విషయాలు పర్నాలు పుట్టినావి। యిట్లా అన్యధాజ్ఞానం నుంచి సంసారవృక్షం పుట్టింది । యివి అన్ని కూడి ముప్పైఆరు తత్వాలు అయింది । యిదేసకల జగత్తు । కొమ్మలునిర్మాణం అయింది । ఆ జగత్తుతో సత్వరజతమంచాత వ్యవహారం అవుతుంది। రజోగుణకర్మంచాత మనుష్యలోక శాఖలు । నిర్మాణం అయింది । తామసకర్మం చాత పశువులు ఆదిచేశి పాషాణ పరియంతరం అయింది । సాత్వికకర్మంచాత దేవలోకాలు విస్తారం అయింది। యిట్లా అజ్ఞానం నుంచి త్రిగుణం పుట్టింది । ఆత్రిగుణ కర్మంచాత బ్రహ్మాది సకల జగత్తు విస్తారం అయ్యింది। యీ సంసారవృక్షంకు అజ్ఞానం మూలం। అజ్ఞానం అంటెను యేమి । తాను స్వయం ప్రకాశచైతన్యం వుండంగా । అదియరుగడు। దాని పేరు అజ్ఞానం । ఆ అజ్ఞానం నుంచి సంసారవృక్షం సకల జగత్తుకనిపిస్తుంది । యీ అజ్ఞాన నిరసనం యంత పరియంతరంలెదో । అంతపర్యంతరం సంసారవృక్షంలో తిరుగుతున్నాడు। తామసకర్మాలచాత పశ్వాదియోనిలో తిరుగుతున్నాడు । రాజసకర్మంచాత మనుష్యయోనిలో తిరుగుచున్నాడు। సాత్వికకర్మాలచాత దేవలోకాలలో తిరుగుచున్నాడు । అట్లాతన స్వరూపం యరుగక తిరుగుడు తగిలింది । యంతపరియంతం ఆత్మ స్వరూపంయర్కలెదో । అంతపరియంతం తిరుగుడు తప్పదు యీ సంసారవృక్షంలో తిరుగుడునేను వల్లను అని బుద్ధి పుట్టితె యజ్ఞదానతపములు మొదలు చేశినానావిధసాధనం చెస్తె యీ సంసారవృక్షంలో చిక్కుబడుచున్నాడు । కింద్రా మీదా తిరుగుడుతప్పదు । యందుకుతప్పదంటె । అన్ని సాధనాలు

అన్యథాజ్ఞానంనుంచ్చి అవుచున్నావి । అన్యథాజ్ఞానంనుంచి సంసారవృక్షం పెరిగింది । యిందు కోసానకు తిరుగుడు తప్పదు । సాధనం చేస్తెదేవలోకానకుపొతారు । యిదీసంసారవృక్షమె। మనస్సుదేహానకువస్తె । ఆదీసంసారవృక్షమె । యిందుకోసానకు । నానావిధ సాధనంచాత అజ్ఞానం అన్యథాజ్ఞానం నిరసనం । సంసారవృక్షవేదనంకాదు । సంసారానకు మూలంఅజ్ఞానం। ఆ అజ్ఞాన నిరసనంగాకుంటె । సంసారంలో తిరుగుడుతప్పదు । యిందుకోసానకు । యిదిఅంత్తాసంసారం। నాశవంతం । అశాశ్వితం । అజ్ఞాన కల్పితం । మిథ్యా । యిట్లాతెలిశివైరాగ్యం పుట్టింది । వైరాగ్యంచాత వివేకం పుట్టింది । యీ వైరాగ్య వివేకంచాత సంసారం తెగిపొయ్యే కోసానకు । భగవద్భజనంచేస్తారు । భగవత్కృపచాత యవ్వరికి బ్రహ్మాత్మైక్యజ్ఞానం వున్నాది । వారి సహవాసం అవుతుంది । ఆ సత్సహవాసంచాత । గురుకృపచాత అవుతుంది । ఆగురువును। తద్బ్రహ్మాత్వం అనె యీలాగున బోధచేస్తాడు । యీ గురుబోధచాత । తనలో విచారం చేస్తాడు। స్థూల సూక్ష్మకారణదేహత్రయం। నేను కాదు । యీ దేహత్రయం । అజ్ఞానం అన్యథాజ్ఞానం । యిది నాకు లేదు । నాస్వరూపం స్వయంప్రకాశ చైతన్యం । బ్రహ్మవున్నాది । ఆస్వరూపానకు। నేను మరిచిపోయినాను । యిందుకోసానకు । సంసారంకనిపిస్తూవుండెను । యిప్పుడు నామీదగురుకృప అయ్యింది । నాది అజ్ఞానం అన్యథాజ్ఞానం పోయింది । నేను కేవల సచ్చిదానందా ఖండైకరసం బ్రహ్మంను వున్నాను । నాకు అజ్ఞానకల్పితం సంసారం లేదు । నాస్వరూపంతోటి చూస్తె సంసారం యక్కడాకనిపించదు । మాయా ఆదిజేశి బ్రహ్మాదికులు । ఆదిచేశి యీసకలజగదాభాసం నాస్వరూపంతోటి చూస్తె యెమీలేదు । నేను మాత్రం స్వయంప్రకాశ చైతన్యఘనం పరిపూర్ణం వున్నాను । యీ నాస్వరూపందితెలివిడి । నాస్వరూపంలో లయంఅవుచున్నాది । అట్లానేనుమాత్రం చైతన్యఘనం । పరిపూర్ణం వున్నాను । రెండోదియేమిలేదు। **ఏకమేవాద్వితీయ్యం బ్రహ్మ । నెహనానాస్తికించన** । ఇతి శృతి । యీఆత్మజ్ఞానంచాత అజ్ఞానమూలసహితం సంసారవృక్షఛేదనం అవుచుంది । ఆత్మ స్వరూపజ్ఞానంచాత సంసారం ఆభాసం అయింది । ఆత్మ జ్ఞానంచాత అజ్ఞాన మూల సంసారసహితం యక్కడాలేకపాయను । దీనిపేరుసంసారని వృత్తి । యిందుకోసానకు నరదేహానకువచ్చి సాధుసమాగమంచాత ఆత్మ జ్ఞానంసంపాదించవలెను । ఆత్మజ్ఞానంచాత సకల సంసారంనివృత్తి అయ్యి తన స్వరూపప్రాప్తి తనకు అవుతుంది । యిదినిశ్చయం । ఇతి శ్రీ జీవన్ముక్తకృతసంసారవృక్షఛేదన వివరణం ॥

౧౪ శ్రీ॥ పద్దెనిమిదో అధ్యాయములో భగవంతుడు అధిష్టాన వివరణ చెప్పినాడు ॥ కర్మం అయ్యేది అయిదుకారణాలు ॥శ్లో॥ **అధిష్టానంతథాకర్తాకరణం చపృథగ్విధం । వివిధాచపృథక్చేష్టా దైవం చైవాత్మపంచమం** ॥ అధిష్టానం అంటెను దేహం । కర్త అంటెనుజీవుడు। కరణం చపృథగ్విధం అంటెను బుద్ధి యింద్రియాలు । **వివిధాచపృథక్చేష్టా** అంటెను । దశవిధప్రాణాలు । దైవంచాత్ర పంచమంఅంటెను । యింద్రియ అధిష్టాత్రి దైవాలు । యీ

అయిదు నుంచి సకలకర్మాలు అవుతుంది । దేహానకు అధిష్ఠానంయందుకు అనవలెను । ముప్ఫైఆరుతత్వాలది ఆశ్రయస్థానం। జాగ్రత్స్వప్నసుషుప్తికి ఆశ్రమస్థానం । జీవునికి ఆశ్రమస్థానం। పాపపుణ్యాలకు ఆశ్రమస్థానం। సుఖదుఃఖానకు ఆశ్రమస్థానం । సాత్వికరాజసతామస కర్మానకు ఆశ్రయస్థానం । ఆ ఆశ్రయస్థానానకు అదిష్ఠానం అనవలెను । యిందుకోసానకు । దేహానకు ఆశ్రయస్థానం ఆనవలెను । యీదేహంవొక్కటి । కర్మ కారణకర్త జీవుడు రెండో కర్మ కారణం। ఆ జీవుడు కర్తయట్లాఅంటెను । చైతన్యస్వరూపం ఆత్మ । ఆ ఆత్మది ప్రతిబింబం జీవుడు విజ్ఞానమయకోశం బుద్ధి । ఆ బుద్ధిలో చైతన్యం ఆభాసం అయింది । దాని పేరు జీవుడు అహం యిట్లాస్ఫురణ బుద్ధిలో అవుతుంది । దాని పేరు ప్రతిబింబం । జీవుడు । ఆజీవునికి తానుచైతన్యస్వరూపం వున్నాను అనె జ్ఞానంలేదు । మనుస్సు యింద్రియాల తోటికర్మం అవుతుంది । దానికి కర్తను నేను । అంటాడు । యెందుకోసానకు అంటాడు అంటె । దేహాత్మబుద్ధిచాత అంటాడు । యిందుకోసానకు । ఆజీవునికికర్త అనవలెను । యీ జీవకర్త కర్మది రోండో కారణం । కారణ కారణ । పృథగ్విధం । కర్మది । మూడోకారణం । అది యట్లాఅంటెను । దశయింద్రియాలు । సకలకర్మాలు యింద్రియాలతోటి అవుతున్నావి । వాగింద్రియంతోటి మాత్రం అనవలెను । పాణింద్రియంతోటి మాత్రం చయ్యవలెను । నేత్రంతోటిచూడవలెను । పాదాలతోటినడువవలెను। అధోద్వారాలతోటి మలమూత్రవిసర్జనం చాయవలెను । శ్రవణంచాత వినవలెను । త్వక్కుచాతస్పరిశంపుచ్చుకొనవలెను । జిహ్వాచాత రసంపుచ్చుకొనవలెను । ఘ్రూణంచాత పరిమెళం పుచ్చుకొనవలెను । సాత్వికరాజస తామసకర్మాలు। వాక్కు పాణిచాత । మంత్రములు తంత్రములు అవుచుండెవి । స్వధర్మకర్మం ప్రపంచంవ్యవహారం । అన్నియింద్రియాలతోటి । అవుతుంది । యిందుకొసానకు । యింద్రియాలు। మూడోకర్మకారణం । **వివిధాచవృధక్చేష్టా** యిదినాల్గోకర్మకర్థం । **వివిధాచపృథక్చేష్టా** అంటెను । దశవిధప్రాణాలు । వ్యానసమానవుదాన ప్రాణ అపాన నాగకూర్మకృకరదేవదత్త ధనంజయ । యివ్విదశవిధప్రాణాలు । వ్యానం సర్వనాడీల వుండి అన్నరసం సర్వనాడీలకు వ్యాపకం చేస్తాడు । సమానం నాభిస్థానంలో వుండి సర్వ సంధులలో వచ్చి । సర్వసంధులూ ఆడిపిస్తున్నాడు । వుదానంకంఠములోవుండి స్వప్నంచూపిస్తున్నాడు । ప్రాణం హృదయం నుంచి భృకుటి పర్యంతరంవుండి । శ్వాసలు శ్వాస । క్షుధాతృష్ణచేయిస్తాడు। అపానం । కటిప్రదేశంలో నుండి మలమూత్రం బైటవేయిస్తాడు। నాగంముక్కులో నుండి తుమ్ములు చేయిస్తున్నాడు । కూర్మంకన్నుల్లో నుండి రెప్పలల్లాడిస్తున్నాడు । కుకురుచెవులలో నుండి గూర్బిలిబైటవేయిస్తున్నాడు । దేవదత్తంభృకుటిలో నుండి । నటనంచేయిస్తున్నాడు । ధనంజయ। బ్రహ్మరంధ్రంలో నుంచి బ్రహ్మరంధ్రంలో ఆడిపిస్తున్నాడు । యీలాగున దశవిధప్రాణాలు । నాలుగోకర్మ । కారణం । దైవంచైవాత్రి పంచమం । యిదే దైవాధి । అయిదో కారణం । అదియట్లాగంటె । అంతఃకరణలో దైవతం । విష్ణు । మనుస్సుకు దైవతం చెంద్రుడు। బుద్ధికి దైవతం బ్రహ్మదేవుడు । చిత్తానకుదైవతం నారాయణుడు । అహంకారానకు

దైవతంరుద్రుడు । శ్రోత్రానకు దైవతందిశాదైవతం । త్వగ్దైవతం వాయుదేవత । చక్షువుకుదైవతం సూర్యుడు । జిహ్వాకు దైవతం వరుణదేవుడు । ఘ్రాణానకుదైవతం అశ్వినీదేవతులు । వాక్కుకుదైవతం అగ్నిహోత్రుడు। హస్తాలకు । దైవతం ఇంద్రుడు । పాదాలకు దైవతం ఉపేంద్రుడు । శిశ్నానకు దైవతం ప్రజాపతి । గుదానకుదైవతం నైర్రుతి । యీదేవతులతోటి యింద్రియచలనం । అవుతుంది । యిందుకోసానకు । అధిదైవతంఅనవలెను । యీఆదిదైవతలు। కర్మకు అయిదోకారణం । శరీరంకర్త జీవుడు । యింద్రియాలు ప్రాణాలు దైవతాలు । యీ అయిదు । ఒక్కజాగాలో అయితె దాని నుంచి సకలకర్మాలు అవుచుంది । యిందుకోసానకు యీ అయిదు కర్మకారణం। యీ అన్ని కర్మకార్యం । ఆత్మ యీకార్యం కారణంకాడు । ఆత్మసత్తాచాత యీ కారణం నుంచ్చి యీ కర్మాలు అవుతున్నావి । ఆత్మస్వరూపంలో కర్మలేదు। ఆత్మకర్తకాడు । ఆత్మనిష్కర్మ । చైతన్యంఅకర్త ॥శ్లో॥ **అకర్తాహమభోక్తాహమసంగః పరమేశ్వరః । సదామత్సంన్నిధా నేనచెష్టతెసర్వమింద్రియం** । ఆ ఆత్మను తానువున్నాను । అని యీలాగున తెలియవలెను । మరికర్మది । అయిదు హెతువులు వున్నావి । అదియట్లాను ॥శ్లో॥ **శరీరవాఙ్మనోభిర్యాత్ కర్మప్రారభతెనరః । న్యాయంవావిపరీతంవా। పంచైతెతస్యహేతవః ।** యీ అయిదు హేతువులు యట్లాయట్లా అవుచున్నావి । మనుస్సులో కర్మం చెయ్యవలెనని యీలాగున సంకల్పం అవుతుంది । ఆసంకల్పం వాక్కుచాత పలికిస్తున్నారు । ఆపలుకులచాత శరీరం తోటికర్మం అవుతుంది । ఆకర్మం శాస్త్రవిధిచొప్పున । అయితెన్యాయం । అవిధిచొప్పున అయితె అన్యాయం । యీ అయిదు । మనుస్సు వొక్కటి । వాక్కు వొక్కటి । శరీరంవొక్కటి । న్యాయం వొక్కటి । అన్యాయం వొక్కటి । యీ అయిదుహేతువులు అయిదు హేతువులుగావు। ఆత్మయీసకలానకు అధికం యట్లాను । తెలియవలెను । పంచకారణంకర్మకర్తా అదియట్లాను ॥శ్లో॥ **తత్రైవసంతికర్తార మాత్మానం కేవలంతుయః । పశ్యత్యకృతబుద్ధి త్వానసపశ్యతిదుర్మతిః ।** తత్రైవసంతి అంటెను యెమి । అయిదుకారణములు। అయిదు హేతువులు । దానినుంచి సకలకర్మం అవుతుంది । యిందుకోసానకు సకలకర్మాలకు కర్తారం అయిదు కారణం । అయిదుహేతువులు । తాను ఆత్మకేవలం । కర్తాతనం । భోక్తాతనం। కర్మాలు యివ్వి । ఆత్మ స్వరూపంలో యెమీలెవు । యట్లాలేవంటెను । ప్రథమకారణం శరీరం। ఆ శరీరం పంచభూతాలది। మాంశ । యిందుకోసానకు ఆత్మ పంచభూతిక శరీరంకాడు । కర్తజీవుడు రెండోకారణం ఆత్మప్రతిబింబం । అదిమిథ్య । ఆప్రతిబింబ జీవుడు ఆత్మకాదు । మూడోకారణం। యింద్రియాలు । యీ యింద్రియాలు ఆత్మకాదు । నాల్గోకారణం । ప్రాణాలు ప్రాణాలు । ఆత్మగాడు । అయిదోకారణం దేవతులు । దేవతులు ఆత్మగాదు । ఆత్మ వచ్చి అయిదుకారణాలకు ప్రకాశకుడు । సాక్షి । అధిష్ఠానచైతన్యం । స్వయంప్రకాశం పరిపూర్ణం । నిరాకారం । నిరాభాసం । నిర్వికారం । చైతన్యం మాత్రం వున్నాడు । యీ ఆత్మస్వరూపం యిట్లాయెరింగి జ్ఞాని ఆత్మస్వరూపానకు అకృతబుద్ధిచాత చూస్తాడు । ఆత్మయెమీకర్తగాడు । దృష్టాంతరం । సూర్యప్రకాశంచాత । అందరు జగత్తు । తమతమవ్యవహారం చెస్తారు । ఆ

జగద్వ్యవహార వ్యవహారకర్త సూర్యుడుగాడు। అట్లా ఆత్మసత్తాచాత । యీ అయిదు కారణం। యీ అయిదు హేతువుల నుంచ్చికర్మాలు అవుచున్నావి । ఆత్మప్రకాశ సాక్షి అక్కడ కర్మాలు కర్మాలు యెమీలెవు । ఆత్మకేవల చిన్మాత్ర చైతన్యఘనం । పరిపూర్ణం వున్నాడు । యిట్లాజ్ఞాని చూస్తాడు । **"నసపశ్యతిదుర్మతిః"** । అంటెను। తాను । సర్వసాక్షి చైతన్యం వుండంగా ఆ స్వరూపానకు మరిచిపోయి దేహమెనేను అని అంటాడు । మరి కొందరు తెలిశినవారలు నేను జీవుడను అంటారు । తాను తనస్వరూపం దేహత్రయాతీతం అవియెరుంగడు । నేనే జీవుడ నేనే దేహము । నేనుకర్త । నేనుభోక్త । యిట్లా యెవ్వడు తనకుమన్నిస్తాడు । వాడు దుర్మతి । అనవలెను । తనస్వరూపం అయిదు కారణాలు అయిదుహేతువులు । దాని నుంచి అతీతం । కేవలనిరాభాసం । నిష్కర్మం । అకర్త । ఆ భోక్త । కేవలచైతన్యం । యీలాగున తన స్వరూపం వుండంగా అది యెరుంగడు । పంచకారణానకు నేనే అని కర్తా అంటాడు । తన స్వరూపం యెరుంగక । దేహాభిమానంచాత అంటాడు । వాన్నిదుర్మతుడు అనవలెను । జ్ఞానికి దుర్మతిలేదు। అజ్ఞానితన స్వరూపం యెరింగి అస్వరూప స్థితితోటి వుంటాడు । వానికి కర్తృత్వం। కర్మభోక్తృత్వం యీకర్మబంధనం । జ్ఞానికిలేదు । అయిదుకారణాల నుంచి సకలకర్మం అవుతుంది। ఆకర్మకర్తృత్వంది అహంకారం జ్ఞానికిలేదు। యిందుకోసానకు । జ్ఞానికి కర్మ బంధనంలేదు । అజ్ఞాని ఆత్మ జ్ఞానంచాత । పరబ్రహ్మమే అయ్యివుంటాడు । యిట్లాజ్ఞానం అయితె ఆ జీవుడు ముక్తుడు । అవుతున్నాడు । వానికి జీవన్ముక్తుడు అనవలెను । యిదినిశ్చయం। యితిజీవన్ముక్తకృత అధిష్ఠాన వివరణం ॥

౧౫ శ్రీ॥ భగవంతుడు పద్దెనిమిదో అధ్యాయంలో గీతావుపదేశం సమాప్తిలో చెప్పినాడు । శ్లో॥ **"సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజేత్"** । యిట్లావాక్యంచెప్పినాడు । సర్వధర్మం పరిత్యాగం చేశినేను వొక్కటివున్నాను । మాకుశరణంవ్రజేఅంటె యేమి । మాకు శరణురా యిట్లా అనిచెప్పినాడు । యిదినిదానం మాట । సర్వధర్మపరిత్యాగంఅంటె । యేమి । చైతన్య స్వరూపం మిద । మాయా అవిద్యా ఉపాధిధర్మం యేమేమివున్నాదో । దానికే వివేకంచాత త్యాగంచాయవలెను । అది యట్లాచాయవలెనంటె । నేనుదేహత్రయాతీతం సాక్షి చైతన్యంవున్నాను ॥శృతి॥ **"త్రిషుధామసుద్భోగ్యం భోక్తాభోగశ్చయద్భవేత్ । తెభ్యోవిలక్షణస్సాక్షి। చిన్మాత్రో హంసదాశివః"** । యిట్లాసర్వరూపం వున్నాది । అనా స్వరూపంలో యేమిధర్మం లేదు। దేహత్రయములో సర్వధర్మం అవుతుంది । దానికీ నాకూ సంమంధంలేదు । యెందుకు లేదంటెను । అజ్ఞానధర్మం అన్యధాజ్ఞానం । ఆ అన్యధాజ్ఞానసహితం నా స్వరూపంలో లేదు । నా స్వరూపం కేవల చిన్మాత్రంవున్నాది । అన్యధాజ్ఞానం నుంచి లింగదేహం అయ్యింది । లింగదేహం నాలోలేదు । యట్లాలేదు । అంతఃకరణధర్మం నిర్వికల్పస్ఫురణ । మనోధర్మం సంకల్పం వికల్పం బుద్ధి ధర్మం అనుసంధానం । అహంకార ధర్మం అహంమమత్వం । యీ అంతఃకరణపంచకంనేను గాను । అంతఃకరణ పంచకధర్మం నాకు లేదు । శ్రవణ ధర్మం

వినేది। త్వక్కుధర్మం స్పర్శం పుచ్చుకునెది । చక్షుధర్మం చూచెది । జిహ్వాధర్మంరసం పుచ్చుకునెది। ఘ్రాణధర్మం పరిమెళం పుచ్చుకునెది । యీ అయిదు జ్ఞానేంద్రియాలు । యివ్వినా స్వరూపంలో లేవు । యీ యింద్రియధర్మంనాకులేదు । వాక్కు ధర్మం పలికెది । పాణిధర్మం చేశెది । పాదధర్మంనడిచెది। శిశ్నధర్మం మూత్రం చేశెది । గుదధర్మం మలత్యాగం చేశెది । యీ అయిదుకర్మేంద్రియాలు । నా స్వరూపంలో లేవు । ఆకర్మేంద్రియాల ధర్మం నాకు లేదు । వ్యానధర్మం సర్వాంగములో వుండెది । ఉదానధర్మం కంఠంలో వుండి స్వప్నము చూచెది । ప్రాణధర్మం హృదయములో వుండిక్షుత్తృష్ణాశ్వాసోశ్వాస చేశెది । అపానధర్మం కంఠపు దేశంలో వుండి మలమూత్రంబైట వెశెది । ధర్మం । యీ పంచప్రాణంనా స్వరూపంలో లేదు । ప్రాణధర్మం నాకు లేదు । పంచవిషయాలు మా స్వరూపంలో లేదు । విషయధర్మం నాకు లేదు । పాంచభూతికశరీరం నాస్వరూపంలో లేదు । శరీరధర్మం నాకు లేదు । శరీరధర్మం అంటె యేమి । గర్భంలో వుండెది । జన్మించెది । బాల్యత్వంచాత వుండెది । తారుణ్యం వయస్సుచాత వుండెది । వృద్ధాప్యంచాత వుండెది । మృత్యువు అయ్యేది । యీ షడ్వికారధర్మం శరీరంవి । నాస్వరూపంలొలేదు । నాకు శరీరధర్మం లేదు । రజోగుణంది జాగృతి ధర్మం । సత్వగుణంది స్వప్నధర్మం । తమోగుణంది సుషుప్తి ధర్మం । యీత్రిగుణం నాస్వరూపంలో లేదు । యీ గుణధర్మం నాకు లేదు । సత్వగుణంది నిత్యనైమిత్తిక ధర్మం । రజోగుణంది । కామ్యకధర్మం। తమోగుణంది । తామసధర్మం । యీత్రివిధగుణ ధర్మం । నాస్వరూపంలో లేదు । శరీరందివణరాశ్రమకర్మం । నేనుకేవలచైతన్యం । స్వరూపంనాలో లేదు । యివ్వి అన్ని అజ్ఞానము ఆదిజెశి అవిద్యారూపం । ఆనాస్వరూపంలో యెమిలేదు । యీ అన్ని కర్మకర్తనేను। గాను । కర్మఫలభోక్త నేనుగాను । యిదిఅంతామాయామయం మిథ్యా । నాస్వరూపంలో యెమిలేదు। నాస్వరూపం దేహత్రయాతీతం । దేహత్రయప్రకాశకసాక్షిచైతన్యం । ఆనాస్వరూపం నిష్కర్మం। నిర్ధర్మం । అక్కడకర్మధర్మవార్త యెమిలేదు । యిట్లాతనస్వరూపంయెరింగి । కర్మాభిమానం త్యాగంచేశెది । దీనిపేరు సర్వధర్మం । పరిత్యజ్య యీ వివేకంచాత । కర్మత్యాగంచెశి నేనుపరమాత్మ । నాకు శరణురావలెను । అనిభగవంతుడు అంటాడు । మరియవ్వరైనా అనెరు। కర్మత్యాగం చేశివూరికె వుండవలెగదా । యిది యెమిమాటవూరికె వుండెది । అది వొఘుకర్మం। యెందుకోసానకు । శరీరధర్మం । వర్ణాశ్రమధర్మం । గుణధర్మం । యింద్రియధర్మం। ప్రాణధర్మం। మనోధర్మం । యివి అన్ని అయ్యేది అవుతుంది । తనస్వరూపం చైతన్యం । చైతన్యసత్తాచాత యివిఅన్నికర్మాలు అవుతుంది । తాను చైతన్యస్వరూపుడు । తనకు యిదియెమీలేదు । యిట్లాతనస్వరూపమెరింగి కర్మాభిమానమెరింగి త్యాగంచాయవలెను । యీ అభిమాన త్యాగం పేరుసర్వధర్మ పరిత్యాగం । సర్వధర్మాతీతం తన స్వరూపం । సాక్షి రూపచైతన్యం । మాయాధర్మరహితం । ఈశ్వరస్వరూపం । ప్రత్యక్‌చైతన్యం। ప్రత్యక్‌చైతన్యం పూర్ణ చైతన్యం అయిక్యం వున్నాది । యిట్లాయెరింగెది । దానిపేరు మామేకం శరణం । యిఘను ఈశ్వరమాయాధర్మం యేదెది । మాయాంగీకారంచాత జగత్తు ఉత్పత్తి చెయ్యవలెను।

పాలనంచాయవలెను । సంహారంచాయవలెను । యీత్రివిధధర్మం మాయామయంమిథ్య । ఈశ్వరరూపంలో యెమిలేదు । యిషువంటి ఈశ్వరపరమాత్మ కేవలచైతన్యమాత్రం వున్నాడు। ఆచైతన్య స్వరూపమెనేను వున్నాను । యిట్లాయెరింగెది దాని పేరు శరణం । యిందుకు దృష్టాంతరం । తరంగంవుదకంతోటి యట్లాఅయిక్యంవున్నాది। అలంకారంబంగారంతోటి యట్లా అయిక్యంవున్నాది । అట్లానేనుప్రత్యక్చైతన్యమును । అట్లాపూర్ణచైతన్యంకు అయిక్యంవున్నాను। యీ అయిక్యంపేరు శరణం । యీ ప్రకారంచాత నాకు శరణంరావలెను । యిట్లాగున భగవంతుడు చెప్పినాడు । **"అహంత్వా సర్వపాపేభ్యోమోక్షయి ష్యామిమాశుచ"** । యిటా అంటెనుయెమి । బ్రంహ్మస్థితితోటి వుంటాడు । వానికి కర్మం మీదమనుస్సు లేదు । కర్మం నిలుస్తుంది । కర్మంనిలిస్తె ప్రత్యవాయదోషంపుట్టింస్తుంది । ఆప్రత్యవాయ దోషం పేరుపాపం। ఆపాపంనుంచి నీకు నేను విడిపించి । కర్మంనిలిచింది గదా అని । శోకంచాయవద్దు । యిట్లాభగవంతుడు చెప్పినాడు । పరబ్రహ్మస్వరూపంలో అయిక్యమైవుంటె । వానికి పుణ్యం లేదు పాపం లేదు । పుణ్యపాపం లింగదేహధర్మం । లింగదేహం ఆత్మ స్వరూపంలో లేదు । పుణ్యపాపంలేదు । యెందుకులెదంటె । నా పుణ్యం నాపాపం నాసౌఖ్యం నాదుఃఖం । యీ లాగున పెద్దలు చెప్పినారు । దేహేంద్రియాలతోటికర్మం అవుతుంది పుణ్యకర్మం అయితె జ్ఞానికి పుణ్యం లేదు । పాపకర్మం అయితెజ్ఞానికి పాపంలేదు । నిరాకారనిరాభాసనిష్ప్రపంచం। స్వయంప్రకాశచైతన్యం । చిదాకాశం । ఆత్మజ్ఞాని వున్నాడు । కర్మత్యాగం అయితె వానికి పాపంలేదు । విధి పూర్వకంకర్మం అయితె వానికి పుణ్యంలేదు । యీకర్మపాపపుణ్యం స్థూల సూక్ష్మ శరీరం । యీ అన్ని మాయామయం । మిథ్యవున్నాది । జ్ఞానికేవల పరబ్రహ్మం అయివున్నాడు। వానికి యెమిలెదు । "సర్వధర్మాన్‌పరిత్యజ్య" । యీ శ్లోకంలో గహనార్థంవున్నాది। యిదిభగవద్వాక్యం । యట్లాఅర్థంచేస్తె అట్లా అవుతుంది । యిది నిశ్చయం ॥ ఇతి శ్రీ జీవన్ముక్తకృతగీతా ఉపదేశం సమాప్తిలో సర్వధర్మపరిత్యజ్య వివరణం॥

**౧౬** శ్రీ॥ **"సర్వ గుహ్యతమంభూయః"** । **శృణుమేపరమంవచః । గుహ్యాద్గుహ్యతరం మమవాక్యం శృణు॥** యిట్లాభగవంత్తుడు చెప్పినాడు । యిదియేదెది అంటెను ॥ **"మన్మనాభవమద్భక్త మద్యాజీమాంనమస్కురు"** । **మామేవేష్యసిసత్యంతె ప్రతి జానేప్రియోసిమే॥** నీవునాకు ప్రియుడవువున్నావు । యిందుకోసానకు ప్రతి జానెఅంటె । ప్రతిజ్ఞచేశి చెప్పుచున్నాను। **"మన్మనాభవ"** అంటెను । మనుస్సుచాతనేనుగా మద్భక్తుడవుగా । మద్యాజిగా । నాకునమనం చెయ్యి । యిట్లాచేస్తె నాప్రాప్తి నీకు అవుతుంది । సత్యం । మనుస్సుచాత నేనుయెట్లా కావలెను। మనుస్సు అంటె యేమి । అంతరంలో అహంసంకల్పం అవుతుంది । దాని పేరు మనుస్సు । ఆమనుస్సులో చైతన్యం ఆభాసం అయ్యింది । దానిపేరు జీవుడు । ఆజీవుడు అహం సంకల్పంతోను వొక్కటె అయివున్నాడు । ఆజీవునికి అహంసంకల్పందేహంమీద అయింది । యిందుకోసానకు జీవునికి సంసారం తగిలింది । ఆజీవునికి భగవంతుడు ఉపదేశం చేస్తాడు।

**"మన్మనాభవ"** । యిది ఉపదేశవాక్యం । ఆజీవుడుయీవాక్యంది । విచారం చేస్తాడు । మనుస్సుచాత నేనుగా అన్నాడు । నేను యెవ్వరువున్నాను । యీ విచారం మనుస్సుతోటి చేస్తాడు । యట్లాచేస్తాడు । నేను పాంచభూతిక శరీరంనేను గాదు । యిరువైఅయిదు తత్వాంలది। లింగదేహంనేనుగాదు । అజ్ఞానకారణదేహం నేనుగాదు । దేహత్రయానకు అతీతం । దేహత్రయానకు సాక్షి చైతన్య స్వరూపం వున్నాను । దేహత్రయానకు ప్రత్యక్‌నేను వున్నాను । యిందుకోసానకు నాకు ప్రత్యక్ చైతన్యం అనవలెను । యిట్లా జ్ఞానం అయితె । మనుస్సు ప్రత్యక్చైతన్యంలో కలిశిపోయింది । అప్రత్యక్చైతన్యం నేను । అదేపూర్ణచైతన్యం । పరమాత్మకు యిట్లాయెరింగితె మనుస్సు పూర్ణచైతన్యంతోటి వుంటుంది । దానిపేరు **"మన్మనాభవ । మద్భక్తోభవ"** । అంటెను యేమి । మద్భక్తుడవుగా । ఆభక్తియట్లా । యట్లాచాయవలెను । వాచాతోటినామస్మరణచెయ్యవలెను । హస్తంతోటి హరిపూజచాయవలెను । పాదాలతోటి హరియాత్రకు పోవలెను । కన్నులతోటి హరిరూపంచూడవలెను । శ్రోత్రంతోటి హరి కీర్తనవినవలెను । జిహ్వాతోటిహరికీర్తన ప్రశంసహరిప్రశంస తీసుకొవలెను । ఘ్రాణంతోటి హరినిర్మాల్యపుష్పం అఘ్రాణంచాయవలెను । హరినిర్మాల్యగంధం నుదిటికి శరీరంకు పెట్టుకునవలెను । అధోద్వారానకు నియమంచాయవలెను । సర్వాంగంతోటి సాష్టాంగ నమస్కారం చాయవలెను । మనుస్సుతోటి హరిమీద ప్రేమవుంచ్చవలెను । బుద్ధితోటి హరిరూపం యెరుంగవలెను । చిత్తంతోటి హరిచింతన చాయవలెను । అహంకారంతోటి నేను హరిదాసుడను అనవలెను । శరీరంతోటి స్నానం సంధ్యానిత్యనైమిత్తిక కర్మయేమెమి అవుతుందో అది అంత్నాహరికి అర్పణం చాయవలెను । మరీదారపుత్రాదులు బిడ్డలు । గృహంధనం ధాన్యం పశువులు ఆదిజేశి యిది అంత్నాహరికి అర్పణంచాయవలెను । మంత్రానుష్ఠానం । యజ్ఞం । తపం । బ్రాహ్మణులకు । సాధుసంతులకు । అన్నదానం వస్త్రదానం ద్రవ్యదానం యేమెమి చాయవలసునో అది అంతాను హరికి అర్పణం చాయవలెను । తనది అంతర్బాహ్యాం సర్వం హరికి అర్పణంచెయ్యవలెను । దానిపేరు భక్తి । యిట్లానాభజనం చెయ్యవలెను । అని భగవంతుడు చెప్పినాడు । **మద్భోక్తాభవ** అని । **మద్యాజీభవ**। యీ వాక్యం చెప్పినాడు । బాహ్య యాగం అగ్నిహోత్రములో చెయ్యవలెను । అదినా పేరుచాత। **యజ్ఞో వైష్ణురితి శృతి"** । తొమ్మిదో అధ్యాయంలో భగవంతుడు చెప్పినాడు । **"అహంక్రతుం హంయజ్ఞః సదాహమహమౌషధం । మంత్రోహమ హమేవాజ్యమహమగ్నిరహంహుతం"** । యిట్లా యెరింగి బాహ్యాయజ్ఞంచేశిహరికి అర్పణ చెయ్యవలెను । **"అంతరయజ్ఞంజ్ఞానయజ్ఞానచాప్యన్యేయెంతొ మాముంస సతే** । జ్ఞానాగ్నిచాత అవిద్యదేహ బుద్ధి । దేహాహంకారం । మనబుద్ధియింద్రి యాలదిక్కు విషయాలదిక్కు । యిదిసమస్తం జ్ఞానంచాతనిరసనం చేశితనవృత్తి అంతర్ముఖం చేశి । స్వయంజ్యోతి స్వయం ప్రకాశబ్రహ్మలో వెయ్యవలెను । సదాసర్వదా స్వరూపాను సంధానం వుండవలెను । యిట్లావృత్తి ఆస్వయంప్రకాశచైతన్యంలో లయం అయితె మిగులుతుంది కేవలచైతన్యం । ఆశేషం పుచ్చుకొనవలెను । అదే అయివుండవలెను । దానిపేరు

యజ్ఞం । యిట్లాబాహ్యాయజ్ఞం అంతర్యజ్ఞం హరికి అర్పణం చెయ్యవలెను । దానిపేరు **మధ్యాజీ మాంనమస్కురు ।** యీవాక్యం చెప్పినాడు । నేనుసర్వబుద్ధిలో వున్నాను । యిందు కోసానకు బ్రహ్మాది పిపీలికాపర్యం తరంసకల విశ్వంనేనువున్నాను । యిట్లా యెరింగి సర్వంనాకు నమనంచెయ్యవలెను । దానిపేరు మాన్నమస్కురు । యిట్లామనుస్సుచాత భక్తిచాత యజనం చాత । నమనంచాత యీనాల్గు విధముల చాత మాభక్తి చేస్తె నా ప్రీతి అవుతుంది । యిదిసత్యం। మా ప్రతిజ్ఞ యిదినావాక్యం నీకు చెప్పినాము । నీవునాకు ప్రియుడవు । నా భక్తుడవువున్నావు। యింమకోసానకు నీకు చెప్పినాము । యిది పరమగుహ్యం యెవ్వరికి చెప్పలేదు । నీవు నాకు ప్రియభక్తుడవుగనక చెప్పినాము । యీ నాల్గు విధాలతోటి యెవ్వరునాభక్తి చెస్తే । నా ప్రాప్తి వారికి అవుతుంది । యిది నామనుస్సుదిగుహ్యార్థం చెప్పినాము ।యిట్లాయెవ్వరు భక్తి చేస్తారు। వారికి మాప్రాప్తి అవుతుంది । యీలాగున అర్జునునికి భగవంతుడు చెప్పినాడు। యిది విశ్వాసంతోటి మన్నించవలెను । యిదినిశ్చయం । ఇతి శ్రీజీవన్ముక్తికృత సర్వగుహ్య వివరణం॥

౧౭ శ్రీ॥ భగవంతుడు పదిహెడో అధ్యాయంలో **"ఓంతత్సదితినిర్దేశ"** వివరణం । **"ఓంతత్ సత్"** । మూడు అక్షరాలది మంత్రం । కల్పాదివెళ్లకు బ్రంహ్మదేవునికి చెప్పినాడు । యీ మంత్రంది అనుష్ఠానం । బ్రహ్మదేవునికి చెప్పినాడు । వారికి సృష్టినిర్మాణంచెశెసామర్థ్యం వచ్చింది। **ఓంతత్సత్** । యీమంత్రం । సప్తకోటి మహామంత్రహ్యాసంఖ్యావుప మంత్రకం యీసమస్త మంత్రముల్లో విష్ణు మంత్రం । శివమంత్రం । శక్తి మంత్రం । అన్ని దైవతమంత్రాలు అన్ని వచ్చినావి । గాయత్రీ మంత్రం ఆదిచేశి సకలమంత్రములది బీజం । ఓంకారం । ఓంకారం లోపటతత్కారం । తత్కారంలోపట సత్కారం । యిందుకోసానకు । యీ మూడు అక్షరాలు కూడా వొక్కమంత్రం । యీ మంత్రం మీదయేమంత్రం లేదు । సకలమంత్రాలకూబీజం యీమంత్రం । నాలుగు వేదాలకూ బీజం । యీ మంత్రం । శాస్త్రపురాణాలు । భారతం । భాగవతం । భగవద్గీతా । ఉపనిషత్తులు । సర్వానకు బీజం । యీ మంత్రంయవ్వరు అనుష్ఠానం చేశెరు వారికి బ్రహ్మప్రాప్తి అయ్యిని । యీ మూడు అక్షరాలది మంత్రం చెప్పచున్నాను । **ఓమిత్యేకాక్షరంబ్రహ్మ** । అష్టమాధ్యాయంలో భగవంతుడు చెప్పచున్నాడు । **ఓం**యీరీతి । బ్రహ్మం। **తత్**బ్రహ్మ **। సత్**బ్రహ్మం । యీ మూడు అక్షరాలు వొక్కబ్రహ్మం । ఓంకారమంటె యేమి । స్వయంప్రకాశ చైతన్యం । కేవలబ్రంహ్మం । ఆ బ్రహ్మ నుంచి స్ఫురణం అయింది । అదేబ్రహ్మ స్ఫురణం । యిందుకోసానకు । యీ స్ఫురణ రూపం ఓంకారబ్రహ్మమే । యీ స్ఫురణం యెవ్వరి నుంచి అయింది । దానికి తత్ అనవలెను । అదే తద్బ్రహ్మం । ఆతద్బ్రహ్మం యిట్లాఅనాది నుంచి వున్నాదో అట్లాగె వున్నాది । దానికోసానకు సత్అనవలెను । **ఓంతత్సత్** మూడు అక్షరాలు గూడా వొక్కబ్రహ్మమె । వోంకారంది విస్తారం అయింది। తత్బ్రహ్మం యిట్లావున్నాదో అట్లాగెవున్నాది । ఓంకారం స్ఫురణరూపం దానిది విస్తారం అయింది। అస్ఫురణం అర్థమాత్ర । యందుకుఅనవలెను । అక్షరం ఉచ్చారం లేదు । యీ స్ఫురణం

ధ్వనిమాత్రం । దానికోసానకు అనవలెను । ఆ అర్ధమాత్రం । అర్ధమాత్రనుంచి మకార మాత్ర పుట్టింది । మకారమాత్రఅంటె యేమి । ఆస్ఫురణం నుంచి అధోముఖం ఆస్ఫురణం కింద విస్మరణం పుట్టింది । ఆవిస్మరణం మరుపు । దాని పేరు మకారమాత్ర । ఆమకార మాత్రనుంచి ఉకారమాత్ర పుట్టింది । విస్మరణంమకారమాత్ర । దానినుంచి అధోముఖం స్ఫురణంఅయింది। దానిపేరు ఉకారమాత్ర । ఆఉకారమాత్రనుంచ్చి అకారమాత్ర పుట్టింది । యిట్లా అకార ఉకార మకారం కూడా సమస్త జగదాభాసం అయింది । యిందుకోసానకు సమస్త జగదాభాసం ఓంకార స్వరూపం । అది యట్లాను । స్థూలదేహం అకారమాత్ర । లింగదేహం ఉకారమాత్ర । కారణదేహంమకారమాత్ర । మహాకారణ దేహం అర్ధమాత్ర । జాగృతి అవస్థ ఆకారంమాత్ర । స్వప్నఅవస్థఉకారమాత్ర । సుషుప్త్యవస్థ మకారమాత్ర । తుర్యావస్థ అర్ధమాత్ర। విశ్వాభిమాని అకారమాత్ర । తైజసాభిమాని ఉకారమాత్ర । ప్రాజ్ఞాభిమాని మకార మాత్ర । ప్రత్యగాత్మాభిమాని అర్ధమాత్ర । రజోగుణం అకారమాత్ర । సత్వగుణం ఉకారమాత్ర । తమోగుణం మకారమాత్ర। శుద్ధసత్వగుణం అర్ధమాత్ర । వైఖరీ వాక్కు అకారమాత్ర । మధ్యమవాక్కు ఉకారమాత్ర । పశ్యంతివాక్కు మకారమాత్ర । పరావాక్కు అర్ధమాత్ర । అకారమాత్ర ఋగ్వేదం । ఉకారమాత్ర యజుర్వేదం । మకారమాత్ర సామవేదం । అర్ధమాత్ర అథర్వణ వేదం । అకారమాత్ర బ్రహ్మ దేవుడు । ఉకారమాత్ర విష్ణు । మకారమాత్రరుద్రుడు। అర్ధమాత్ర ఈశ్వరుడు । అకారమాత్ర ఉత్పత్తి । ఉకారమాత్ర స్థితి । మకారమాత్ర ప్రళయం । అర్ధమాత్ర సర్వసాక్షి । అకార మాత్రబ్రహ్మాండం ఉకారమాత్ర హిరణ్యగర్భ । మకారమాత్ర అవ్యాకృతమాయా । అర్ధమాత్ర మూలమాయ । యిందుకోసానకు ఓంకార విస్తారం సమస్త జగత్తు । తత్సద్రూపం । బ్రహ్మం । ఓంకారం విస్తారానకు అధిష్ఠానం తత్సద్రూపబ్రహ్మం । ప్రకాశంచాత ఓంకారం విస్తారం జగత్తు ప్రకాశించినాడు । యిందుకోసానకు సకల జగత్తుబ్రహ్మరూపం । తత్సద్రూపంబ్రహ్మ । దాని నుంచి స్ఫురణ అయింది । అది ఓం । ఆ ఓంకారం జగద్రూపవిస్తారం అయ్యింది । యిందుకోసానకు విశ్వరూపంబ్రహ్మం । ఆవిశ్వంలో జీవరూపంచాత బ్రహ్మమేవున్నాది । ఆ జీవునికిదేహాభిమానం అయింది । దానికోసానకు । తానుబ్రహ్మం వున్నస్థితి మరిచిపోయినాడు। యిందుకోసానకు సంసారభ్రాంతి తగిలింది । జన్మమరణం తగిలింది । యేవెళ్లయిాజీవునికి విరక్తి అవుతుంది । సత్సమాగమం అవుతుంది । గురువునకు శరణుపొయ్యి గురుకృపచాత మహావాక్యబోధ అవుచుంది । ఆవెళ్ల అకార ఉకార మకార । మూడు దేహాలు దాటించ్చి అర్ధమాత్రకుపోచాడు । ఆవ్యాళ్లనేనుబ్రహ్మను । వున్నాను । అని । యిాజ్ఞానం అవుచుంది । అర్ధమాత్రబ్రహ్మ స్ఫురణం । అదివెనకకువిడచి । తత్సద్రూపబ్రహ్మం। అదెనే నువున్నాను । యిట్లానిశ్చయంఅవుతుంది । యిదినాల్గో మాత్రరూపం । నాల్గుదేహాలు। యిదెస్ఫురణ రూపం। అర్ధమాత్ర అదెనేను గాను । ఆతత్సద్రూపబ్రహ్మ నుంచ్చిస్ఫురణం అయింది। ఆతత్సద్రూప బ్రంహ్మమెనేను । వున్నాను । ఓంకారంలోపటి తత్‌బ్రహ్మం అదె । సద్రూపం । సద్రూపం అంటె

యేమి । భూతభవిష్యద్వర్తమానం । యీత్రికాలం అక్కడలేదు । అతద్బ్రహ్మం దానికి సద్రూపం అనవలెను । నేను ఓంకారం । నాల్గుదేహాలకు సాక్షి నేను । అదెతద్బ్రహ్మంనేను వున్నాను । దానిపేరు సత్ అనవలెను । సాధారణం అర్థం । ఓంతత్సత్ అంటెను । అహంబ్రహ్మం తత్కారంవున్నాము । సత్కారంనేను బ్రహ్మం వున్నాను । యిది ఓంతత్సత్ । యిదినిశ్చయం । ఇతి శ్రీజీవన్ముక్తకృత ఓంకారవిస్తారవివరణం ॥

౧౮ శ్రీ॥ సారాంశ జ్ఞానం సాక్షి ఆత్మ । స్వప్రకాశంచిద్రూపం । బ్రహ్మతోటిభిన్నంవున్నాడు। ఆ బ్రహ్మంసచ్చిదానందం । అదేసాక్షి ఆత్మ । వాడు బ్రహ్మత్వంచాతయట్లావున్నాడో అట్లాగెవున్నాడు । యిందుకొసానకు సత్ అనవలెను । జ్ఞానరూపం ప్రకాశరూపం । యిందుకోసానకు చిత్ అనవలెను । సుఖ స్వరూపం । యిందుకోసానకు ఆనందరూపం అనవలెను । ఆద్యంతరహితం పరిపూర్ణం । యిందుకోసానకు బ్రహ్మ అనవలెను । అఖండైకరసం బ్రహ్మ ఆత్మవున్నాడు । యీ ఆత్మస్వరూపంలో జీవెశ్వరభెదం లేదు । యిందుకోసానకు అఖండైకరసం । బ్రహ్మం । ఆత్మ । అనవలెను । యీ ఆత్మ స్వరూపంలో మాయా అవిద్య సకల జగత్తు వివర్తభాసం మిథ్య వున్నాది । ఆత్మ మాత్రం పరిపూర్ణం వున్నాడు । ఆ ఆత్మతాను। యిట్లాయెరింగిపూరికెవుండవలెను । తనవృత్తిఆత్మ మయంచేశి ఆత్మయట్లావున్నాడో అట్లావుండవలెను । ఇతి శ్రీ జీవన్ముక్తకృతసారాంశజ్ఞానం॥

౧౯ స్వగతాదిభేదశూన్యం। ఆచైతన్యంలో స్వగతాదిభేదాలు లేవు । స్వగతాదిభేదాలు అంటెను యేమి । విజాతిఅయ్యెభేదం వొక్కటిస్వజాతి అయ్యెభేదం వొక్కటి । స్వగతభేదం వొక్కటి । విజాతయ్యభేదం అంటెయేమి । తన స్వరూపానకు యెరుగడు । దేహంనేనేఅంటాడు। దాని పేరు విజాతియ్యభేదం । స్వజాతియ్యభేదం అంటె యెమి । జీవుడు చైతన్యంవున్నాడు। దాని పేరు స్వజాతియ్యభేదం । స్వగతభేదం అంటె యెమి । చైతన్యస్వరూపంలో భేదంలేదుగాని। చైతన్యస్వరూపం సత్‌చిత్ ఆనందంవున్నాది । దీనిపేరుస్వగతభేదం అక్కడ । యీస్వగతభేదం। ఆ చైతన్యంలోలేదు । యట్లాలేదంటె । సద్రూపంచైతన్యం । అదే చిద్రూపం । సద్రూపంచిద్రూపం। అదేఅనందరూపం । యిందుకోసానకు స్వగతభేదంలేదు । విజాతియ్యభేదం అవిద్యామయం। మిథ్యా । స్వగతభేదం అవిద్యానిరసనం । అయితె జీవతనంలేదు । యిందుకోసానకు స్వగతభెదం లేదు । స్వగతభేదం సత్ చిత్ ఆనందం । మూడుకూడా వొక్కచైతన్యమె । యిందుకోసానకు స్వగతభేదంలేదు । యిందుకోసానకు స్వగతభేదంశూన్యం అఖండైకరసం పరిపూర్ణం చైతన్యం మాత్రం వున్నాది । రెండోదియెమిలేదు । యిదినిశ్చయం । ఇతి జీవన్ముక్తకృత స్వగతాదిభేద శూన్యం వివరణం ॥

౨౦ శ్రీ॥ జహల్లక్షణం వొక్కటి । అజహల్లక్షణం వొక్కటి । జహదజహల్లక్షణం వొక్కటి। జహల్లక్షణంఅంటెను । త్యాగం । అజహల్లక్షణంఅంటెను అత్యాగం । జహదజహల్లక్షణం అంటెను త్యాగాత్యాగం । త్వంపదశబలభాగంత్యాగంచెయ్యవలె । దానిపేరు జహల్లక్షణం । త్వంపద

శుద్ధభాగం అంగీకరించవలెను । దాని పేరు అజహర్లక్షణం । తత్పద శబలభాగంత్యాగం చాయవలెను । తత్పదశుద్ధభాగం త్యాగంచాయరాదు । దానిపేరు అజహర్లక్షణం । యీ రెండె లక్షణంచాత త్వంపద తత్పదశుద్ధభాగానకు అయిక్యంఘటించదు। యందు కోసానకు । వేదాంతశాస్త్రంలో । జహదజహర్లక్షణం అంగీకరించినారు । జహదజహర్లక్షణం అంటె యేమి। త్వంపదతత్పదశబలభాగం వ్యష్టిసమష్టిరూపం వొక్కటి । యిందుకోసానకు । మా యాఅవిద్యా మయంశబలభాగం । త్యాగంచాయవలెను । త్వంపదశుద్ధ భాగం । తత్పదశుద్ధభాగం । అంగీకరించవలెను । త్వంపదశుద్ధభాగం పేరు ప్రత్యక్చైతన్యం । తత్పదశుద్ధభాగం పేరు పూర్ణచైతన్యం । అపూర్ణచైతన్యం ప్రత్యక్చైతన్యం వొక్కటి । వున్నాది । ప్రత్యక్చైతన్య మేచైతన్యం। ప్రత్యక్పూర్ణం రెండూ శబలాలు ఆచైతన్యానకు మాయా అవిద్యా ఉపాధిచాత వచ్చింది । మాయా అవిద్యా నిరసనం చెస్తె శబలజీవత్వం శబలఈశ్వరత్వం పాయను । చైతన్యం ప్రత్యక్ పూర్ణం యీ రెండు శబ్దాలు పాయను । మిగిలింది కేవలచైతన్యమాత్రం । అదే జీవస్వరూపం। అదే ఈశ్వరస్వరూపం । పరంతు అక్కడ । జీవత్వం। ఈశ్వరత్వం పేరులేదు । ప్రత్యగత్వం పూర్ణత్వం పేరులేదు । కేవల చైతన్యం మాత్రం వున్నాది। యిందుకొసానకు జహదజహర్లక్షణం మూడోది వేదాంతశాస్త్రం అంగీకరించినారు ॥ ఇతి శ్రీ॥ జీవన్ముక్తకృత జహర్లక్షణ అజహర్లక్షణ జహదజహర్లక్షణం వివరణం ॥

౨౧ శ్రీ॥ నిజధ్యానప్రకరణం ॥ సత్సహవాసంచాతగురుకృపచాత జ్ఞానం అయింది । యిదియట్లా అయింది అంటె । స్వయంప్రకాశచైతన్యం నేనువున్నాను । దీని పేరుజ్ఞానం । స్వయంప్రకాశ చైతన్యం యక్కడవున్నాది । అంతఃకరణ పేరుహృదయం । ఆహృదయంలోపల స్వయంప్రకాశచైతన్యం వున్నాది । అదేతనస్వరూపం । అంతఃకరణ సహితందేహద్వయం తానుకాదు । తనస్వరూపం స్వయం ప్రకాశచైతన్యం । ఆ చైతన్యానకు ఆదీఅంత్యంలేదు । దానికోసానకు పరబ్రహ్మం అనవలెను । యిదేనేను । అనాదిసిద్ధం వున్నాను । దానిపేరు సనాతనం। ఆపరబ్రహ్మ స్వరూపంలో । మాయా ఆ విద్యా ప్రపంచంలేదు । దానికోసానకు। నిష్ప్రపంచం అనవలెను । మాయా అవిద్యాప్రపంచంలో ఆచైతన్యం ఆభాసం అయింది । దాని పేరు జీవుడు । ఈశ్వరుడు । యీ జీవఈశ్వర ఆభాసం చైతన్య స్వరూపంలో లేదు । దానికోసానకు। నిరాభాసం అనవలెను । స్వయంప్రకాశచైతన్యం । నిరాభాసం । అకాశంవలెను। నిర్మలంవున్నాది। తనకుతానే పరిపూర్ణం వున్నాది । తనకు యీ ఆత్మ జ్ఞానం అయితె దేహాభిమానం విడిచిపెట్టి ఆస్వయంప్రకాశ చైతన్యంతోటి వుండవలెను । స్వయంప్రకాశ చైతన్యం నేను । యీ వాక్యం నాల్గుమాట్లు । యిట్లాధ్యానం చేస్తె దేహాధ్యాసంపోతుంది । మరీ ఆస్వరూపస్థితి అవుతుంది। యిందుకోసానకునిజధ్యానం సదాయల్లప్పుడూ చెయ్యవలెను । ఆలస్యంచాయరాదు । అనాదికాలంనుంచిదేహధ్యానం వున్నది గనక అది యట్లాపోవలెను । అంతఃకరణవృత్తి బహిర్ముఖం పోతుంది । దానికి వెంటతానుపోతాడు । ఆత్మస్వరూపం వెనకకు అవుచుంది । యిందుకోసానకు యప్పటివలెను దేహధ్యాసంపుట్టింది । యీలాగునదగా అవుతుంది ।

యిందుకోసానకు వివేకంచాత బహిర్వృత్తి అపహరించవలెను । దేహద్వయం వెనకకు విడిచిపెట్టవలె । అంతఃకరణంలోపలికిపోవలెను । లోపలికిపొయ్యి నిశ్చయంకావలెను। తాను స్వయంప్రకాశ చైతన్యంవున్నాను । దానిదిప్రకాశం అవుచుంది । దేహధ్యాసంపోతుంది। ఆదేహంయప్పుడు చచ్చిపోయితెనేమి । బహుదినాలు వుంటె నేమి । యిప్పుడుపోతెనేమి । ఆదేహానకుతనకూయేమి । సంమంధంలేదు । దేహంమాయామయం మిథ్య । తానుచైతన్య స్వరూపం సిద్ధం । యిట్లాగురుముఖంచాత । సచ్ఛాస్త్రశ్రవణంచాత । తనకు అనుభవంచాత । తానుస్వయంప్రకాశచైతన్యం । బ్రహ్మంవున్నాడు । యిందుకోసానకు యేమి సంశయంలేదు । తనస్వరూపంతోటితాను వుండవలెను । యీశ్వరరూపస్థితి ప్రాప్తి అయితె నిజధ్యాసంతనకు తానెలయం అవుచుంది । దీని పేరు బ్రహ్మసాయుజ్యం । యిదినిశ్చయం ॥ ఇతి శ్రీ జీవన్ముక్త కృతనిజధ్యాన ప్రకరణం ॥

- ౨ శ్రీ॥ వ్యర్థవ్యాఖ్యానం ॥ తాను కేవలచైతన్యం వుండగాను । తనకుదేహం అనెదివ్యర్థం। దేహానకువర్ణాశ్రమంవున్నాది । బ్రాహ్మణవర్ణం దేహానకు । నేను బ్రాహ్మణుడను అనెదివ్యర్థం । క్షత్రియవర్ణం దేహానకు । నేనుక్షత్రియుడను అనెది వ్యర్థం । వైశ్యవర్ణం దేహానకు । నేను వైశ్యుడను అనెదివ్యర్థం । శూద్రతనం దేహానకు నేనుశూద్రుడను అనెదివ్యర్థం। శాఖాభేదం దేహానకు । నేనుఫలానికులపువాడను అనెదివ్యర్థం । బ్రహ్మచారితనందేహానకు । నేను బ్రహ్మచారిని అదివ్యర్థం । గృహస్థతనందేహానకు । నేనుగృహస్థును అనెదివ్యర్థం । వానప్రస్థత నందేహానకు। నేను వానప్రస్థును అనెది వ్యర్థం । సన్యాసి అయ్యేది దేహం । నేను సన్యాసుడను అనె దివ్యర్థం । పరమహంసఅయ్యేది దేహంనేను పరమహంస అనెదివ్యర్థం । గోసావిఅయింది దేహం । నేనుగోసావినిఅనెదివ్యర్థం । కీర్తనచేశెదిదేహం । నేనుహరిదాసుడను అనెది వ్యర్థం । దేహానకులింగంకట్టితె । నెనులింగాయితంఅంటారు । అదివ్యర్థం । దేహానకు తప్తముద్రలు అయితెనేను వైష్ణవుడను అంచుంన్నారు । అదివ్యర్థం । దేహానకునుదిటికి తిరుమణితిరిచూర్ణం పట్టెలు పచ్చనయెరుపుతెలుపుపెట్టి నేను రామానుజుడను అంటున్నాడు అదివ్యర్థం । దేహానకు భస్మంపెట్టి । నేనుస్మార్తుడను అనెది వ్యర్థం । తన ఆత్మస్వరూపం నిర్వికారచైతన్యం । అదియెరుగక । యీలాగునమతాభిమానంపట్టెది । వ్యర్థం । వేదాక్షరపాఠంచెస్తె నోటితొటి చెస్తాడు। నేనువైదీకుడను అనెది వ్యర్థం । నోరుతొటిశాస్త్రంపాఠంచేస్తె నేను శాస్త్రిని అనెది వ్యర్థం । ఆత్మ స్వరూపంలోయెమిలేదు । యిదేనానాభిమానంపెట్టెదివ్యర్థం దేహంఅగ్నిహోత్రం చేస్తె నేనుదీక్షితుడను అనెది వ్యర్థం । సోమయాగాదియాగాలు చేస్తె నేను సోమయాజిని అనెదివ్యర్థం। ఆత్మస్వరూపంలో అగ్నిలేదు । మంత్రాలువేలు । మంత్రం అనెది నోరులేదు । యిట్లాఆత్మస్వరూపంవుండగా నేనుసోమయాజిని అనెది వ్యర్థం । దేహబుద్ధితోటనేను వొక్కగురువును । వాడువొక్కశిష్యుడు యిది అనెది వ్యర్థం । నేను దేహంభక్తుడు । దేవుని దేహం వొక్కదైవం । యిట్లాదేహభక్తతనం వ్యర్థం । ఆత్మస్వరూపంలో యేమిలేదు । లేనిపోని

అభిమానం పట్టెదివ్యర్థం । యింద్రియధర్మం । చూచెది । పల్కెది । నడిచెది । చేశెది వినెది రసంపుచ్చుకొనెది ఘ్రాణంతీసుకునెది । మలమూత్రత్యాగంచేశెది । యిది అంతాయింద్రియ ధర్మాలు । యీ యింద్రియధర్మాలు తనకు అనెది వ్యర్థం । తన ఆత్మస్వరూపం ఆతీంద్రియం। క్షుధాతృష్ణాదిప్రాణధర్మం । నాకుక్షుధాతృష్ణ అయింది అనెది వ్యర్థం । తనస్వరూపం అప్రాణం వున్నాది । మనుస్సుకు సంకల్పం । యీ సంకల్పం తనకు అయ్యింది అనేది వ్యర్థం । యెరిగెది బుద్ధి ధర్మం । నేను యెరుగుతాను అనేది వ్యర్థం । అహంకారధర్మం అహం మమత్వం । అహంమమత్వంపట్టెదివ్యర్థం । తానుజ్ఞానస్వరూపం నేను అజ్ఞానిని అనెది వ్యర్థం । తనస్వరూపం చిన్మాత్రం । నేను జ్ఞానిని అనెది వ్యర్థం । దేహానకు జాగృతి అవస్థ । నేనుమేలుకొన్నాను అనెది వ్యర్థం । లింగదేహానకు స్వప్నవస్థ । నాకు స్వప్నం అయింది అనెది వ్యర్థం । కారణదేహానకు సుషుప్త్యవస్థ । నాకు నిద్రవచ్చింది అనెది వ్యర్థం । అవస్థాత్రయానకు సాక్షితుర్యం । నేను సాక్షిని అనెది వ్యర్థం । విశ్వతైజసప్రాజ్ఞప్రత్యగాత్మ । యీ అభిమానంతనకు లేదు । యీ అభిమానంతనకు అనెది వ్యర్థం । నేను జీవుడను అనెది వ్యర్థం । ఆజీవుడు చైతన్యప్రతిభాసంవుండంగా । తాను కేవలచైతన్యంవుండంగానేను జీవుడను అనెది వ్యర్థం । అవస్థాత్రయానకుసాక్షిరూపంశివం । నేను శివం అనెది వ్యర్థం । తనస్వరూపం నిరుపాధికం । నిర్గుణం । నిర్వికారం । నిరాభాసం । నిరాకారం । స్వయంప్రకాశచైతన్యం వున్నాది । యిట్లావుంటెయీనానావిధాభిమానం పట్టెదివ్యర్థం। యిందుకోసానకు । సకల అభిమానం విడిచిపెట్టి । తనస్వరూపంతా నెరింగి । ఆత్మ స్వరూపంతోటి వుండవలెను । యిట్లాయెవ్వరు వుంటారు వారు తనకు స్వార్థకం తానుచెస్తున్నారు । వారుసత్పురుషులు । సాధుసంతులు । వారేబ్రహ్మనిష్ఠులు । వారికిబ్రహ్మప్రాప్తి అవుచుంది। యిదినిశ్చయం ॥ ఇతి శ్రీజీవన్ముక్త కృతవ్యర్థవ్యాఖ్యానం ॥

౨౩ శ్రీ॥ జ్ఞానం అన్యథాజ్ఞానం విచారం ॥ జ్ఞానంచతుర్విధం వున్నాది । వొక్కజ్ఞానం । వొక్క అన్యథాజ్ఞానం । వొక్కపరోక్షజ్ఞానం । వొక్కఅపరోక్షజ్ఞానం । జ్ఞానం అంటె యెమి జాగృత్స్వప్న సుషుప్తి । యీ మూడుఅవస్థలకు నేనుప్రకాశకుడను । స్థూలసూక్ష్మకారణం । యీ దేహత్రయానకు ప్రకాశకుడను । విశ్వతైజసప్రాజ్ఞ । యీ మూడు అభిమానులకు నేను ప్రకాశకుడను । విశ్వరూపానకు నేను సాక్షి । నా స్వరూపంచిన్మాత్రం । చైతన్యం । ప్రకాశం । యిట్లాయెరింగెది దాని పేరు జ్ఞానం । మరిఅన్యథాజ్ఞానమదియట్లాను । తనస్వరూపం యెరుంగక దేహమెనేను అంచాడు । దానిపేరు అన్యథాజ్ఞానం । తనస్వరూపం యెరుగకతనకు జీవుడను అనుకొంచాడు । దానిపేరు అన్యథాజ్ఞానం । నేను బ్రాహ్మణుడను । అనియెరుగుచున్నాడు । నాకువర్ణాశ్రమ కర్మంవున్నాది । అని యెరుగుచున్నాడు । నా పేరు ఫలానివాడను అని యెరుగుచాడు । నాది జాతి । నాదికులం । నాదిగోత్రం । నాది శాఖ । యీ లాగునయెరుగుచాడు । యిది అంతాఅన్యథాజ్ఞానం । నేనుకర్మనిష్ఠుడ । నేనుభక్తుడ । నేను

వైష్ణవుడ । నేను స్మార్తుడను । నేనుపవిత్రుడను । నేను సత్కర్మధర్మం చెస్తా । నాకుముందర ఉత్తమగతి అయ్యేని। చెయ్యకుంటె అధోగతి అయ్యేని । యీలాగున యెరింగెది అన్యథాజ్ఞానం। వేదశాస్త్రపురాణంలో యేమెమిచెప్పినాడు । దానిప్రకారం గావుండవలెను । యిట్లాయెరిగెది అన్యథాజ్ఞానం । నేనుపుణ్యాత్ముడ । నేనుపాపాత్ముడ । యీలాగునయెరిగెది అన్యథాజ్ఞానం। తన స్వరూపం కేవలచైతన్యం వుండంగా అజ్ఞానం లేదు । మరి తనకు అన్యథా చూస్తేయిది అంతా అన్యథాజ్ఞానం వున్నాది । దీనికిదృష్టాంతరంవున్నాది । రజ్జుపడ్డాది । దూరంనుంచి చూస్తెపాము అనిపిస్తుంది । దగ్గరపోతె రజ్జువున్నాది । అనెజ్ఞానం లేదు । గనకపాము వున్నాది అని యెరుగుతున్నాడు । దానిపేరు అన్యథాజ్ఞానం । ఆలాగున తాను దేహత్రయమునుంచి అతీతం వుండంగా తనస్వరూపం యెరుగడు । దేహమెనేను అని యెరుగుచాడు । తనస్వరూపం నిష్కర్మంవుండంగా తనకు కర్మియనియెరుగుచాడు । యిది అన్యథాజ్ఞానం । తనకు జన్మంమరణం లేదు । నాకు జన్మంమరణం వున్నాది అని యెరుగుచాడు । యిది అన్యథాజ్ఞానం। సత్కర్మాచరణం । అగ్నిహోత్రాదికం చేస్తె నాకు ఉత్తమగతి అయ్యేని । యీలాగునయెరిగితె దాన్నిఅన్యథాజ్ఞానం అనవలెను । భగవద్భజనంచెస్తె ఆభగవంతుడునన్ను జన్మమరణంనుంచి ముక్తుణ్ని చేస్తాడు । అని యరుగుచాడు । యిది అన్యథాజ్ఞానం । ప్రాణాపానయోగంచాత । మనుష్యుకు । యింద్రియాలకునిరోధనం చేస్తెనాకు మోక్షం అయ్యేని । అని యెరుగుచాడు యిది అన్యథాజ్ఞానం । వేదాధ్యయనం తపస్సుయజ్ఞాలు దానాలు చేస్తె నాకువుత్తమగతి అయ్యేని అనియెరుగుచాడు । యిది అన్యథాజ్ఞానం । యిషువంటి అన్యథాజ్ఞానాలు శానావున్నావి। నిద్రవస్తె యట్లాస్వప్నం చూస్తారో ఆస్వప్నంవలెను । యిదిఅంతా అన్యథాజ్ఞానం। యివి అన్ని । అన్యథాజ్ఞానంలో । నేను బ్రంహ్మచర్యం చేస్తె । గృహస్థాశ్రమంచేస్తె । కర్మంచేస్తె। వానప్రస్థానకుపోతె। సన్యాసం పుచ్చుకొంటె । పరమహంసను అయితె నాకు మోక్షం అయ్యేని। అనియెరుగుచాడు। అది అన్యథాజ్ఞానం । నేను హరిభజనంచేస్తె భక్తి ఉపాసన । చేస్తె । నాకు మోక్షం అయ్యేనని యెరిగెది । అన్యథాజ్ఞానం । తనస్వరూపంలో యిదియెమిలేదు । కేవలచిన్మాత్ర । చైతన్యఘనం। తానువుండంగా అదియెరుగడు । యిది అన్యథాజ్ఞానంలోపడి। భ్రమించినాడు । యిందుకోసానకు తన స్వరూపం సర్వాతీతం । స్వయంప్రకాశచైతన్యం । సచ్చిదానందం పరిపూర్ణం । వున్నాది । యీలాగున యెరింగెది దీని పేరు జ్ఞానం । యీజ్ఞానంచాత బ్రహ్మప్రాప్తి అవుతుంది । యిది నిశ్చయం । యితిశ్రీజీవన్ముక్తకృతజ్ఞాన అన్యథాజ్ఞానవివరణం॥

౨౪ శ్రీ॥ పరోక్షజ్ఞానం అపరోక్షజ్ఞానవిచారం ॥ పరోక్షజ్ఞానం అంటెను యెమి । తనస్వరూప మెరుంగక। తననుంచి వొఘపరమాత్మ వేరువున్నాడు । యీలాగునయెరింగెది । పరోక్షజ్ఞానం। పరమాత్మయట్లావున్నాడు । సచ్చిదానందస్వరూపం । కేవలంచిన్మాత్రం । చైతన్యంవున్నాడు। దానినుంచిముప్పైతత్వాలు పుట్టినవి । సకల జగత్తు నిర్మాణం అయింది । త్రిగుణంనుంచ్చిసకల జగత్తులో పరమాత్మ వ్యాపకమైసకల జగానకు నడిపిస్తున్నాడు । సకలజగత్తుఅంతరంలో

నుండి సర్వసాక్షిస్వప్రకాశకుడు । అయినాడు । యీలాగునయెరింగెది। పరోక్షజ్ఞానం । బంగారుసకలసొమ్ములు । తంతుపటం । యట్లాగోపరమాత్మ తనమాయచాత । అంగీకారంచాత సకలజగద్రూపం అయినాడు । యీలాగున యెరిగెది పరోక్షజ్ఞానం । అన్వయంచాతపరమాత్మ జగద్రూపం । వ్యతిరేకంచాత మాయామయం మిథ్య వున్నాది । పరమాత్మతానే సంపూర్ణం వున్నాడు । యిట్లాయెరింగితె పరోక్షజ్ఞానం । సకలదేహంలో జీవరూపంతోటి పరమాత్మవున్నాడు। యీలాగునయెరింగెది పరోక్షజ్ఞానం । మాయఆది చేశిసకలజగత్తులేక పరమాత్మతానెవున్నాడు। మాయామయంజగత్తునిర్మాణం అయితె జగత్తులోపరమాత్మ నిండివున్నాడు । ఆమాయా జగత్తుసహితం సంహ్వారంఅయితె పరిపూర్ణం వున్నాడు । యీలాగున యెరింగెదిపరోక్షజ్ఞానం। తనకూపరమాత్మకు నేను భక్తుడవున్నాను । అనిచూస్తాడు । దీనిపేరు పరోక్షజ్ఞానం । ఆపరమాత్మ భజనంచెస్తె నాకు మోక్షం అయ్యీని । అనియెరింగెది పరోక్షజ్ఞానం । ఆపరోక్షజ్ఞానం శాస్త్రంలో శానాచెప్పినాడు । యిదిపరోక్షజ్ఞానవివరణం॥

౨౫ శ్రీ॥ యిఘను అపరోక్షజ్ఞాన విచారం । అపరోక్షజ్ఞానం యట్లాను । దేహత్రయాతీతం దేహత్రయానకు ప్రకాశకసాక్షినాస్వరూపం । స్వయంప్రకాశచైతన్యం । దానికే ప్రత్యగాత్మ ప్రత్యక్ చైతన్యం । అంటారు । యందుకు అంటారు । దేహత్రయానకు ప్రత్యక్ వున్నాను । దాని కోసానకు అంటారు । పరమాత్మ బ్రంహ్మాండం । హిరణ్యగర్భఅవ్యాకృత మాయా యిదె యీదేహత్రయానకు అతీతంస్వయంప్రకాశ చైతన్య రూపం । వున్నాను । దానికే పూర్ణ చైతన్యం అంటారు । పూర్ణచైతన్యం పరమాత్మ । ప్రత్యక్ చైతన్యంనేను । యిద్దరూకూడా వొక్కచైతన్యమే। యిట్లాగునయెరింగెది అపరోక్షజ్ఞానం । పరమాత్మానేనూవొక్కటి । యిట్లావొక్కటంటె నేను యట్లా స్థూల దేహంకాదో అట్లాపరమాత్మ బ్రంహ్మాండం కాదు । నేనుయట్లాలింగదేహంకాదో। అట్లాపరమాత్మ హిరణ్యగర్భం కాదు నేనుయట్లా అజ్ఞానకారణ శరీరంకాదో అట్లాపరమాత్మ అవ్యాకృతకారణ మాయాశరీరం కాదు । నేనుయట్లా జ్ఞానమహాకారణ। శరీరంకాదో అట్లా పరమాత్మ మహాకారణ దేహంమూలమాయకాదు । నేనుయట్లానాలుగుదేహాలకతీతమో అట్లా పరమాత్మ నాలుగు దేహాలకతీతం । వాడునేను కూడా వున్నాను । ఆట్లాయెరిగెది। అపరోక్షజ్ఞానం। నేను కేవలచైతన్యం అఖండైకరసం । బ్రహ్మానువున్నాను । నా నుంచి మాయానిర్మాణం అయింది। మాయనుంచి అవిద్యనిర్మాణం అయింది । ఆ మాయావిద్యలోనేను ఆభాశించినాను । దానికి జీవత్వం ఈశ్వరత్వం పేరు వచ్చింది । మాయా అవిద్యారెండూ వుపాధిత్యాగం చేస్తె ఆజీవెశ్వర ఆభాసం లేదు । నేను అఖండైకరసం బ్రహ్మాను వున్నాను । యీలాగున యెరింగెది అపరోక్షజ్ఞానం। ఘటమఠత్యాగం చేస్తె వొక్కటె ఆకాశం । అట్లామాయా విద్యాత్యాగం చేస్తె వొక్కటె బ్రహ్మాం। అ బ్రహ్మామెనేను । వున్నాను । యీలాగున। యెరింగెది । అపరోక్షజ్ఞానం॥ యిది నిశ్చయం ॥ ఇతి శ్రీజీవన్ముక్తకృత అపరోక్షజ్ఞానవివరణం ॥

౨౬ శ్రీ॥ బంధవ్యాఖ్యవివరణం॥ తానుచైతన్యస్వరూపం వుండంగా । తన రూపం తాను యెరుగడు। అదె అజ్ఞానం । ఆ అజ్ఞానం తాదాత్మ్యం అయింది । అజ్ఞానంతానువొక్కటె । అయినాడు । దానిపేరుతాదాత్మ్యం అదెముఖ్యబంధనం । యీ అజ్ఞానంనుంచ్చిమనోబుద్ధి చిత్త అహంకారం పుట్టింది । యిదెచిత్త చతుష్టయం । ఆ చిత్త చతుష్టయంతోటి తాదాత్మ్యం అయింది । యిది రెండో బంధనం । మనుస్సు నుంచిదశేంద్రియబృందం పుట్టింది । ఆదశేంద్రియబృందంతోటి తాదాత్మ్యం అయింది । అదియట్లాను అయింది । నేను వింటాను। నేనుస్పరిశం పుచ్చుకొంటూవున్నాను । నేనురూపంచూస్తాను । నేనురసంపుచ్చుకొంటాను । నేనుపరిమెళంపుచ్చుకొంటాను । నేనుపలుకుధాను । నేను చేస్తాను । నేనునడుస్తాను । నేను మూత్రం చేస్తాను। నేను మలవిసర్జనం చేస్తాను । యిదిదశయింద్రియాలధర్మం । తనకు అంటాడు । యిదెదశవిధబంధనం । యిదిమూడోది । ప్రాణధర్మం ప్రాణం తోటితాదాత్మ్యం అయింది । ప్రాణధర్మం క్షుధాతృష్ణా । తనకుక్షుధా అయింది । తనకుతృష్ణ అయింది । యిది వొకబంధసం । యిది నాల్గోది । పాంచభూతిక శరీరానకు । నేను అంచాడు । యిదిదేహతాదాత్మ్యం । యిది వొక్కబంధనం । దేహం వైసు బాల తారుణ్య వృద్ధతనం అదేనేను అంటాడు యిది వొక్కబంధనం । దేహానకు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర । నాలుగువర్ణాలు వున్నావి । బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రంనేను అంచాడు । యీలాగున వర్ణాభిమానం పట్టివుంటాడు। యిదివొక్కబంధనం । దేహానకు బ్రహ్మచారిగృహస్థువానప్రస్థసన్యాసి యీ ఆశ్రమాలు తాను అంటాడు । యిది వొక్కబంధనం । వర్ణాశ్రమకర్మం । ఆకర్మాభిమానం పట్టి వుంటాడు। యిది వొక్కబంధనం । దేహంది జాతి । కులంగోత్రం శాఖాదానిది । అభిమానం పట్టి వుంటాడు యిదివొకబంధనం । దేహంకాడను స్త్రీపురుషం వున్నాది । నేను పురుషుడను। నేను స్త్రీని అని యీ అభిమానం పట్టి వుంటాడు । దేహానకు సుఖందుఃఖంఅవుతుంది । రోగాలుప్రాప్తి అవుతుంది । ఆరోగ్యం అవుతుంది । యీ అభిమానంపట్టి వుంటాడు । నాకు జన్మం అయింది। నేను వైసువాడను । నాకు జరా అయింది । నాకు మరణం వచ్చింది । అని యీ అభిమానం పట్టి వుంచాడు । యిది వొక్కబంధనం । నేను వైదీకుడను । నేను వ్యాపారిని। నేను దీక్షితుడను। నేను సోమయాజిని । నేనువుద్యోగదారిని । నేను పంతులుని । నేను కరణంను। నేను దేశపాండ్యాను । నేను దేశముఖును । నేను గోసావిని । యీలాగున యేయేవ్యాపారం చెస్తారో ఆవ్యాపారం పేరుతనకుతీసుకొంటారు । యిషువంటి బంధనాలు శానావున్నావి । అన్నిబంధనాలకు మూలం జ్ఞానం । సాధుసహవాసంచాత ఆస్వరూపం చైతన్యం అయింది। శ్రవణమనననిజ ధ్యాసం అయితె ఆచైతన్యస్వరూపం నేను వున్నాను । అనిజ్ఞానం అవుతుంది। అజ్ఞానంచాత అజ్ఞానం నిరసనం అవుతుంది । ఆవ్యాళసకల బంధనాలు తెగిపోచుంది । దాని పేరుముక్తి । యిట్లావుక్తి అనుభవం అయితె వాడుయెంఅభిమానం పట్టడు । తనచైతన్యస్వరూపంనిర్గుణం । నిర్వికారం నిరాభాసం । స్వయంప్రకాశం । సచ్చిదానందం

పరిపూర్ణం। స్వరూపంతోటివుంటె స్వరూపస్థితి అవుచుంది। దీనిపేరుమోక్షం। యిది నిశ్చయం। ఇతిఆజీవన్ముక్తకృతబంధన వివరణం।

౨౭ శ్రీ॥ మోక్షవ్యాఖ్యాన వివరణం॥ సత్సహవాసంచాత। గురుకృపచాత గురుకటాక్షంచాత। శ్రవణ మనననిజధ్యాసంచాత ఆత్మసాక్షాత్కారంచాత। అవుచుంది। ఆత్మసాక్షాత్కారంఅంటె యెమి। తాను అఖండైకరసంబ్రహ్మం। కేవలచైతన్యమాత్రం। వున్నాడు। యిది నిశ్చయంపేరు బ్రహ్మసాక్షాత్కారం। దానిపేరు మోక్షం। యీలాగునయెజ్ఞానికి అయింది వారికి అభిమానం లేదు। యట్లాలేదు। యిదిపాంచభూతికశరీరం। నేనుగాను। శరీరానకువర్ణా శ్రమకర్మధర్మం జాతికులగోత్రం వుద్యోగం వ్యాపారంవైదీకం గోసావి। జోతిషి। సోమయాజి। దీక్షతులు। పంతులు। యిది అన్నీపేర్లు దేహానకు వున్నావి। తనకు యెమీలేదు। తనస్వరూపం కేవలచైతన్యం। యిదివొక్కమోక్ష లక్షణం। దశేంద్రియధర్మాలు అవ్వియింద్రియాలకు। తనకు యెమీలేదు। పంచవిషయాలు। పంచవిషయప్రకాశకుడను నేను। నాకు పంచవిషయాలు లేవు। నాస్వరూపంకేవల చైతన్యం। యిదివొకమోక్షలక్షణం। ప్రాణధర్మంకు। క్షుధాతృష్ణా తృప్తి అతృప్తి శ్వాసోశ్వాసం। యిది అన్ని ప్రాణధర్మాలు। ప్రాణం ప్రాణధర్మాలు తనకు యెమీలేదు। తనస్వరూపం కేవలచైతన్యమాత్రం యిదివొఘమోక్షలక్షణం। అంతః కరణ పంచకం। దానిదిధర్మాలు। అంతఃకరణదిస్ఫురణం। మనుస్సుది సంకల్ప వికల్పం। బుద్ధిదియర్కతనం। చిత్తంది అను సంధానం। అహంకారంది అహంమమత్వం। యీ అయిదూ అంతఃకరణ పంచకధర్మం। అంతఃకరణపంచకం। పంచధర్మాలు। యెమీ లేవు। తనస్వరూపం కేవల చైతన్యమాత్రం। యిదివొఘమోక్షలక్షణం। జాగృతి స్వప్న సుషుప్తి। మనుస్సుకు అవుతుంది। తనకు యెమీలేదు। తనస్వరూపంనిరావస్థ చైతన్యం। వున్నాను। యిదివొఘమోక్షలక్షణం। నేను చైతన్యస్వరూపం వున్నాను। నాకు అజ్ఞానంలేదు। అజ్ఞానకల్పిత బంధనంలేదు। సకలబంధనాలకుమూలం అజ్ఞానం। అజ్ఞానం తనకు లేదు। యిందుకోసానకు సకల బంధ బంధనాలులేవు। యీలాగున యెరింగెది మోక్షం। నేను చైతన్యస్వరూపం వున్నాను। యీలాగున యెరిగెదిజ్ఞానం అజ్ఞానప్రకాశంనేను। యిందుకోసానకు జ్ఞానబంధనం నాకు లేదు। నేనుకేవలచిన్మాత్రం। చైతన్యంవున్నాను। యీలాగుననిశ్చయం అయితెదాని పేరు బ్రహ్మసాయుజ్యం। యీ చైతన్యస్వరూపం బంధమోక్షాతీతం। అదియెట్లాను। అజ్ఞానంలేదు అజ్ఞానకల్పితబంధనం। లేదు। నేను చిన్మాత్రస్వరూపం వున్నాను। యిషువంటి జ్ఞానం చిన్మాత్రస్వరూపంలో లేదు। యిందుకోసానకు ఆజ్ఞాన కల్పితంమోక్షంలేదు। బంధమోక్షంరెండూ మిద్యా। అనాదిసిద్ధం। యట్లానేను చైతన్యస్వరూపమును యట్లావున్నానో అట్లాగెవున్నాను। దానికి ప్రమాణం। అజ్ఞాననగోచరం। **"యతోవాచోనివర్తంత్తె। అప్రాప్యమనసాసహ"**। ఆనందం బ్రహ్మణో **విద్వాన్**। **"నబిభెతికుతశ్చనేతి"**। శృతివాక్యం। యిట్లా ఆత్మ స్వరూపంతెలిస్తె వారికి బ్రహ్మ సాయుజ్యం అవుతుంది। యిదినిశ్చయం। మరికొందరు

అంచారు । కర్మంచాతమోక్షం అంటారు । కొందరు ఉపాసనచాత మోక్షంఅంటారు । కర్మం చాతచిత్త శుద్ధి అవుతుంది । దేహతాదాత్మ్యంపోదు । మోక్షంకాదు । ఉపాసనచాత దైవతాలోకానకు పోతారు । దేహతాదాత్మ్యం పోదు । గనక మోక్షం యెలాగు అవుతుంది । కాదు । యోగంచాత చిత్త నిరోధనం అవుతుంది। దేహతాదాత్మ్యం పోదుగనక మోక్షం కాదు । జ్ఞానం చాత అజ్ఞానం నివృత్తి అవుచుంది । దేహతాదాత్మ్యం పోచుంది । దానిపేరు మోక్షం । మోక్ష అభిమానంచాతవుంటె మోక్షంకాలేదు । యిందుకోసానకు నేను ముక్తుడను అయినాను । అన్న అభిమానం విడిచి పెట్టవలెను । దాని పేరు మోక్షం । యిదినిశ్చయం । ఇతిజీవన్ముక్తకృతమోక్ష వ్యాఖ్యాన వివరణం।

౨౮ శ్రీ॥ అవస్థాభిమాని అర్థ వివరణం ॥ జీవునిదిస్థూలదేహం । పాంచభౌతికం । రోమత్వక్ మొదలు చేశిపాంచభూతికస్థూల శరీరం । దాంది జాగ్రత అవస్థా । జాగ్రత అవస్థా అంటె యెమి । బుద్ధికి నేత్రస్థానంచాత బాహ్యజ్ఞానం అవుతుంది । దాని పేరు జాగ్రదవస్థా । జాగ్రదవస్థకు అభిమాని విశ్వుడు । విశ్వ అభిమానం అవుతుంది । ఆవ్యాళ్లజీవునికి విశ్వాభిమానం అనవలెను। ఆవిశ్వాభిమానం అనవలెను । ఆవిశ్వాభిమాని నేత్రస్థానాననుండి జాగృతిని చూస్తాడు । జాగృతి అవస్థ విశ్వాభిమాని యిద్దరిది నేత్ర స్థానం । అవిశ్వాభిమాని జీవానకు స్థూలభోగం అవుచుంది। స్థూలభోగం అంటెయెమి । అన్నంవస్త్రం వుదకం స్త్రీ ఆది చెశిసకల భోగాలపేరు । సంయోగభోగం। స్థూలభోగం జాగృతి అవస్థావిశ్వాభిమాని నేత్రస్థానం స్థూలభోగం యీ అన్నీ కూడా రజోగుణం। రజోగుణం అంటె । యేమి । విషయగుణవాననపేరు రజోగుణం । యీ అన్నీ కూడా ఓంకారంది అకారమాత్ర। స్థూలదేహంకు । వైఖరీవాచావున్నాది । వైఖరీ వాచా అంటె యెమి । శబ్దాలు పలికెదాని పేరు వైఖరీవాచా । స్థూలదేహంలో ఋగ్వేదం వున్నాది । యిఘనులింగదేహ వివరణం। అంతఃకరణం అది చేశి యిరువై అయిదు తత్వాలది లింగ దేహం । ఆ లింగ దేహంకుస్వప్నావస్థ। స్వప్నావస్థ అంటెయెమి । జాగృతి అధ్యాసం బుద్ధికి అవుచుంది । నానావిధాలకల్పన అవుచుంది। స్థూల శరీరానకు నిద్రవస్తె బుద్ధి జాగృతి అధ్యాసంచాత స్వప్న విస్తారం చెస్తుంది । దాని పేరు స్వప్నం । యీ స్వప్నంలో జీవుడు స్వప్నం అభిమానం పట్టి వుంట్టాడు । దానికోసానకు జీవునికి తైజసఅభిమాని అనవలెను । ఆనిద్రవ్యాళ్లజీవునికి బాహ్య జ్ఞానం యెమీ లేదు । విశ్వాభిమానం పోతుంది । స్వప్నంలో వుంటెయట్లాయట్లా స్వప్నం అవుచుంది దానిది అభిమానం పట్టివుంటాడు। ఆవేళ్లజీవునికి విశ్వాభిమానం వుండదు । ఆ స్వప్నావస్థాతైజసాభిమాని యిద్దరిదీ కంఠస్థానం । ఆస్వప్నంలో సుఖదుఃఖ భోగం అవుచుంది। దానిపేరు ప్రవివిక్త భోగం । లింగదేహంస్వప్నావస్థ। తైజసాభిమాని। కంఠస్థానం ప్రవివిక్తభోగం। యీ అన్నీకూడా ఓంకారంది వుకారమాత్ర । లింగశరీరంలో మధ్యమవాచావున్నాది । శబ్దంపలుకవలెనని వాసనఅవుచుంది । దానిపేరు మధ్యమవాచా । లింగదేహంలోయజుర్వేదం వున్నాది ॥ యిఘనుకారణదేహంది । వివరణ ॥ కారణందేహం అంటెయెమి । కారణ దేహానకు సుషుప్త్యవస్థ । సుషుప్తి అంటె యెమి । మనుస్సు ఆది

చేశిసకలవృత్తి కారణ శరీరంలో లయం అవుచుంది । దాని పేరు సుషుప్తి । సుషుప్తి అంటెనుగాఢామూఢనిద్ర । ఆవ్యాళ్ల జాగృతి స్వప్నం యెమీ లేదు । కేవలం జఢమూఢఅవస్థ। దాని పేరు సుషుప్తి । యీ సుషుప్తిలో జీవుడు జఢమూఢుడైవుంటాడు । ఆవ్యాళ్లజీవునికి ప్రాజ్ఞాభిమాని అనవలెను । యీ సుషుప్తిలో విశ్వాభిమానితైజసాభిమాని లయం అవుచుంది। మరి జీవునికి సుషుప్తి వ్యాళ్ల ప్రాజ్ఞ అభిమాని యందుకు అంటారు । ప్రాజ్ఞుడు అంటె యెరిగెదిపేరు । యెరిగెవాడు వుంటెను సుషుప్తిలో యెమీయెరుగడు । ప్రాజ్ఞుడువుంటెను సుషుప్తిలో జఢమూఢం అయ్యివుంటాడు । అయితె । యెమి । జీవుడు ప్రాజ్ఞరూపమెవున్నాడు। మెల్క అయితెనాకు నిద్ర లెస్సవచ్చింది । అనిచెప్పుచున్నాడు । యిందుకోసానకు ప్రాజ్ఞాభిమాని అనవలెను । కారణదేహం । సుషుప్తి అవస్థ । ప్రాజ్ఞఅభిమాని । యీ మూటికిహృదయంస్థానం। అంటెయెమి । అష్టదళకమలంపేరు। సుషుప్తిలో జీవునికి నిద్ర సుఖం అవుచుంది । దానిపేరు నిద్రానందభోగం । యీ అన్నీకూడా తమోగుణం । యీ అన్నీకూడా ఓంకారందిమకారమాత్ర। కారణ శరీరంలోపశ్యంతి వాక్కు వున్నాది । పశ్యంతి అంటె యెమి । యీ లాగున యీలాగున పల్కవలెను । అనిశబ్దంచూస్తాడు। దానిపేరు పశ్యంతివాచా । యీకారణదేహంలో సామవేదం వున్నాది ॥ యిఘనుమహాకారణదేహవివరణం । ఆత్మజ్ఞానం పేరుమహాకారణదేహం । దానిదితుర్యావస్థ । అవస్థాత్రయానకుయెరిగెవృత్తితుర్య । యీ మహాకారణ దేహంతుర్యావస్థం। యిద్దరిదీ అభిమానిప్రత్యగాత్మ । ప్రత్యగాత్మ అంటె యెమి । దేహత్రయం। అవస్థాత్రయం । అభిమానిత్రయం । యీ సర్వం నుంచి నేను వేరెవున్నాను । నా స్వరూపం చైతన్యం । యీలాగున జీవుడు యెరుగుచున్నాడు । యిందుకోసానకు । ప్రత్యగాత్మఅనవలెను। తుర్యావస్థాప్రత్యగాత్మా యిద్దరిది మూర్ధ్ని స్థానం । మూర్ధ్ని అంటెను బ్రహ్మరంధ్రం పేరు ఆప్రత్యగాత్మునకు ఆనందావభాసభోగం । యిదిఅన్నీ కూడా శుద్ధ సత్వగుణం । శుద్ధ సత్వం అంటెను యెమి । ఆత్మజ్ఞానం పేరు । యివ్విఅన్నీ కూడా ఓంకారంది అర్థమాత్ర । అర్థమాత్ర అంటెను యెమి । చైతన్య స్వరూపంలో ధ్వని స్ఫురణం అయింది । దాని పేరు అర్థమాత్ర। మహాకారణదేహంలోను పరావాచావున్నది । పరావాచాఅంటె యెమి । స్ఫురణం పేరు । యీ మహాకారణదేహంలో అథర్వణవేదం వున్నాది । యీనాల్గు శరీరాలనుంచి తాను వేరె వున్నాడు। తనస్వరూపం కేవలచైతన్యం । యిట్లాయెరింగె దానిపేరు ఆత్మజ్ఞానం । యీ ఆత్మజ్ఞానంచాత ఆత్మ అయివుండవలెను । యిట్లా అయితె జీవునికి జన్మమరణంలేదు । స్వరూప అయిుజ్యం అవుచుంది । యిది నిశ్చయం ॥ ఇతి శ్రీ జీవన్ముక్తకృత ఆవస్థాభిమాని వివరణం ॥

౨౯ శ్రీ॥ జీవునికిసప్తావస్థా విచారం । యిదియెది అంటెను । సప్త అవస్థలపేర్లు । అజ్ఞానం। ఆవరణం । విక్షేపం । పరోక్షజ్ఞానం అపరోక్షం । శోకనాశం । నిరాంకుశతృప్తి । యీ సప్త అవస్థా జీవునికి । కూటస్థ ఆత్మకు యెమీలేదు । జీవుడు అంటె యెమి । తానుచైతన్య స్వరూపం వుండంగా తనకుమరచిపోయి శరీరానకు నేను అంటాడు । దానిపేరు జీవుడు । వానికి

చిదాభాసుడు అనవలెను । చైతన్యప్రతిబింబంబుద్ధిలో భాశించిది । దానిపేరు చిదాభాసుడు। ఆచిదాభాసునికి అజ్ఞానం ఆవరణం । విక్షేపం అయింది । అదే బంధనం । అజ్ఞానమంటెయేమి। తానుదేహత్రయంనుంచ్చీ అతీతంవుండంగా తనస్వరూపజ్ఞానం లేదు । దానిపేరు అజ్ఞానం । ఆవరణం అంటె యేమి । తానుస్వయంప్రకాశచైతన్యం వుండంగా । తనకు తాను కనిపించదు। దాని పేరు ఆవరణం । విక్షేపం అంటె యేమి । తన శరీరంలేకుంటె పాంచభూతికశరీరమె నేను అంటాడు । దాని పేరు విక్షేపం । శరీరానకు వర్ణం । ఆశ్రమం । జాతి । గోత్రం । కర్మం ధర్మం । నామం । రూపం । యిది అంత్తానాది అంచాడు । దాని పేరు విక్షేపం । శరీరానకు జన్మమరణాదిషడ్వికారం వున్నాది । అది తనకు అంటాడు । తనస్వరూపం యర్గడు । దేహాభిమానం పట్టివుంచాడు । దానిపేరు విక్షేపం యీ మూడు కూడా అవిద్యా । యిది జీవునికి బంధనం । ఆజీవుడు సత్కర్మానుష్ఠానాచరణంచాత భగవద్భక్తిచాతసర్వపాపాలూ । నివర్తి అయితె । చిత్త శుద్ధి అవుతుంది । ఆవెళ్లఈశ్వరకటాక్షంచాత సత్సహవాసం అవుచుంది। సత్సహవాసం అంటెను యేమి । యెవ్వరికి బ్రహ్మాత్మైక్యజ్ఞానం వున్నాదో వారికెసాధు అనవలెను। వారి సహవాసంచాత శ్రవణమననం అవుచుంది । ఆవ్వాళ్లమూడు పరోక్షజ్ఞానం అవుచుంది। పరోక్షజ్ఞానం అంటె యేమి । ఈశ్వరుడు మాయాతీత కేవలపరబ్రహ్మంవున్నాడు । మాయాభాసంనామరూపాత్మకం । విశ్వాకారం అయింది । ఆవిశ్వాకారానకు అంతర్బాహ్యం వ్యాపించివున్నాడు । సర్వప్రకాశకుడు । సర్వవ్యాపకుడు । సర్వసాక్షి । అవినాశస్వరూపకుడు । సర్వసాక్షి । అవినాశస్వరూపం । కేవలచైతన్యపరబ్రహ్మం వున్నాను । యిట్లాయీశ్వరస్వరూపం యెరింగెది దానిపేరు అపరోక్షజ్ఞానం ॥

౩౦ అపరోక్షజ్ఞానం అంటె యేమి । పరోక్ష ఈశ్వరస్వరూపం కేవలపరబ్రహ్మ స్వరూపం । అది నేనేవున్నాను । యిట్లాయెరిగెది దానిపేరు అపరోక్షజ్ఞానం । అది యెట్లానుయెరిగెది । అంటెను। పరబ్రహ్మ స్వరూపం నుంచి । నేను బ్రహ్మం యీలాగున స్ఫురణ అయింది । దాని పేరుమాయ । ఆమాయాయుక్త బ్రహ్మంపేరు శబలఈశ్వరుడు । మాయాతీతబ్రహ్మపేరు యీశ్వరుని శుద్ధ స్వరూపం । శబలశుద్ధం రెండు ఈశ్వరులు వున్నారంటెను । మాయచాత రెండు పేర్లు వచ్చినవి । ఆమాయ మిథ్య । ఈశ్వరుని రెండు పేర్లు లేవు । కేవలచైతన్య పరబ్రహ్మ మాత్రం ఈశ్వరుడువున్నాడు । చిదాభాసంజీవునికి ఆ విద్యాఆవరణంవిక్షేపం వున్నాది। యీ అవిద్యలో చైతన్యప్రతిభాసం అయింది । ఆప్రతిభాసానకు స్వరూప జ్ఞానంలేదు । ప్రతిభాసజీవునికిదేహాభిమానం వున్నాది । దానికోసానకు శబలజీవుడు అనవలెను। స్థూల సూక్ష్మకారణదేహత్రయాతీతందేహత్రయానకు ప్రకాశ సాక్షికూటస్థఆత్మ । అదెజీవునిది శుద్ధ స్వరూపం । శబలశుద్ధంరెండు జీవాలు వున్నావాలేవు । అవిద్యా దేహబుద్ధి చాత శబల జీవత్వం పేరు వచ్చింది । అవిద్యాదేహత్రయంనిరసనం చేస్తె । దేహాభిమానత్యాగం చేస్తె కూటస్థుడు ఆత్మ । జీవుడు । వొక్కటె । ఆత్మవున్నాడు । అక్కడ రెండు విధాలులేవు । ఆకూటస్థ ఆత్మకు

ప్రత్యక్‌చైతన్యం అంచారు । ఈశ్వరస్వరూపానకు పూర్ణచైతన్యం అంచారు । ఆపూర్ణచైతన్యం అదె ప్రత్యక్‌చైతన్యం । ప్రత్యక్ చైతన్యం అదెపూర్ణచైతన్యం । యిట్లాతెలిస్తె దానిపేరు అపరోక్ష జ్ఞానం । అహంబ్రహ్మాస్మి । బ్రహ్మాహమస్మి । అఖండైకరసం । బ్రహ్మాం అదితనస్వరూపం । యిట్లాయెరిగెది । అపరోక్షజ్ఞానం । దానికిదృష్టాంతరం । పదుగురు మనుష్యులు నదిదాటి పోయినారు । పదిమంది దాటితిమిగదా అని నదిఆవల వెంచుకొంటెతొమ్మిదిమనుష్యులె గణితికి అయినారు । తానుపదోవాడు । తనకు విడిచినాడు । వొక్కడు మునిగి పోయినాడు । రోదనంచాయతగిలినాడు । అందుట్లోకిమరివొఘడు వచ్చెను। వారీ నీవుయందుకురోదనం చెస్తావురా । అనెను । వొక్కడు మునిగిపోయినాడు అని రోదనం చెస్తానని అనెను । యీ వచ్చినవాడు తిరిగి అందరినీ గణితిచేస్తె పదుగురుమనుష్యులూ వున్నారు । ఆవేళ్లవాడు అనెగదా వొరీనీవుగణితి చాయరా అనెను । వాడు తొమ్మిది మందినె గణితి చేస్తాడు । పదోవాడవునీవురా అని చెప్పెను । అప్పుడు అందరికీ సంతోషమాయను । అట్లాతాను కేవలచైతన్య స్వరూపం వున్నాడు । యీ అపరోక్షజ్ఞానం అయితె బ్రహ్మానంద ప్రతీతి అవుచుంది। శోకనాశం అవుతుంది । దుఃఖంయెమేమి అంటెను । శోకం అంటెను యెమి । దుఃఖంచాత శోకం అవుచుంది । స్థూలశరీరం వద్ద జ్వరాదికాలు రోగాలు వున్నావి । ఆరోగాలు తమకు ప్రాప్తం అయింది । అని దుఃఖం చెస్తాడు । యిట్లామన్నించి ఆరోగంచాత కష్టంఅవుచున్నాడు। అది వొకదుఃఖం । లింగ శరీరంమనుస్సుకు అయింది । కామక్రోధ మద మత్సరికములు అవుచుంది । అదితనకు అయింది అని దుఃఖిస్తాడు । యిది వొక దుఃఖం । కారణ శరీరంలో భ్రాంతి వున్నాది । ఆభ్రాంతి తనకు అయింది అని దుఃఖంపడుచున్నాడు । యీలాగున దేహత్రయంలో దుఃఖంశానావున్నాది । ఆదుఃఖంచాత కష్టం అవుచున్నాడు । దానిపేరు శోకం। అవ్వాళ్లతనకు బ్రహ్మాత్మైక్యజ్ఞానం అయింది । ఆవెళ్లదేహత్రయ తాదాత్మ్యాధ్యాసంపోచుంది । బ్రహ్మానిజధ్యాసంచాత బ్రహ్మానందం అవుచుంది। ఆవెళ్ల శోకనాశం ఆయను । నిరంకుశతృప్తి అంటెను । అంకుశం అంటెను ఆపేక్ష పేరు । నిరంకుశమంటెను నిరాపేక్షపేరు । ఆపేక్ష చెస్తె ఆపదార్థం ప్రాప్తి అయితె సంతోషం పడుచున్నాడు । దానిపేరు అంకుశతృప్తి । నిరాపేక్షఅంటెను। తనకు యెవెళ్లబ్రహ్మాత్మైక్య జ్ఞానం అయింది ఆవెళ్ల అఖండైకరసం బ్రహ్మామేవున్నాను । జగదాభాసం మిథ్యవున్నాది । అవెళ్లయిహలోకం పరలోకం యెమీ లేదు । బ్రహ్మాత్మైక్య జ్ఞానంచాత। యిహలోకభోగకామనా। పరలోకభోగకామనా । ఆజ్ఞానికి యెమీలేదు। బ్రహ్మాత్మైక్య జ్ఞానంచాత పరిపూర్ణానందం అయివుంచాడు । దానిపేరునిరాంకుశతృప్తి। యిదిసోప్తావ స్థలది అర్థం । యిందుట్లో అజ్ఞానం అవరణం విక్షేపంయిదెమూడు జీవునికి బద్ధకారివున్నాది । పరోక్ష జ్ఞానం అపరోక్షజ్ఞానం। శోకనాశనం నిరంకుశతృప్తి యివినాల్గు జీవునికి మోక్షకారివున్నావి। యిట్లావివేకం చాత తెలియవలెను। యీవివేకంయెవ్వరికివున్నాదో। వారి సహవాసంపట్టవలెను। ఆసహవాసంచాత తనకు వివేకం తెలుస్తుంది। యిది వివేకంలెకుంట్టె। నానాజపతప యాగయజ్ఞ సాధనాలు చేశినాయెమీకాన్యారదు। యీవివేకంచాత। అజ్ఞానం ఆవరణం రెండూ పోచున్నావి।

విక్షేపంయకాయకీపోదు। యిందు కోసానకు। సాధుసంగతిచాత శ్రవణ మననం చాయవలెను। యీమననంచాత నేనుకేవల చైతన్య స్వరూపం వున్నాను। అని యీలాగున నిజధ్యాసం చాయవలెను। నిజధ్యాసం చెయ్యంగా చెయ్యంగా విక్షేపం మెల్లెమెల్లెన తొలుగుతుంది। ఆవేళబ్రహ్మస్థితిప్రాప్తి అవుచుంది। బ్రహ్మస్థితి అయితె మాయా అవిద్యా జీవతనం ఈశ్వరతనం సర్వజగత్తు లేకుండాను అవుచుంది। బ్రహ్మమాత్రం పరిపూర్ణం వున్నాది। అదేతాను । యిది నిశ్చయం ॥

30 శ్రీ॥సాధకునిలక్షణం॥ బ్రహ్మస్వరూపం చూడవలెనని అపేక్షవుండెవానికి । వాడు యీసాధన చాయవలెను॥స్థూల సూక్ష్మ దేహద్వయానకు వెనకకు విడిచి పెట్టి అంతర్ముఖం అయితె । నిశ్చలమనుస్సుచేశి వూరికెచూడవలెను । చూడంగా చూడంగా చీకటి కనిపిస్తుంది। చీకటి చూడవలెను । ఆ చీకటి చూడంగా చూడంగా చీకటిపోతుంది । ప్రకాశం అవుచుంది। ఆప్రకాశం చూడంగా చూడంగా। ఆప్రకాశంలోపలను। చైతన్యస్వరూపం వున్నాది। అదేతాను వున్నాను। యిట్లా యెరుకపట్టితె। ఆప్రకాశంవెనకకు అవుచుంది। స్వయంప్రకాశ స్వయం జ్యోతి పరిపూర్ణచైతన్యంతాను వున్నాను। యిట్లా నిశ్చయం అవుచుంది। తత్వ మసిమహావాక్యంచాత మాయా అవిద్యాజీవఈశ్వర తనం పొయ్యికేవల చైతన్యం మిగులు చుంది । అదే చైతన్యం । యీఅంతరదృష్టిచాత చీకటి ప్రకాశం రెండూ పోంగా మిగిలింది కేవల చైతన్య ప్రకాశ స్వయం జ్యోతి చైతన్యం । ఆకేవల చైతన్యమునకు పరబ్రహ్మం అనవలెను। అదేతనస్వరూపం । అదేసకల దైవతాస్వరూపం । అదేసకల జీవస్వరూపం। యిట్లాయెరింగి। ఆస్వరూపస్థితి తోటివుండవలెను। అదేసాయుజ్యముక్తి॥యిదినిశ్చయం। యితిజీవన్ముక్త కృత జీవుని సప్తావస్థా వివరణం॥

31 శ్రీ॥ఆత్మఅకర్త అభోక్త సాక్షి ఆత్మకూటస్థ నిర్వికారనిర్గుణం॥నిరాకారం నిరాభాసం ప్రకాశరూపం జ్ఞానరూపం ఆనందరూపం। ఆకాశం। యిట్లా ఆత్మదిస్వరూపం। ఆ ఆత్మకర్తా భోక్తా యెమీకాదు। మరి। కర్తా భోక్తా యవ్వరు। మాయా అవిధ్యా రెండూ మిథ్యాభాసం। చాత ఆ కూటస్థ ఆత్మమీద వున్నాది। ఆ మాయావిద్యలో ఆత్మది అభాసం అయింది। దానిపేరు ఈశ్వరుడు జీవుడు। జీవేశ్వరులు। కర్తా భోక్తా। అదియట్లాను। ఈశ్వర మాయాంగీకారం చాత జగముది ఉత్పత్తి స్థితి ప్రళయం చెస్తాడు। యిందు కోసానకు కర్త అనవలెను। మాయా అంగీకారం చాత జగత్తు ఉత్పత్తి లెస్స అయితె ప్రతిపాలనం లెస్స అయితె సంహ్వారణం లెస్స అయితె యీశ్వరునికి ఆనందం। అవుచుంది। యీ ఆనందంపేరుభోగం। యిందు కోసానకు ఈశ్వరుడు కర్తా భోక్తా అనవలెను । మాయాఅంగీకారం చాత కర్తా। మాయా అంగీకారం చాత భోక్తా అనవలెను। యీశ్వర స్వరూపం చూస్తె। కూటస్థచైతన్యం మాయాఅంగీకారాం చాతకర్తా భోక్తామాయాఅంగీకారం చాయకుంటె కర్తాభోక్తా యెమీకాదు। ఈశ్వరస్వరూపం కేవల చైతన్యం। చిన్మాత్రంచిదాకాశం వున్నాది । ఆలాగే జీవుడు ఆ అభాసం అవిద్యలో అయింది। అవిద్యా అంగీకారం చాత కర్తా భోక్తా అని యిట్లా కనిపిస్తుంది। అవిద్యాత్యాగం చేస్తె కర్తా భోక్తా

యెమీకాడు। అవిద్యా అంగీకారంచాత స్థూలదేహంమీద వస్తె జాగృతి అవస్థ చేస్తాడు। శరీరానకు నిద్రవస్తె జీవుడు స్వప్నావస్థ చేస్తున్నాడు। మనుస్సు యింద్రియాలు కారణశరీరంలో లయంఅయితె సుషుప్తి చేస్తాడు। ఆజీవుడు దేహత్రయతాదాత్మ్యం చాత బంధనం తనకు చేసుకొంటూ వున్నాడు । దేహత్రయా విచారంచాత తనకు మోక్షం చేసుకొనడు। యీప్రకారంచాత అయిదు అవస్థలకు కర్త జీవుడు । మరియేమిచేస్తాడు। జాగృతి అవస్థామిదికివచ్చి వర్ణాశ్రమ కర్మ కర్త అవుతాడు॥ సంసారప్రపంచ వ్యవహారం కర్త అవుచాడు। యట్లా యట్లా కర్మాలు చేస్తున్నాడు । అట్లా అట్లా ఆకర్మంది ఫలభోక్త అవుతాడు । కర్మ ఫలం సుఖందుఖ్ఖం। నానావిధ జన్మం అయిభోగీస్తాడు । యీజీవునికి యంతపర్యంతం ఆత్మజ్ఞానంలేదు । అంతపరియంతరం కర్మ ఫలభోగం తగిలింది । యట్లా నిద్రవస్తే స్వప్నంలో సుఖదుఃఖం అవుచుందిఅట్లాజీవునికి ఆత్మజ్ఞానం లేదు । యిందుకోసానకు కర్తా భోక్తా తనం వచ్చింది। యిది యట్లావచ్చింది। జాగృతి అవస్థలో స్వాభిమాని యై। ఆజాగృతి అవస్థాకర్మకర్తవ్యం సుఖదుఃఖం యేమిఅవుచుందో దానికి కర్తా భోక్తా అవుచున్నాడు । స్వప్నంలో తైజసాభిమాని అవుచున్నాడు । ఆస్వప్నంలో కర్మకర్తృత్వం సుఖదుఖ్ఖం అయికర్తా భోక్తా అయినాడు । సుషుప్తిలో ప్రాజ్ఞ అభిమానియై సుషుప్తి మయం అవుచున్నాడు । యిట్లా ఆత్మస్వరూపజ్ఞానం చాత కర్తాభోక్తా తనం తగిలింది। యీమూడు అవస్థలలో వున్నాడు। దానిపేరు బంధనం। ఆ జీవునికి యెప్పుడు మోక్షం కావలెనని యిట్లా మోక్షా పేక్ష అవుచుందో అప్పుడు సత్సమాగమంచాత ఆత్మ విచారం చేస్తాడు। అప్పుడు మోక్షం తెలుస్తుంది । తన ఆత్మస్వరూపం దేహత్రయాతీతం । సాక్షి రూపచైతన్యం నేను వున్నాను। యిట్లా జ్ఞానం అయితె యీ అవస్థాత్రయం నుంచి ముక్తుడు అవుచున్నాడు । దాని పేరు మోక్షం । తన ఆత్మస్వరూపం నిరాకారం నిరాభాసం స్వయంప్రకాశచైతన్యం । అదేనేను వున్నాను । యిట్లా తెలిస్తె కర్తాభోక్తా తనం పోచుంది। మరి జీవతనం పొయ్యి ఆత్మస్వరూపం అవుచున్నాడు । యిది నిశ్చయం॥ ఇతి శ్రీ జీవన్ముక్త కృతకర్తాభోక్తావివరణం॥

33 శ్రీ॥జ్ఞాన భక్తి వైరాగ్యాల వివరణం॥ జ్ఞానం అంటెనుయేమి । భక్తి అంటెను యేమి। వైరాగ్యమంటెనుయేమి । ముందు వైరాగ్యవిచారం। యిహలోకంలో స్రక్చందనవనితావిత్తం యిది సంపాదన చేశి భోగించవలెను। యాగాలు చేశి అనేకదాన ధర్మాలు చేశి । యీపుణ్య ప్రతాపం చాత స్వర్గమునకు పోవలెను। ఆస్వర్గంలో అప్సరస భోగం అమృతపానం । గాయనాది నానావిలాసం భోగించవలెను। అని యిట్లా ఉభయలోకం నాశవంతం అశాశ్వితం । దానిలో భోగాలు వున్నావి । అవ్వీఅశాశ్వితం। యీలాగున వివేకంచాత యెరిగి భోగవాసన త్యాగం చాయవలెను । దానిపేరువైరాగ్యంతనకు మోక్షం। ప్రతికావలెను। అని యిచ్ఛ అయింది। వాడు భగవద్భజనంచెయ్యవలెను । ఆభగవద్భజనం యట్లా అంటె।మనుస్సు చాత హరిధ్యానం। ముఖంచాత హరిస్మరణం । చేతుల చాత హరిపూజనం । నేత్రంచాత హరివిగ్రహధరిశనం । శ్రవణంచాత హరికీర్తన శ్రవణం । పాదాలచాత హరిదేవాలయగమనం । జిహ్వాచాత మరిపాద

తీర్థస్నానం। సర్వాంగంచాత సాష్టాంగనమస్కారం। హరిస్వరూపం మీదప్రేమ। దానిపేరు భజనం। దానిపేరు భక్తి। హరికితాను కామ్యం కొరకునిష్కాముడై హరి భజనచాయవలెను। దాని పేరు భక్తి। యీభక్తిచాత । హరిప్రసన్నమై । జ్ఞానం యిస్తాడు । యేప్రకారంచాతయిస్తాడంటెను । తన భక్తునికి సత్సహవాసంచేయిస్తాడు। అసాధుముఖంచాత శ్రవణంచేస్తాడు । శ్రవణం దిమననం చేస్తాడు । మననంచాత నిజధ్యానం అవుచుంది । అనిజధ్యానం చాత బ్రహ్మసాక్షాత్కారం అవుచుంది। ఆబ్రహ్మసాక్షాత్కారం పేరు జ్ఞానం। అజ్ఞానం అయ్యేందుకు మూలం విరక్తి । అవిరక్తియట్లా వస్తుంది। అనేకజన్మంచాత। కామ్యకర్మం నిషిద్ధకర్మం విడిచిపెట్టి। సత్యంనైమిత్తిక కర్మం కర్మానుష్ఠానం చేస్తాడు। ఫలాశలేదు। అషువంటి నిష్కామపుణ్యప్రతాపంచాత చిత్తంలో అనేక జన్మవాసన చిత్త పాపదగ్ధం అవుచుంది। దానిపేరు చిత్తశుద్ధి । ఆచిత్త శుద్ధిచాత విరక్తి అవుచుంది। విరక్తి చాత వివేకం పుట్టుచుంది । అవ్యాళ్లసత్సహవాసంచాత ఆత్మజ్ఞానం అవుచుంది। యీ ఆత్మజ్ఞానం యట్లా యట్లా అవుచుంది । తానుదేహత్రయాతీతం । సాక్షి స్వరూపం ఆత్మనువున్నాను। మాయాతీతం హరిస్వరూపం। కేవలచైతన్య మాత్రం। హరిస్వరూపం నేను। సాక్షి ఆత్మయిలాగున తెలిశి హరిస్వరూపంలో సమరసం అయ్యిపోచాడు। యీజ్ఞానభక్తి చాత అవుచుంది। యిట్లా జ్ఞాన భక్తి వైరాగ్యం। హరిభక్తి లేకుంటె హరికృపయట్లా అవుచుంది। కాదు । హరికృపలేనిది జ్ఞానం యట్లాను। అయ్యేనికాదు। యిందు కోసానకు హరిభజనం అగత్యం। చాయవలెను। హరిభక్తిలేక శాస్త్ర విద్యతోటి జ్ఞానం అయితె। వానికి జ్ఞానాభిమానం వస్తుంది। అజ్ఞానాభిమానం దేహాభిమానం ఘట్టిగా అవుచుంది। వానికి స్వరూప్రాప్తి యేలాగు అయ్యేనికాదు। వానికి శబ్ద జ్ఞానం మాత్రం అయ్యేని। స్వరూప జ్ఞానం లేదు। యిందుకోసానకు భక్తిజ్ఞాన విరక్తి। ఈశ్వరకృప చాత అవుచుంది। విరక్తిలేకుంటె విషయాసక్తి పోదు। విషయాసక్తి చాత తిరిగీ దేహబుద్ధి వస్తుంది। యిందుకోసానకు విరక్తి వుండవలెను। భక్తివుండవలెను। ఆత్మజ్ఞానం వుండవలెను। యీమూటిచాత బ్రహ్మప్రాప్తి అవుచుంది। భక్తివినహాజ్ఞానం పనికి రాదు। వైరాగ్యం వినహాజ్ఞానం పనికి రాదు। యిందు కోసానకు జ్ఞాన భక్తి వైరాగ్యములు యీమూడూ వుండవలెను। వైరాగ్యంచాత విషయాసక్తి పోతుంది। జ్ఞానంచాత అజ్ఞానం నివర్తి అవుచుంది। భక్తిచాత హరి స్వరూపంలో కలిశిపోతాడు। యీలాగున విచారం వున్నాది । యిదినిశ్చయం। జ్ఞానభక్తి వైరాగ్యములు లేక। సత్కర్మాచరణం చేశెనాసత్కర్మాచరణ ఫలం వలన। జన్మానకు పొయ్యెఫల భోగం చెస్తాడు। మరీజన్మాదుల కెహేతువై వుంచున్నాడు। గనక । హరియందు జ్ఞానభక్తి వైరాగ్యతాత్పర్యములు గలిగి వుండవలెను । వుంట్టే బ్రహ్మప్రాప్తి అవుచుంది । వాడు వివేకుడు । వివేకమంతుడు వున్నాడు వాడు జ్ఞానభక్తి వైరాగ్యముల చాత। కార్యసిద్ధి అవుచుంది। నిశ్చయం। ఇతి శ్రీ జీవన్ముక్తకృత భక్తి జ్ఞాన వైరాగ్య వివరణ ॥

౩౪ శ్రీ॥ ఆధ్యాత్మిక అధిభూతిక అధిదైవికవిచారం। అంతఃకరణం అధ్యాత్మం। స్ఫురణం అధిభూతం। విష్ణు అధిదైవతం। మనస్సు ఆధ్యాత్మం। సంకల్ప వికల్పం అధిభూతం। చంద్రుడు

ఆధిదైవతం। బుద్ధి ఆధ్యాత్మం। యరుక ఆధిభూతం। బ్రహ్మదేవుడు ఆధి దైవతం। చిత్తం ఆధ్యాత్మం। అనుసంధానం ఆదిభూతం । నారాయణుడు ఆదిదైవతం । అహంకారం అధ్యాత్మం। అహం మమత్వం ఆధి భూతం। శంకరుడు। ఆధిదైవతం। శ్రోత్రం ఆధ్యాత్మం। వినేది ఆధిభూతం। దిక్కులు ఆధిదైవతం। త్వక్కు ఆధ్యాత్మం। స్పర్శం పుచ్చుకునెది ఆధిభూతం। వాయువు ఆధిదైవతం। చక్షువు ఆధ్యాత్మం। చూచెది ఆధిభూతం। సూర్యుడు ఆధిదైవతం। జిహ్వ ఆధ్యాత్మం। రసం పుచ్చుకొనెది ఆధి భూతం। వరుణుడు ఆధి దైవతం। ఘ్రాణం ఆధ్యాత్మం। పరిమెళం పుచ్చుకునెది ఆధిభూతం। అశ్వినీకోమారులు ఆధిదైవతం। వాక్కు ఆధ్యాత్మం। పల్కెది ఆధిభూతం। అగ్నిహోత్రుడు ఆధి దైవతం। హస్తం ఆధ్యాత్మం। చేశెది ఆధిభూతం। ఇంద్రుడు ఆధిదైవతం। పాదం ఆధ్యాత్మం । నడిచెది ఆధిభూతం। ఉపేంద్రుడు ఆధిదైవతం। శిశ్నం ఆధ్యాత్మం। మూత్రం చేశెది ఆధిభూతం। ప్రజాపతి ఆధిదైవతం। గుదం ఆధ్యాత్మం। మలత్యాగం ఆధి భూతం। నైర్రుతి ఆధిదైవతం ।పంచప్రాణాలు వాయుసంమంధం। దానికి ఆధ్యాత్మికాదులు లేవు। విషయపంచకంజడం దానికి ఆధ్యాత్మికం లేదు। పంచమహాభూతం జడం। దానికి ఆధ్యాత్మికాదులు లేదు। పాంచభూతిక శరీరంస్థూలం। ఆ శెరీరం ఆధ్యాత్మికం। జాగ్రదవస్థ ఆధిభూతం। బ్రహ్మదేవుడు ఆధిదైవతం। సూక్ష్మ శరీరం ఆధ్యాత్మికం। స్వప్నావస్థ ఆధిభూతం। విష్ణు ఆధిదైవతం। కారణ శరీరం ఆధ్యాత్మికం। సుషుప్త్యవస్థ ఆధిభూతం। రుద్రుడు ఆధిదైవతం। మహాకారణ శరీరం ఆధ్యాత్మికం। తుర్యావస్థ ఆధిభూతం। ఈశ్వరుడు ఆధిదైవతం। యీఆధ్యాత్మికత్రిపుటి। చైతన్య స్వరూపంలో లేదు । యిదేసకల ఆధ్యాత్మిక ఆధిభూతిక ఆధిదైవతం। యిది మాయామయం ఆభాసం। యిది మిథ్య। యీసకల త్రిపుటిలో జీవుడు యీశ్వరుడు। సకల దైవతం సకల జగత్తు వచ్చింది। యిది మాయాభాసం। యట్లా ఆకాశంలో। నీలవర్ణం। రశ్మిలో మృగజలం। రజ్జువులో సర్పాభాసం। శుక్తికలోరజితాభాసం। పర్వతాలలో పొగ ఆభాసం। స్థాణువులో పురుషాభాసం। దూరం నుంచి చూస్తె । కనుపిస్తుంది। దగ్గెరికి పోయితెయెమీలేదు। అట్లా అవిచారం తోటి చూస్తె యీ ఆధ్యాత్మిక త్రిపుటి కనిపిస్తుంది। ఆత్మవిచారం తోటి చూస్తె యెమీ లేవు। చైతన్య మాత్రం వున్నాది। ఆచైతన్య స్వరూపం తాను। యీలాగునయెరింగి త్రిపుటి అభిమానం విడిచిపెట్టి స్వరూప స్థితి తోటి వుండవలెను। యీ ప్రకారం వుంటెను। బ్రహ్మసాయుజ్యం అవుచుంది యిది నిశ్చయం। ఇతి శ్రీ జీవన్ముక్తకృత ఆధ్యాత్మికాదిక వివరణం ॥

3౫ శ్రీ॥ బంధవ్యాఖ్యాన వివరణం। ఆత్మస్వరూపానకు బ్రహ్మం అనవలెను। బ్రహ్మం అంటెనుయేమి। ఆత్మస్వరూపానకు ఆద్యంతం లేదు। యిందుకోసానకు బ్రహ్మం అనవలెను। యీ ఆత్మస్వరూపం అతిగుహ్యం । యిందుకోసానకు వస్తువు అవనవలెను । ఆ ఆత్మ స్వరూపం జ్ఞానరూపం వున్నాది । యిందుకోసానకు చైతన్యం అనవలెను । కేవల జ్ఞానమాత్రం వున్నాది । యిందుకోసానకు చిన్మాత్రం । చిద్రూపం । చిత్స్వరూపం । అనవలెను । ఆత్మస్వరూపానకు ।

చిదాకాశం అనవలెను । జ్ఞానరూపం అకాశం । ప్రకాశరూపం అకాశం । ఆనందరూపం అకాశం। యిందుకోసానకు చిదాకాశం అనవలెను । అకాశం యందుకు అనవలెను । నిర్మలంవున్నాది। గనుక అకాశం అనవలెను । స్వయంప్రకాశంవున్నాది । ఆత్మ స్వరూపం స్వయంప్రకాశం వున్నాది । యీ ఆత్మ స్వరూపం అతిగుహ్యం । యిందుకోసానకు వస్తువు అనవలెను । యిందుకోసానకు అనాది అనవలెను। ఆత్మస్వరూపానకు ఆదిలేదు। అంత్యంలేదు। యిందుకోసానకు అనంతం అనవలెను। ఆత్మస్వరూపం భూత భవిష్యత్కాల మందు। వర్తమానకాలం యట్లా వున్నాదో అట్లాగె వున్నాది। యిందుకోసానకు। సత్ అనవలెను। సుఖరూపంవున్నాది । యిందుకోసానకు ఆనందం అనవలెను। యిది సత్‌చిత్ ఆనందం మూడూ కూడా వొక్కటె ఆత్మ। ఆత్మయిందుకు అనవలెను। అదేతాను। యిందుకోసానకు ఆత్మ అనవలెను। ఆత్మస్వరూపానకు పరమాత్మయిందుకు అనవలెను। మాయాతీతం పరంఉత్కృష్ఠంగనక పరమాత్మ అనవలెను। యీఆత్మస్వరూపంచాత మాయాఆది చేశి సకల జగత్తు ఆత్మ సత్తాచాత। నిర్మాణం అవుచుంది। సకల జగత్తు ప్రకాశం అవుచుంది। సకల జగానకు సాక్షి। సకల జగత్తులో వ్యాపకం। సకల జగత్తుకూసంహ్వారం అవుచుంది। యిందుకోసానకు। ఆత్మస్వరూపానకు ఈశ్వరుడు అనవలెను। యీ ఆత్మప్రకాశంచాత సకల జగత్తు జీవిస్తు వున్నాదిగనక జీవుడు అనవలెను। యీ ఆత్మస్వరూపం జగద్రూపం వున్నాది। యిందుకోసానకు అన్వయం అనవలెను। ఆ ఆత్మస్వరూపం జగద్రూపంకాదు। యిందు కోసానకు వ్యతిరేకం అనవలెను। ఆఆత్మ స్వరూపంలో జగదాభాసం లేదు। వ్యతిరేక అన్వయాతీతం। కేవలం అనవలెను। ఆ ఆత్మస్వరూపం సత్తాచాత మాయావొక్క క్షేత్రం। ఆమాయనుంచి సకల జగత్తు నిర్మాణం అవుచుంది। ఆమాయా ఆదిజేశి । నకలజగత్తును యెరుగుచాడు। యిందుకోసానకు క్షేత్రజ్ఞుడు అనవలెను। సర్వజ్ఞుడనవలెను। ఆ అవస్థాత్రయానకూ సాక్షిగనక। కించిజ్ఞుడనవలెను। ఆ ఆత్మస్వరూపం పరిపూర్ణం వున్నాది। దానికి జన్మంలేదు । యిందుకోసానకు అజం అనవలెను । ఆత్మస్వరూపానకు నాశంలేదు । యిందుకోసానకు అవినాశం। అవ్యయం । అక్షరం అనవలెను। మాయావికారం ఆత్మ స్వరూంపలో లేదు। యిందుకోసానకు నిర్వికారం । అనవలెను। సత్వాధిగుణాలు లేవు। యిందుకోసానకు నిర్గుణం అనవలెను। ఆత్మస్వరూపంలో మాయా అవిద్యా జీవఈశ్వర రోగాలు లేవు। యిందుకోసానకు నిరామయం అనవలెను। మాయా అవిద్యా ఆకారం లేదు। యిందుకోసానకు నిరాకారం అనవలెను। యీ ఆత్మస్వరూపంలో జ్ఞానాంజనం లేదు। యిందు కోసానకు నిరంజనం అనవలెను। యీ ఆత్మస్వరూపంలో కర్మంలేదు। యిందుకోసానకు నిష్కర్మం అనవలెను। ఆఆత్మస్వరూపంలో బంధం లేదు। మోక్షం లేదు। యిందుకోసానకు బంధ మోక్షాతీతం అనవలెను। యీ ఆత్మస్వరూపానకు యెరిగెదాని పేరు జ్ఞానం । యీ ఆత్మస్వరూపం తోటిఆనందం అవుచుంది। దాని పేరు అనుభవం। యీ ఆత్మ స్వరూపంలో వృత్తి లయం అవుచుంది। దానిపేరు శమం। యీ ఆత్మస్వరూపం తోటి వుండంగా వాసనాక్షయం అవుచుంది । దానిపేరు వైరాగ్యం। యీ ఆత్మస్వరూపం నేను। యీలాగున యెరిగెది వివేకం।

ఆ ఆత్మస్వరూపం మీద ప్రేమ వుంచేది। దానిపేరు భక్తి ఆఆత్మ స్వరూపం తోటి వుండవలెను। దానిపేరు బ్రహ్మనిష్ఠాత్వం । ఆ ఆత్మస్వరూపంతానేవున్నాను యిట్లాయెరిగెది ప్రాప్తి। ఆత్మస్వరూపం పరిపూర్ణం వున్నాది । అంతాయింతా అని మరియాదాలేదు। యిందుకోసానకు గురువు అనవలెను। జ్ఞానం చాత తన ప్రకాశంఅవుచుంది। దానికోసానకు శిష్యుడు అనవలెను। ఆ ఆత్మస్వరూపం స్వప్రకాశం దానికోసానకు దైవం అనవలెను। ఆ ఆత్మస్వరూపం తనకు తానేభజిస్తున్నాడు। దాని కోసానకు భక్తుడు అనవలెను। తనధ్యాన్నం తానుచేస్తాడు। యిందుకోసానకు ధ్యాతా అనవలెను। ధ్యాతాధ్యాన్నం ధ్యేయం ఆత్మస్వరూపమే। ఆ ఆత్మతనలో తానువుంటాడు। దాని కోసానకు ఐక్యం అనవలెను। ఆ ఆత్మస్వరూపంలో ఉపాధియెమీలేదు। యిందుకోసానకు నిరుపాధి అనవలెను। అషువంటి ఆత్మస్వరూపం తానువున్నాడు। యిట్లా గురుముఖంచాత। శాస్త్రముఖంచాత। తన అనుభవంచాత। యెరింగి తన స్వరూపస్థితి తోటి వుండవలెను। యిట్లాయవ్వరు వున్నారు వారికి అదేప్రాప్తి । జన్మ మరణ సంసారం వారికి పునః అయ్యేదిలేదు। యిది నిశ్చయం। ఇతి శ్రీ జీవన్ముక్త కృత బంధవ్యాఖ్యాన వివరణం ॥

౩౬ శ్రీ॥ నిరాభిమాని దశా॥ జీవుడు చైతన్య స్వరూపం వుండంగా । అజ్ఞానం చాత అజ్ఞాన కార్యదేహద్వయం అయింది। ఆదేహద్వయం మీద అహంకారం పట్టివున్నాడు । యిందు కోసానకు తాను చైతన్యస్వరూపం। చైతన్య స్వరూపం వుండేది। అజ్ఞానంలేదు। యిట్లా అనాది నుంచి అయింది। ఆ జీవుడు పుణ్యవశాత్బ్రాహ్మణ దేహానకు వచ్చినాడు। పాపమిశ్రమపుణ్యచాత కర్మదేహానకు వస్తాడు। యిట్లాయిట్లా అనాదినుంచి అయింది। బ్రాహ్మణ జన్మానకు వస్తె బ్రాహ్మణాభిమానం పట్టివుంటాడు । కడమ దేహానకు వస్తె ఆజాతి అభిమానం పట్టివుంటాడు। బ్రాహ్మణ జన్మానకు వస్తె సంహ్వితాపదక్రమంజటా ముఖ పాఠంచేస్తాడు ఆవైదీక అభిమానం పట్టివుంటాడు। ఆబ్రాహ్మణజీవునికి। గురుకృపచాత శృతి వాక్యంచాత ఆత్మజ్ఞానం అయితె నేను వైదీకుడను అనె అభిమానం విడచిపెట్టుతున్నాడు। తన స్వరూపంలో మనుస్సువుంచి నిరాభిమానం అవుచున్నాడు। యిట్లా నిరాభిమానిదశా అయితె స్వరూప స్థితి అవుచుంది। కొందరు బ్రాహ్మణులు బ్రాహ్మణ జన్మానకు వచ్చి శాస్త్రపాఠం చేస్తారు। న్యాయంతర్కమీమాంస వ్యాకరణాదిపాఠం చేస్తారు। దాని అర్థాన్వయం లెస్సయెరింగి ఆశాస్త్రాభిమానం పట్టివుంటాడు। అషువంటి జీవుడు। వానికి గురుకృప చాత శృతి వాక్యం చాత ఆత్మజ్ఞానం అయితె శాస్త్ర అభిమానం విడచిపెట్టుతాడు । తనస్వరూస్థితి తోటి వుంట్టాడు। దానిపేరునిరాభిమానిదశా। కొందరు బ్రాహ్మణులు జ్యోతిఃశాస్త్రంపాఠంచేస్తారు । జ్యోతిఃశాస్త్రముది జ్ఞానం లెస్సగా అర్థం చెస్తారు । మందికిగ్రహగతులు చెప్పుచున్నారు । తనకు యెరుగడు । తాను కేవల చైతన్య స్వరూపంలో యీ జ్యోతిషంగ్రహచారం యెమీ లేదు । యిట్లా యరుగడు। ఆజ్యోతిషాభిమానం పట్టివుంటాడు । అషువంటి జీవునికి గురుకృప చాత శృతి వాక్యం చాత జ్యోతిషాభిమానం విడుస్తున్నాడు । తనస్వరూపంయెరింగి నిరాభిమానం అవుతున్నాడు । దాని పేరునిర్ాభిమానిదశ।

మరికొందరు బ్రాహ్మణులు। బ్రాహ్మణుడనువున్నాను యీ అభిమానంపట్టి। బ్రాహ్మణ కర్మాభిమానం పట్టివుంటాడు । అగ్నిహోత్రవైశ్వదేవదేవపూజ చేస్తాడు। సోమయాగం చేస్తాడు । చేశినేనుయాజ్ఞీకుడను। నేనుదీక్షతుడను । నేనుసోమయాజిని యిట్లా అభిమానంఘట్టిగా పట్టి వుంటాడు। తన ఆత్మస్వరూపం యరగడు। దేహత్రయాతీతం। కేవలచిన్మాత్ర చైతన్యఘనం పరబ్రహ్మంఅదెతాను। యిది యరగడు। తనస్వరూపంలో మనోబుద్ధీంద్రియాలు యెమీ లేవు। శరీరంలేదు। వర్నాశ్రమంలేదు। కేవలచైతన్య ఘనం। తనస్వరూపం యిది యరుగడు। కర్మాభిమానం పట్టివుంటాడు। అటువంటి జీవుడు పుణ్యప్రతాపంచాత గురుకృప అయితె గురువాక్యంచాత తనస్వరూపందిజ్ఞానం అయితె కర్మాభిమానం విడచిపెడుతున్నాడు। తనస్వరూపస్థితి తోటివుంటాడు । దాని పేరునిరాభిమాని దశ। కొందరు బ్రాహ్మణులు బ్రహ్మచారి యైవుంటారు। బ్రహ్మచారి అంటే యేమి। వివాహం చేసుకొనడు। కౌపీనంవెశి మాదోకరం అడిగి విద్యాభ్యాసంచేస్తాడు। వాడు బ్రహ్మచారితనం అభిమానం పట్టి వుంటాడు। తన స్వరూపం కేవల చైతన్యంయెరుగడు। యీ శరీరం బ్రహ్మచారి వున్నాది। తన స్వరూపంలోపాంచ భూతిక శరీరంలేదు। యిట్లాయరుగడు । బ్రహ్మచారి తనముది అభిమానంపట్టివుంటాడు। అషువంటి బ్రహ్మచారికి। గురుకృప అయితె గురువాక్యం శృతివాక్యం చాత। ఆత్మజ్ఞానం అయితె బ్రహ్మచారి తనం అభిమానంవిడుస్తాడు। దాని పేరునిరాభిమానిదశ। కొందరుజీవులు ద్రవ్యం సంపాదన చేశి వివాహం చేసుకొంటారు। నేను గృహస్థును అని యీలాగున అభిమానం పట్టి వుంటారు। తనస్వరూపం యెరుగడు। తన స్వరూపంకేవల చైతన్యం। అక్కడ పాంచభూతిక శరీరం లేదు। మరి వివాహంలేదు। అక్కడగృహస్థుతనంలేదు। అషువంటితన స్వరూపం యరుగక గృహస్థు తనం అభిమానం పట్టివుంచున్నాడు। నేను సంసారిని। అంటాడు। అషువంటి జీవునికి పుణ్యప్రతాపంచాత గురు కృప చాత గురువాక్యంశృతి వాక్యం చాత ఆత్మజ్ఞానం అయితె గృహస్థు తనం అభిమానం విడచిపెడుతున్నాడు। తన స్వరూప స్థితితోటి వుంచున్నాడు। దాని పేరునిరాభిమానిదశ। కొందరు జీవులు వానప్రస్థా శ్రమానకు పోతారు। అరణ్యంలోకి పొయ్యి అక్కడ గంఫాచేశి తపస్సు చేస్తారు। మనస్సు యింద్రియాలు ప్రాణాలు నిగ్రహం చేశి యెకాగ్రచిత్తం చాత భగవధ్యాన్నం చేస్తారు। దాని పేరు తపం। ఆతపాభిమానంపట్టివుంటారు। దాని మీద భగవత్కృప అయితెగురుప్రాప్తి అవుచుంది। ఆగురుకృప చాతశృతి వాక్యంచాత ఆత్మజ్ఞానం అవుచుంది। తానుకేవల చైతన్య స్వరూపంవున్నాను। యిట్లా జ్ఞానం అయితె। తపాభిమానం విడుస్తున్నాడు। తనస్వరూపస్థితి తోటి తానువుంటాడు। దాని పేరునిరాభిమాని దశా। కొందరు జీవులు సన్యాసంపుచ్చుకొంటారు। ప్రైషోచ్చారణచేశి। శిఖాసూత్రత్యాగంచేశి। కౌపీనదండకమండలం పట్టుచాడు । సన్యాసధర్మము చేస్తున్నారు । ఆ సన్యాసత్వం అభిమానం। నేను సన్యాసిని అని । అభిమానం పట్టుతారు। దండకమండలం విడిచిపెట్టితె। నేను పర మర మహంసను। అని యిట్లా అట్లా అభిమానం పట్టుచారు। తనస్వరూప మెరుగడు । తనస్వరూపం

కేవలచైతన్యం । అక్కడ స్థూలసూక్ష్మ దేహద్వయంలేదు । దేహముది శిఖాసూత్ర త్యాగం చేస్తి। నేను సన్యాసిని వున్నాను। అని యిట్లా అభిమానం పట్టుచారు। యిది యేమి । యిట్లా యెరుగడు। యిషువంటి సన్యాసికి గురుకృపచాత శృతి వాక్యంచాత ఆత్మజ్ఞానం చాత। సిద్ధోపాయం లభించితె। సన్యాసత్వం అని అభిమానం విడచిపెట్టుచున్నాడు। దాని పేరు నిరాభిమాని దశా। కొందరు జీవులు ఉపాసకులు। జగత్తులోఉపానన మార్గంవున్నాది। కొందరు వినాయక ఉపాసకులు। కొందరు సూర్య ఉపాసకులు। కొందరు విష్ణు ఉపాసకులు। కొందరు శివఉపాసకులు। కొందరు । శక్తి ఉపాసకులు। యీ అయిదువుపాసనాలు। వేదాంతములో చెప్పినారు। తమతమ దేహాభిమానములు పట్టివుంటారు। అషువంటి ఉపాసకుల వారు తన స్వరూప మెరుగరు। తాను సకల ప్రకాశకుడు। సకల సాక్షి కేవల స్వయం ప్రకాశచైతన్యం వుండంగా। తన స్వరూపమును గురుతుయెరుగడు। ఆదేవతాఉపాసనాభి మానం పట్టి వుంటారు । నేను గాణాపత్యుడను । నేను సౌరుడను । నేను వైష్ణవుడను । నేను శైవుడను । నేను శాక్తియ్యుడను। అని అభిమానం పట్టి వుంటాడు। అషువంటి జీవులకు। గురుకృపచాత। తత్వమస్యాది మహా వాక్యంచాత ఆత్మజ్ఞానం అయితె ఆవుపాసనాభిమానాలు విడచి పెడుచున్నారు। తనస్వరూపం యెరింగి స్వరూపస్థితి తోటి వుంటారు । దాని పేరునిరాభిమాని దశా । మరి కొందరు జీవులు సాధువునకు శరణుబోయి। వివేక వైరాగ్యం చాత। సత్సహవాసం చాత శ్రవణ మనన నిజధ్యాసంచాత । బ్రహ్మాత్మైక్యజ్ఞానం అవుచుంది । బ్రహ్మ సాక్షాత్కారం అవుచుంది । వాడు నేను వొక్కసాధును। నాకు బ్రహ్మజ్ఞానం అయింది । యీ అభిమానం పట్టడు । తనస్వరూప స్థితి తోటి వుంచారు । దాని పేరు నిరాభిమాన దశ । కొందరు జీవులుగాయనం చేస్తారు। గాయనం నేరుస్తారు। గాయనం చెప్పువారి వద్దికి పోయి ఆరురాగాలుగాయనం నేరుస్తారు। ముప్పై యారురాగిణీలు దానిది అభ్యాసం చేస్తారు। మందిలోతన విద్య తోటి తిరుగుచున్నారు। నేను గాయకుడనని అభిమానం పట్టి వుంచారు। ఆ జీవునికి పుణ్యప్రతాపం చాత। నిత్యా నిత్య వివేకంచాత ఆత్మ స్వరూపందియరక । అవుచుంది। గురుముఖాంతరంచాత మహావాక్య విచారం చాత । ఆత్మజ్ఞానం పుట్టిగా అవుచుంది । ఆవేళ్లగాయనాభిమానం విడచి । తన స్వరూపస్థితి తోటివుంచాడు। దానిపేరు నిరాభిమాని దశా। మరికొందరు సాధారణ కథ చేశెటివారు। మరి రామాయణంభారతం భాగవతం। నానాచరిత్రలు। పాఠంచేశి నానాశ్లోకాలు నానాపదాలు। నానావిధకవిత్వాలు। తాను కవిత్వాలు చేస్తాడు। అది సర్వపాఠం। కీర్తన చేస్తాడు। మాకథ లెస్స అయింది। అనిసంతోష పడుచున్నాడు। తనస్వరూపం యరుగడు। భగవత్కృపచాత యేమిపాఠంచేశి నాదోదాని అర్థం చాత। మరి సాధుముఖాం తరంచాత ఆత్మజ్ఞానం అవుచుంది। ఆవెళ్లనేను చైతన్య స్వరూపం వున్నాను । అని యిట్లా జ్ఞానం అవుచుంది। ఆవెళ్లకీర్తన అభిమానం పోతుంది। స్వరూపం ప్రాప్తి అవుచుంది। ఆవెళ్లనిరాభిమాని దశ అవుచుంది । మరి సాధారణులు కొందరు తీర్థ యాత్రలు చేస్తారు । కాశీ రామేశ్వరంద్వారకా బదరీనారాయణం మొదలుగా గల తీర్థ యాత్రలు

చేస్తారు । తీర్థమహిమచాత పాపనివర్తి అవుచుంది। పుణ్యం పెరుగుచుంది। అపుణ్య ప్రతాపంచాత ఆ జీవునికి వైరాగ్యం పుట్టుచుంది। సత్సహవాసం అవుతుంది। సాధు ముఖాంతరం శ్రవణం చేస్తే ఆత్మజ్ఞానం అవుతుంది। తన స్వరూపం కేవల చైతన్యం । వున్నాది। యిట్లా తెలుసుకొని । తీర్థాభిమానం విడుచుతున్నారు। మరి స్వరూప ప్రాప్తి తోటి వుంటారు। అవెళ్లనిరాభిమాని దశ అవుచుంది। కొందరు జీవులు ప్రాణాపాన యోగం చేస్తారు। వజ్రాననం చేశి। శరీరానకు త్రిబంధనంచేశి రేచక పూరకకుంభకం చాత ప్రాణాయామం చేస్తారు। ప్రాణపానం యిద్దరికి అయిక్యం చేస్తారు। షట్చక్రాలు భేదిస్తారు। మరి బ్రహ్మరంధ్రం భేదించ్చి సహస్రదళంలో। జ్యోతి ప్రకాశం వున్నాది। ఆజ్యోతి లోమనుస్సు ప్రాణం అయిక్యం చేస్తారు । పరంతు తనస్వరూపం యరుకలేదు। దేహబుద్ధి పోలెదు। జీవతనం పోలెదు। వానికి స్వరూప ప్రాప్తి యట్లా అవుచుంది। ఆయోగి । జ్ఞాని సాధుసంగతి చేస్తె । ఆసాధు సహవాసం చాత సాధుముఖాంతరం చాత। శ్రవణం చేస్తె అజ్ఞాననివర్తి అయ్యి దేహబుద్ధి పోతుంది। జీవతనం పోతుంది। తనస్వరూపం కేవల చైతన్యం । ఆ చైతన్య స్వరూపంలో స్థూల సూక్ష్మ శరీర ద్వయంలేదు। షట్చక్రాలు లేవు। సహస్రదళంలేదు। మనస్సులేదు। ప్రాణాపానం లేదు। ఆ చైతన్య స్వరూపం చూస్తె దేహత్రయం మిథ్యా అవుచుంది। మరి నేను ప్రాణాపానం యోగంచేశినాను। అది యెమీపనికిరాదు। యిట్లాతన స్వరూపం తెలిశి యోగాభిమానం విడుస్తాడు। తనస్వరూపం తోటివుంటాడు। అవెళ్లనిరాభిమానదశ అవుతుంది। కొందరు జీవులు గీతాపారాయణం। చేస్తారు। కొందరు విష్ణు సహస్రనామాలు పారాయణం చేస్తారు। కొందరు మంత్రజపం చేస్తారు। కొందరు కావి బట్టలు చేసుకొని । జటాధారి సన్యాసులు అవుతున్నారు। కొందరు నల్లబట్టలు మహాత్ములు అవుతున్నారు। కొందరు లింగం గట్టి జంగాలు అవుతారు। కొందరు భైరాగులు అవుతారు। కొందరు ఫక్కీర్లు అవుతారు। కొందరు జోగులు అవుతారు। యీలాగున పృథివి మీదనానా విధ మతాలు వున్నావి। కొందరు కేవల సంసారం చేస్తారు। కొందరు రాజ్యం చేస్తారు। కొందరు వృత్తి మంతులు వున్నారు। కొందరు కృషి చేస్తారు। కొందరు చాకిరి చెసుకొని బ్రతుకుతారు। కొందరు శిఫాయిగిరి చేస్తా । యిటువంటిసకల జగత్తు తమతమ అభిమానం చాతవున్నారు । యీ సకల జగత్తు బ్రహ్మమేవున్నాది । యవ్వరికి తనస్వరూపం బ్రహ్మమేవున్నాది । అనితెలియదు । యవ్వరి మీద భగవత్కృప అవుచుంది । వారికి బ్రహ్మాత్మైక్య జ్ఞానం అయ్యాని । యెవ్వరికి బ్రహ్మాత్మైక్య జ్ఞానం అయిందోవారు యీ సకలజగత్తును బ్రహ్మమే చూస్తారు। యిదినిశ్చయం। ఇతి శ్రీజీవన్ముక్త కృత నిరాభిమాని దశా॥

౩౭ శ్రీ॥ బ్రహ్మప్రాప్తికి సులభోపాయం। స్వయం జ్యోతి స్వప్రకాశచైతన్యం చిదాకాశం। అదే ఆత్మస్వరూపం। ఆచిదాకాశంలో అహంస్ఫురణ అయింది । ఆ స్ఫురణ పేరు అంతః కరణ జీవుల యిద్దరి నుంచి సంకల్పం పుట్టింది । దాని పేరుమనుస్సు। ఆ మనుస్సు నుంచి యెరుకపుట్టింది । దాని పేరుబుద్ధి । ఆ బుద్ధినుంచివిషయానుసంధానం పుట్టింది । దని

పేరుచిత్తం । ఆచిత్తం నుంచి అహం తనం పుట్టింది । దాని పేరు అహంకారం। అంతఃకరణం నుంచి శబ్దం వినవలెనని యీలాగున వృత్తి పుట్టింది । దాని పేరు శ్రవణేంద్రియం। మనుస్సునుంచి స్పర్శం తీసుకొవలెనని వృత్తి పుట్టింది దాని పేరు త్వగింద్రియం। బుద్ధి నుంచి రూపంచూడవలెనని వృత్తి పుట్టింది। దానిపేరు చక్షురింద్రియం। చిత్తంనుంచ్చి రసం పుచ్చుకొనవలెనని యిట్లా వృత్తి పుట్టింది। దానిపేరు రసనేంద్రియం। అహంకారంనుంచి గంధం పుచ్చుకొనవలెనని యిట్లా వృత్తి పుట్టింది। దానిపేరు ఘ్రాణేంద్రియం । అంతఃకరణనుంచి శబ్దం పలుకవలెనని యీలాగున వృత్తి పుట్టింది । దానిపేరువాగింద్రియం। మనుస్సునుంచి శావ చెయ్యవలెనని యీలాగున వృత్తి పుట్టింది । దానిపేరు పాణేంద్రియం। బుద్ధినుంచి గమనం రాకడా పోకడా చెయ్యవలెనని వృత్తి పుట్టుచుంది । దానిపేరు పాదేంద్రియం । చిత్తం నుంచి మూత్రంచెయ్యవలెనని వృత్తి పుట్టుచుంది । దానిపేరు శిశ్నేంద్రియం। అహంకారం నుంచి మలవిర్జనం చాయవలెననివృత్తి పుట్టుచుంది । దానిపేరు గుదేంద్రియం। అంతః కరణనుంచి శబ్దం పుట్టింది। మనుస్సునుంచి స్పరిశం పుట్టింది। బుద్ధినుంచి రూపం పుట్టింది। చిత్తంనుంచి రసంపుట్టింది। అహంకారం నుంచి గంధం పుట్టింది। శబ్దం నుంచి ఆకాశం పుట్టింది । స్పర్శం నుంచి వాయువు పుట్టింది। రూపం నుంచి తేజంపుట్టింది। రసంనుంచి ఉదకం పుట్టింది। గంధం నుంచి పృధివి పుట్టింది। యీ ముప్పై తత్వాలకూ మూలం అంతః కరణ। రజోగుణం। మనుస్సునుంచి పుట్టింది। సత్వగుణం బుద్ధి నుంచి పుట్టింది। తమోగుణం అహంకారం నుంచి పుట్టింది। మహత్తత్వం మూల మాయ। అంతఃకరణపేరు। అంతః కరణయుక్తచైతన్యం జీవుడు వున్నాడు। యివి అన్నీ కూడా ముప్పై ఆరు తత్వాలు। యీ సర్వానకు మూలం అంతఃకరణం। అంతఃకరణ నుంచ్చి ముప్పై తత్వాలు పుట్టింది। దానిదిదేహద్వయం అయింది। పంచమహాభూతంది స్థూలదేహం। యిరువై అయిదు తత్వాలది। లింగదేహం। జీవుడు అంతఃకరణయుక్త మై దేహద్వయం నేనే అని జీవుని కియిట్లా అహంకారం అయింది। దానిపేరు తాదాత్మ్యధ్యానం। యిందుకోసానకు తన చైతన్య స్వరూపానకు। మరచిపోయినాడు । ఆ జీవుడు పుణ్యప్రతాపంచాత। భగవద్భక్తి భజనం చాత। సత్సహవాసంచాత। వానికిసద్భావన పుట్టింది । నాకు జన్మమరణంనుంచి విముక్తుడకావలెనని । బ్రహ్మప్రాప్తి అయితె మేలుఅని । యిట్లాగు ఆ జీవునికి బుద్ధి పుట్టింది। వాడు యేమిసాధన చాయవలెను। వివేకంచాత దేహద్వయంలో అహంకారంవున్నాది। అది త్యాగం చాయవలెను। అంతర్ముఖం కావలెను। సర్వానకుమూలం అంతఃకరణం అది వెనకకు విడచి పెట్టవలెను। తాను అంతర్ముఖం కావలెను। అయితె ఆ జీవాంశతనం పోతుంది। ఆజీవాంశతనం। స్వయంజ్యోతి। స్వయంప్రకాశ చైతన్యలోకలశిపోతుంది । ఆవేళ్లవానికి జన్మ మరణం లేదు। బ్రహ్మసాయుజ్యం అవుతుంది। యిది వొక్కఉపాయం । మరి వొక వుపాయంవున్నాది । అంతఃకరణస్వరూపోన్ముఖం చెయ్యవలెను । ఆవేళ్లవృత్తి చైతన్యంలో సమరసం అయ్యిపోతుంది। యిట్లా అయితె జీవతనం పోతుంది। తన స్వరూపం ప్రాప్తి అవుతుంది। యిది వొక్కవుపాయం। మరి వొక ఉపాయం।

నీలబిందులో జ్యోతివున్నాది। ఆ జ్యోతి అంతర్ముఖంచాయవలెను। స్వయం ప్రకాశంలో కలశిపోతుంది। ఆవేళ్లజీవతనం అనెదిపోతుంది। జీవతనం పోయి బ్రహ్మత్వం అవుతుంది। యిది వొక్కఉపాయం। సత్సహవాసంచాత శ్రవణ మనననిజధ్యానం చేస్తె అజ్ఞానం నిరసనం అవుచుంది। తన ఆత్మస్వరూపం తనకు కాన్పిస్తుంది। ఆ వేళ్ల నేనే అఖండైక రసం బ్రహ్మవున్నాను। అని జ్ఞానం అవుచుంది। యిది వొక్క వుపాయం। మరివొక వుపాయం। నవవిధసంబంధం చాత భగవద్భక్తి వుండెనా। భగవత్కృపచాత ఆత్మజ్ఞానం అవుచుంది। ఆత్మజ్ఞానం చాత మాయా అవిద్యా నిరసనం అయ్యి జీవెశ్వరభేదం పోతుంది । నేనుకేవల చైతన్య స్వరూపం వున్నాది అని యిట్లా స్వరూపప్రాప్తి అవుచుంది। యిదేబ్రహ్మప్రాప్తికి ఉపాయం। బ్రహ్మప్రాప్తికి నానా విధాల సాధనం। దానిచాత యెమీకాదు। యీలాగునవున్నాది। యిందుకోసానకు ఆత్మ విచారం చాయవలెను। దేహబుద్ధి విడచిపెట్టవలెను। అంతర్ముఖం కావలెను। చైతన్య స్వరూపంలోకలిశి పోవలెను । దాని చాత బ్రహ్మసాయుజ్యం అవుచుంది । యిధినిశ్చయం । శృతి । **"ఆత్మ బ్రంహ్మేతినిశ్చిత్య"** । సంశయంపట్టరాదు॥ ఇతి శ్రీజీవన్ముక్త కృత సులభోపాయవివరణ॥

**3లా** శ్రీ॥ కర్త అకర్త భోక్తవిచారం॥ తన ఆత్మస్వరూపం। స్వయంప్రకాశ చైతన్య ప్రకాశం వుండంగా। ఆ స్వరూప మెరుంగక దేహద్వయమెనేను అని జీవదశకువచ్చి। నేను కర్తను । నేను భోక్తను అంటాడు। అదియట్లాను। చైతన్యసత్తా చాత। మనుస్సు। యింద్రియాలు। ప్రాణాలు। దేహం। తన తన వ్యాపారంలో వర్తింస్తుంది। ఆచైతన్యం। తానువుండెదియర్గక। మనుస్సు యింద్రియకర్మాలకు। తానుకర్తనంటాడు। యిది వ్యర్థం। యట్లావ్యర్థం। పాంచభూతికశరీరం యే జాతిలో వుంటుందో ఆ జాతి అభిమానం పట్టుతాడూ। దేహమె నేను అని బ్రాహ్మణ వర్నదేహానకు। అదియరుంగక నేను బ్రాహ్మంణ్ని అంటాడు। బ్రాహ్మణ కర్మం శరీరానకు స్నానసంధ్యాది సకల కర్మలు మనుస్సు యింద్రియాల తోటి అవుతుంది। తన స్వరూపం యరుగక। నేను కర్తా అంటాడు। అదివ్యర్థం। ఆలాగె నేను భోక్తా అంటాడు। అదిన్నివ్యర్థం। తాను స్వయంప్రకాశ చైతన్యం వుండంగా। అదీయరుంగక। దేహద్వయానకు నేను అని। నేను భోక్త అంటాడు। దేహానకు సుఖదు:ఖబోగం అయితె। నాకు అయింది। అని అంటాడు। అ దిన్ని వ్యర్థం । యింద్రియాలు పంచవిషయాలు భోగిస్తావి। అది నేను భోగించినాను। అని అంటాడు। యిందుట్లో సుఖదుఃఖం అవుచుంది। అ దినాకు అయ్యింది అని అంటాడు । అ దివ్యర్థం। మనుస్సుకు హర్షవిషాదం అవుచుంది। కామ క్రోధాదికం అవుచుంది। అది తనకు అయ్యింది అని అంటాడు। యిదిన్నివ్యర్థం। బుద్ధికినానావిధయరుక అవుచుంది। అది నాకు అయింది అని అంటాడు। అది వ్యర్థం। చిత్తం చింతనం చేస్తుంది। అది తనకు అయింది అని అంటాడు। అదిన్ని వ్యర్థం। అహంకారం అహంమమత్వం। పట్టుచున్నాడు। అది తనకు అయింది అని అంచాడు। అదిన్ని వ్యర్థం। మనుస్సు ధర్మం జాగ్రత్స్వప్న సుషుప్తి మనుస్సుకు అవుచుంది। ఆవస్థలో సుఖందుఃఖం అవుచుంది అదితనకు అయింది అని అంటాడు। అది వ్యర్థం। తన

స్వరూపం కేవల చైతన్య స్వరూపం। స్వప్రకాశ మెరుంగక। నేను కర్త। నేను భోక్త అని అంటాడు। అది వ్యర్థం। యీలాగున శానావున్నావి। యిదీ అజ్ఞానం జీవుని మాట। యిఘ జ్ఞానాధికునిది ముచ్చట చెప్పు చున్నాను । జ్ఞాని స్వప్రకాశచైతన్యం। తానువున్నాను। అని యెరింగి దేహద్వయముది। అభిమానం విడుస్తున్నాడు। యిదియట్లాను। మనుస్సు యింద్రియాల దేహంలో కర్మం అవుచుంది। ఆచైతన్య సత్తాచాత అయ్యింది। ఆ చైతన్య స్వరూపం నేనువున్నాను। అని యెరింగి। కర్త తనంపోగొట్టి। అభిమానిగాక। యింద్రియాలు తమతమ విషయాలకు భోగిస్తువున్నావి। అది చైతన్య సత్తాచాత అవుచుంది। అని యెరింగి భోగాభిమానం విడుస్తున్నాడు। మనుస్సుకుహర్ష విషాదం అవుచుంది। కామక్రోధాదికం అవుచుంది। అది మనుస్సు ధర్మం। యిది చైతన్య సత్తా చాత అవుచుంది। యిందుకోసానకు। మనుస్సు ధర్మంకు అభిమానంపట్టడు। బుద్ధికినానావిధాల జ్ఞానం అవుచుంది। అది చైతన్య సత్తా చాత అవుచుంది। యిందుకోసానకు। జ్ఞానాభిమానం లేదు। చిత్తంనానాచింతన చెస్తుంది। ఆ చిత్తధర్మం। చైతన్య సత్తాచాత అవుచుంది। యిందు కోసానకు చిత్తాభిమానం పట్టడు। అహంకారధర్మం అహంమమత్వం। యిది యట్లాను। అహంమమత్వం నేను దేహంనాది దేహం నేను పుట్టినాను। నేను బ్రతికినాను। నేను చస్తాను। నాదిపదార్థం। నాది సభాదికులు। అనెది అహంమమత్వం। యిది జ్ఞానమాన్యునకు లేదు। జ్ఞానికేవల చైతన్య స్వరూపమె। అక్కడకర్మాలు యెమీ లేవు। యట్లా లెవంటెను। మనుస్సున్నుయింద్రియాలున్ను। ప్రాణాలున్ను। దేహమున్ను। ఆచైతన్యానకు యివ్వియెమీలేవు। యిందుకు అక్కడకర్మం లేదు। నిష్కర్మచైతన్యం తానువున్నాను। అనియీలాగున తెలశి। కర్త తనముది అభిమానం విడచినాడు। దీని పేరు అకర్తాత్మ బోధం। జ్ఞాని వున్నాది ॥శ్లో॥ **"అకర్తాహమ భోక్తాహమ సంగఃపరమేశ్వరః సదా । మత్సంన్నిధానేన చేష్టతె సర్వ ఇంద్రియం"॥** యీలాగు నయెరింగి కర్త తనముది అభిమానం విడచినాడు। అట్లాగె భోక్త తనముది అభిమానము పట్టడు। యట్లాను। కర్మము చొప్పుననె దేహం నిర్మాణం అయింది। ఆదేహానుకుసుఖం దు:ఖం కర్మం చొప్పున అవుచుంది। ఆ దేహసాక్షికి చైతన్యం నేనువున్నాను। నాకు దేహ సుఖదు:ఖభోగం లేదు। సుఖదుఃఖ భోగంతనకు అయిందీ అని యీలాగున అనిపిస్తుంది। పరంతు విచారంతోటిచూస్తె తనకు యెమీలేదు। యీలాగె యింద్రియభోగం తనకు యెమీలేదు। యట్లాలేదు। శ్రవణేంద్రియానకు శబ్దానకు భోగీస్తుంది। దానిది హర్షవిషాదం మనుస్సుకు అవుచుంది। అది తనకు అయ్యింది అనిఅనిపిస్తుంది। విచారం తోటిచూస్తె తనకు యెమీలేదు। త్వగింద్రియానకుస్పర్శభోగం। అది తనకు అనిపింస్తుంది తనకు యిది యెమీ లేదు। చక్షురింద్రియానకురూపభోగం। అది తనకు అనిపిస్తుందిఅది యెమీలేదు । జిహ్వేంద్రియానకు రసభోగం అవుచుంది। యిది నాకు అయింది అని అనిపిస్తుంది। అది యెమీలేదు। ఘ్రాణానకు గంధవిషయ భోగం। అవుచుంది। అదినాకు అనిపిస్తుంది। తానుకేవల చైతన్యం వుండంగా। అక్కడ పంచ జ్ఞానేంద్రియాలు దానివిపంచ విషయభోగాలు యెమీలేవు। యీలాగునయెరిగితె జ్ఞానికి భోగాభిమానం లేదు। వాక్కుశబ్దంపలుకుచుంది। నేను పలికినానని అనిపిస్తుంది ।

పాణిచాత చేస్తుంది । నేను చేశినానని అనిపిస్తుంది। పాదాలు రాకడపోకడ అనిపిస్తుంది। శిశ్నం మూత్ర చేశినానని అనిపిస్తుంది। గుదంచాత మలత్యాగం చేశినాను అనిపిస్తుంది: యీ అయిదుకర్మేంద్రియాలు। దానిదిఅయింది కర్మం విషయాలు। నేను చైతన్య స్వరూపంవున్నాను। నాకు యిదియెమీలేదు। యెమీ లెకుంటె యింద్రియకర్మం నాకు అయిందిఅనియందుకు అనిపిస్తుంది అంటె। అనాదినుంచి దేహేంద్రి యాధ్యాసం వుండంగా। అధ్యాసంచాత అనిపిస్తుంది। పరంత్తు నేను కేవల చైతన్యం వున్నాను। నాకు యెమీ లేదు। యీలాగున జ్ఞాని యెరుగుచున్నాడు। యిట్లాగె మనుస్సుధర్మం సంకల్ప వికల్పం । హర్షవిషాదం। కామక్రోధాదికం అది తనకు అయింది అని అనిపింస్తుంది। చిత్త ధర్మంచింత్తయిదినాకు అయింది అని అనిపిస్తుంది। అహంకారంది అహంమమత్వం। తనకు అయిందిఅని అనిపిస్తుంది। పరంతునేను కేవల చైతన్యంవున్నాను। నాకు మనోబుద్ధి చిత్తా హంకారములు లేవు। దానిది ధర్మంనాకు లేదు। ప్రాణందిక్షుధాతృష్ణా ధర్మం యిదిఅన్నంతోటితృప్తి। వుదకం తోటి తృషాహరణం। అవుచుంది। యిది ప్రాణ ధర్మం। తనకు అయింది అని అనిపిస్తుంది। క్షుధానకు అయ్యింది। తృషానకు అయింది। నేను భోజనం చేశినాను। నేను వుదకం తాగినాను। యీలాగున అనిపిస్తుంది। యిది అంతానుప్రాణధర్మం । యివ్విఅన్నీతనకు యెమీ లేవు। తాను కేవల చైతన్యం వున్నాను। అక్కడ ప్రాణాలు లేవు। మరి యెందుకు అనిపిస్తుంది। అనాది అధ్యాసంచాత అనిపిస్తుంది। పరంతు తనకుయిది యెమీలేదూ। అన్నాదికం స్థూల భోగం। సుఖందుఃఖం। ప్రవివిక్తభోగం। సుషుప్తిలో ఆనంద భోగం। యిదితనకు యెమీలేదు। తాను యీ మూడు అవస్థలకు అతీతం యిందు కోసానకు। అవస్థాభోగంతనకు లేదు। తానునిరావస్థా చైతన్యం వున్నాను। యిట్లా జ్ఞాని యెరింగి భోగాభిమానం విడుస్తాడు। తన స్వరూపం అభోక్తఉన్నాడు। యీభోక్త తనం అనిపిస్తుంది। అనాది అధ్యాసం। చాత అనిపిస్తుంది। యిందు కోసానకు స్వరూపనిజధ్యానం చెయ్యు బడుతుంది। యిట్లాయిట్లానుచెయ్యవలెను। నేను పాంచభూతికశరీరంకాదు। ఆదేహానకు సాక్షి స్వరూపం నేను। వున్నాను। దశయింద్రియాలు నేనుగాను। ఆదశయింద్రియాలకు సాక్షిస్వరూపం నేనువున్నాను। పంచ విషయాలునా కులేవు। పంచవిషయాలకు సాక్షిస్వరూపం నేను వున్నాను। పంచప్రాణాలు నాకు లేవు। పంచప్రాణాలకు సాక్షి స్వరూపంనేను వున్నాను। అంతఃకరణలు నాకులేవు। అంతఃకరణ పంచ్చకానకు సాక్షి స్వరూపం నేనువున్నాను। జ్ఞానం నేనుగాను। అజ్ఞానానకు సాక్షి స్వరూపం నేనువున్నాను। కేవల చైతన్య స్వరూపం నేను వున్నాను। చైతన్య స్వరూపం యిట్లా వున్నాది। సచ్చిదానందం। అద్వయం। అఖండైకరసం। బ్రహ్మం। **"ఏకమేవాద్వితియ్యంబ్రంహ్మచైతన్యం"** । నిర్వికారం। నిరాకారం। నిరాభాసం। నిరంజనం। నిష్కర్మం। స్వయం ప్రకాశం। తనకు తానేవున్నాది। ఆచైతన్యంలో అవిద్యలేదు। జీవతనంలేదు। మాయలేదు। ఈశ్వరతనంలేదు। ఆ చైతన్యం పరిపూర్ణం వున్నాది। అదె నేను వున్నాను। దీని పేరునిజధ్యాసం। యీనిజధ్యాసంచాయంగా చాయంగా । దేహాధ్యాసం పోతుంది। యిందుకోసానకు అగత్యం నిజధ్యాసం చెయ్యవలెను। నాకు జ్ఞానం అయింది।

యీనిజధ్యానం యేమి। అని అంటెను। దేహాధ్యానం యట్లాను పొయ్యాని। పోదు। యిందుకోసానకు స్వరూపనిజధ్యానం। అగత్యంచాయవలెను। ఆనిజధ్యానంలో వృత్తి తనంతానెలయం అవుచుంది। దృష్టాంతరం। కాష్ఠాంతకారి అయితె అగ్ని తన స్వరూపంలోలయం అవుచుంది। అంత ఉపాధిధ్యానం పోతె । ఆనిజధ్యానంవృత్తి తనకు తానె స్వరూపంలోలయం అవుచుంది। ఆవేళ్లకేవల చైతన్య మాత్రం మిగులుచుంది। అస్థితి తోటిజ్ఞాని వుంచున్నాడు। యిదినిశ్చయం॥ "బ్రహ్మవిద్బ్రహ్మణ స్థితః" । యిది భగవద్వచనం। నిశ్చయం। ఇతి శ్రీ జీవన్ముక్త కృతకర్త అకర్త భోక్త అభోక్త వివరణం ॥ ॥

౩౯ శ్రీ॥ దేశకాలవస్తుపరిఛెదశూన్యచైతన్యంఅంటెను యెమి। దేశకాలవస్తు భేదం చైతన్యానకు లేదు అంటెనుయెమి । దేశంఅంట్టెను సకలజగత్తు । సకలజగత్తు నానావిధాలభేదాల తోటి వున్నాది। సకల జగత్తు మాయామయం। మిథ్యా। యిందు కోసానకు। దేశభేదం చైతన్యానకు లేదు। కాల భేదం చైతన్యానకు లేదు। కాలభేదం అంటెనుయెమి। భూతకాలం। వర్తమానకాలం। భవిష్యత్కాలం। భూతకాలం అంటెను వెనకకుపోయినది। వర్తమానకాలం అంటెను। సంధ్యావున్నాది। భవిష్యత్కాలమంటె ముందర అయ్యేది। యీ త్రివిధకాలం చైతన్యానకులేదు। జగత్తులేక తత్పూర్వం చైతన్యంవున్నాది। జగత్తు అయ్యిపోయింది చైతన్యం యట్లావున్నాదో। అట్లా గెవున్నాది। జగత్తు నిర్మాణం అయితె। దీనిపేరువర్తమానకాలం। అకాలం చైతన్యం యట్లావున్నాదో అట్లాగెవున్నాది యీజగత్తుకు ప్రళయం అయ్యిముందల తిరిగీనిర్మాణం అవుచుంది। దానిపేరు భవిష్కత్కాలం। ఆభవిష్యత్కాలంలో చైతన్యంయట్లా వున్నాదో అట్లాగెవున్నాది । యిందు కోసానకు భూతభవిష్యద్వర్తమానకాలం జగత్తు చైతన్యానకు యీ త్రికాలాలు లేవు। ఆ చైతన్యంసదా సార్వకాలం యట్లావున్నాదో అట్లాగెవున్నాది। ఆ చైతన్యానకు। వస్తు భేదం లేదు। వస్తువు అంటెను యెమి। నానావిధపదార్థభేదం। పదార్థభేదం అంటెను యెమి। మాయా విస్తారం ముప్పైయ్యారు తత్వాలు। వొక్కొక్క తత్వంలో అనేక భేదంవున్నాది। దాని పేరుపదార్థభేదం। జీవునిది నాల్గు దేహాలు। ఈశ్వరుని నాల్గుదేహాలు। జీవ ఈశ్వర నాల్గుదేహాలు। జీవేశ్వర నానావిధధర్మాలు యీ అన్నిటికి పదార్థభేదం అనవలెను। పదార్థమునకు వస్తుభేదం। అనవలెను। యీ చైతన్యానకు యెమీలేదు। యిందుకోసానకు దేశకాలవస్తు పరిచ్ఛేద శూన్యం చైతన్యానకు అనవలెను। ఆ చైతన్యం అఖండైకరసం। పరిపూర్ణంవున్నాడు । అదేతాను। ఇతి శ్రీ జీవన్ముక్త కృత దేశకాలవస్తు పరిచ్ఛేద శూన్య వివరణం॥

౪౦ పంచవిధభేదాలు ॥శ్రీ॥ చైతన్యం అధిష్ఠానం అనవలెను। అధిష్ఠాన ఆశ్రయించాత వివర్త భేదం అయింది। దానికి ఆరోపం అనవలెను। ఆవివర్తాభాసంమాయామయం। దానిలో అయిదు భేదాలు వున్నావి। యాట్లాను। ముందు చైతన్య స్వరూపంలో అహంబ్రహ్మం యీలాగు నస్ఫురణం అయ్యేది । దానిపేరు మాయా । అమాయాయుక్త చైతన్యానకు ఈశ్వరుడు అన వలెను। అమాయాతీత చైతన్యానకు బ్రహ్మం అనవలెను। యిదేబ్రహ్మఈశ్వర భేదం వొక్కటి।

ఆమాయాయుక్తం ఈశ్వరుడు అనవలెను। ఆమాయాయుక్త ఈశ్వరుడు। సృష్టి నిర్మాణం కావలెనని యీలాగునయిచ్ఛచేశినాడు। దాని కోసానకు ముప్పై యారు తత్వాలు నిర్మాణం చేశినాడు। పంచమహాభూతంది పంచీకరణం చేశినాడు। దానిది జగత్తు రచన చేశినాడు। ఆ జగత్తు శరీరంలో జీవరూపం చాత ప్రవేశించినాడు। ఆ జీవుడు దేహబుద్ధి చాత వున్నాడు। యీశ్వరుడు తన స్వరూపం తోటివున్నాడు। యిదే జీవెశ్వర భేదం వొక్కటి। జీవభేదంలో అనేక జీవాలు వున్నావి। అదివొక్కబేదం॥ జగత్తులో స్థావరంవేరె। జంగమం వేరె। స్థావరం అంటెను యేమి। వృక్ష పాషాణ తృణం। దాని పేరు స్థావరం। మనుష్య దేహం ఆది చేశి కీటక పర్యంతం నడుస్తూ వుండెటి పేరు జగమం। యీస్థావరం। జంగమంభేదం వొక్కటి । జంగమంజంగమంలో భేదం వున్నాది అదియట్లాను। శరీరాలు భిన్నం। భిన్నంవున్నావి। యిది వొక్క భేదం। యిదే అయిదు భెదాలు। బ్రంహ్మ ఈశ్వర భేదం వొక్కటి। జీవేశ్వర భేదం వొక్కటి। జీవుని కీ జీవునికీ భేదం వొక్కటి। స్థావరజంగమంలో భేదం వొక్కటి। జంగమజంగమంలో భేదం వొక్కటి। యిది అయిదు భెదాలు వొక్కటి యీ అయిదు భేదాలు మాయా మయం। మిథ్య। చైతన్యం అఖండైకరసం। పరిపూర్ణంవున్నాది। యీలాగున తెలియవలెను। యిదినిశ్చయం॥

౪౧ శ్రీ॥అన్వయవ్యతిరేకందిఅర్థం॥ అన్వయం అంటెను యెమీ। వ్యతిరేకం అంటెను యెమీ। అన్వయం అంటెను సచ్చిదానంద పరబ్రహ్మంనుంచిస్ఫురణం అయిందిఆస్ఫురణం బ్రహ్మస్ఫురణం। దానికి మాయా అంటారు। అది బ్రహ్మనుంచి అయ్యింది। అది బ్రంహ్మస్ఫురణం। దానికి మాయా అంటారు। అది బ్రహ్మనుంచి అయ్యింది। అది బ్రహ్మమె। ఆమాయాయుక్తం బ్రహ్మపేరు ఈశ్వరుడు। అది బ్రహ్మమె। ఆమాయా యీశ్వరున్నుంచి మహత్తత్వం పుట్టింది। అది బ్రహ్మమే। ఆమహత్తత్వం నుంచి త్రిగుణం పుట్టింది। అది బ్రహ్మమే। త్రిగుణం నుంచి ముప్పై తత్వాలు అయింది। అది బ్రహ్మమే। ముప్పై తత్వాలది సకల జగత్తు అయింది। అది బ్రహ్మమే। సకల జగత్తులో జీవాలు వున్నావి। అవ్వి బ్రహ్మమే। యిందు కోసానకు బ్రహ్మాది పిపీలికాపర్యంతరం సకల జగత్తు బ్రహ్మమే వున్నాది। దానికి సాక్షిశృతి వాక్యం **"బ్రహ్మైవేదం సర్వం। ఆత్మైవేదం। సర్వం ఖల్విదం బ్రంహ్మ"** ॥ యిది అన్వయార్థం॥ వ్యతిరేకం యెమి అంటెను। సర్వాతీతం చైతన్యం । అది యట్లాను । సర్వాతీతం । పృథివి । ఆపం । తేజ। వాయు । ఆకాశం। యివిపంచమహాభూతాలు । జడం । దీనిది ప్రకాశకుడు బ్రహ్మం । అదే పంచమహా భూతాలకు అతీతం । శబ్దం । స్పర్శ । రూపం । రసం । గంధం । యిది పంచవిషయాలు। జడం । దీనికి ప్రకాశకుడు బ్రహ్మం । పంచవిషయాలకు అతీతం । శ్రోత్రం। త్వక్కు। చక్షు। జిహ్వా। ఘ్రాణం। అదేపంచజ్ఞాన యింద్రియాలు। దీనికి ప్రకాశకుడు బ్రహ్మం। జ్ఞానేంద్రియాలకు అతీతం । వాక్కు పాణిపాద శిశ్నగుదం। యిదిపంచకర్మేంద్రియాలు। దీనికి ప్రకాశకుడు బ్రహ్మం। కర్మేంద్రియాలకు అతీతం। వ్యాన సమానఉదాన ప్రాణ అపాన। యిది పంచప్రాణాలు। దీనికి ప్రకాశకుడు బ్రహ్మం। ప్రాణాలకు అతీతం। అంతఃకరణ మనబుద్ధి చిత్తం అహంకారం ।

యిదేఅంతఃకరణ పంచకం। దీని ప్రకాశకుడు బ్రహ్మం అంతఃకరణ పంచకానకు అతీతం। సత్వరజతమంత్రిగుణం దీనిదిప్రకాశకుడు బ్రహ్మం। త్రిగుణాలకు అతీతం। మహత్తత్వరూపం అవ్యాకృతమాయా । దీనిది ప్రకాశకుడు బ్రహ్మం। మహత్తత్వం నుంచి అతీతం। బ్రహ్మం। స్ఫురణం అయింది మూలమాయ। దీనిది ప్రకాశకుడు బ్రహ్మం। ఆమూల మాయానుంచి అతీతం దీని పేరునర్వాతీతం। అతీతం వ్యతిరేకం। అషువంటి వ్యతిరేక బ్రహ్మం। సచ్చిదానందస్వరూపం। పూర్ణం। మాయా ఆది జేశిపృథివిపర్యంతరం సకల తత్వాలు మాయా మయం। మిథ్య । దీనిపేరువ్యతిరేక జ్ఞానం। పధ్నాలుగు భువనాలు కూడా బ్రహ్మాండం పాంచ్చభూతికం। ఉత్పత్తి అవస్థా। బ్రహ్మదేవుడు అభిమాని। యీమూటికీ ప్రకాశకుడు సాక్షి ఈశ్వరుడు। యీ మూటికీ అతీతం। హిరణ్యగర్భం దేవతామయశరీరం। స్థితి అవస్థ। విష్ణు అభిమాని। యీ మూటికీ ప్రకాశకుడు సాక్షి ఈశ్వరుడు। యీ మూటికీ అతీతం। మహత్తత్వం కారణ శరీరం। ప్రళయ అవస్థ। రుద్రుడు అభిమాని। యీ మూటికి సాక్షి ప్రకాశకుడు। ఈశ్వరుడు। యీ మూటికీ అతీతం। మూలమాయామహాకారణ శరీరం। సర్వసాక్షిణి అవస్థా। యీశ్వరుడు అభిమాని। యీమూటికీ సాక్షి ప్రకాశకుడు। యీశ్వరుడు। యీమూడూ ఈశ్వరుడు గాడు। యిదేనాల్గు దేహాలకూ అతీతం। ఈశ్వరస్వరూపం। సచ్చిదానందబ్రహ్మమే। దీని పేరు వ్యతిరేకం। పాంచభూతికం జీవునిది। స్థూల శరీరం। జాగ్రత అవస్థ। విశ్వాభిమాని। యీమూటికీ సాక్షి ప్రకాశకుడు జీవుడు యీమూటికీ అతీతం। యిరువై అయిదు తత్వములది లింగ శరీరం। స్వప్న అవస్థ । తైజసుడు అభిమాని। యీ మూటికీ సాక్షి ప్రకాశకుడు జీవుడు యీ మూటికీ అతీతం। అజ్ఞానంకారణ శరీరం। సుషుప్తి అవస్థ। ప్రాజ్ఞుడు అభిమాని। యీమూటికి సాక్షి ప్రకాశకుడు జీవుడు యీ మూటికీ అతీతం। జ్ఞానం మహాకారణ శరీరం। తుర్య అవస్థ। ప్రత్యగాత్మ అభిమాని। యీమూటికీ సాక్షి ప్రకాశకుడు జీవుడు యీ మూటికీ అతీతం। జీవస్వరూపం। సచ్చిదానందబ్రహ్మమే। యిదే జీవఈశ్వర బ్రహ్మం। యీ మూడూకూడా వొక్క బ్రహ్మమే। ఆబ్రహ్మ స్వరూపంలో మూడు స్థానాలూ లేవు। యిందు కోసానకు అఖండైకరసంబ్రహ్మం। పరబ్రహ్మకు। అనవలెను। మాయావిద్యాజీవఈశ్వరసకల జగత్తు యిదిమాయామయం। మిథ్య। సచ్చిదానంద బ్రహ్మం। అఖండైకరసం। పరి పూర్ణం। అదే సత్యం। దీనిపేరు వ్యతిరేక జ్ఞానం। యీ వ్యతిరేకం అన్వయం। పరబ్రహ్మలోలేదు। తనకు తానే వున్నాది। యిది నిశ్చయం। **"ఏకమేవాద్వితియ్యం బ్రహ్మనేహ నానాస్తి కించన"** । ఇతి శృతి । యిదినిశ్చయం। ఇతి శ్రీ జీవన్ముక్త కృత అన్వయ వ్యతిరేక వివరణ ॥శ్రీ॥

౪౨ శ్రీ॥ సంసర్గవాక్యార్థ। విశిష్ట వాక్యార్థ అఖండ వాక్యార్థాలు॥ అది యట్లాగున। సంసర్గ వాక్యార్థం। త్వంపదకాడ । విశిష్టవాక్యార్థం తత్పదంకాడ। అఖండ వాక్యార్థం అసిపదంకాడ। సంసర్గవాక్యార్థం అంటెనుయేమి। త్వంపదం జీవుడు। ఆ జీవునిది స్వరూపంకేవల చైతన్యం। వుండంగా అహం తనముది సంగమం అయింది। దాని పేరుసంసర్గం। యట్లా సంగమం

అయింది। జీవునికి తన స్వరూప జ్ఞానం లేదు। దాని పేరు అజ్ఞానం । ఆ అజ్ఞానం చాత స్థూల సూక్ష్మ దేహద్వయానకు అహంఅంటాడు। యిది అవిద్యాయుక్తం। సంసర్గం జీవునికి తగిలింది। యేవేళ్ల జీవుడు విరక్తుడు అయ్యినాడు। గురువుకు శరణుపోయినాడు। గురువు ఆత్మబోధ చేశినాడు। అప్పుడె అజ్ఞానం నిరసనం అయింది। ఆవేళ్లదేహద్వయం అనేది అహంతనం పాయను। దేహత్రయా తీతం నేను చైతన్య స్వరూపం వున్నాను। అహం తనం యట్లా అహంబ్రహ్మాస్మితాను అనాది సిద్ధ కేవల చైతన్యంవుండంగా। అహంబ్రహ్మాస్మియీ వాక్యంలో అహంతనం వున్నాది। దానిపేరు సంసంర్గం। నేను బ్రహ్మనువున్నాను। యిది అహంతనం అనేది లయంఅయితె యెమీ సంసర్గం లేదు। దీని పేరు సంసర్గవాక్యార్థం। విశిష్ట వాక్యార్థం అంటెనుయేమి। తత్పద ఈశ్వరుడు। వానికి విశిష్టం యందుకోసం అనవలెను। ఆయీశ్వరుడు। సర్వసాక్షి సర్వ వ్యాపక సర్వప్రకాశక। సర్వజగానకు ఉత్పత్తి స్థితి ప్రళయ కర్త। పరంత్తు నేనుకర్తా అనేది అహంతనంలేదు। ఆయీశ్వరుడు జ్ఞాని । తన స్వరూపం కేవలచైతన్యం వున్నాది। యీలాగున యెరుగు చున్నాడు। నామరూపాత్మక జగదాభాసం మిథ్యా। వున్నాది। మాయాతనం చాత నాకు ఈశ్వర తనంవచ్చింది। అదిమిథ్య। నేనుకెవల చైతన్యం వున్నాను। యిందు కోసానకు ఆతత్పద ఈశ్వరునికి। విశిష్టం అనవలెను। యిది విశిష్టవాక్యార్థం। యిదినిశ్చయం॥ ॥ అఖండవాక్యార్థం అంటెనుయేమి। కేవలచైతన్యం। ఆకేవల చైతన్యంకాడ మాయలేదు। అవిద్యలేదు। ఆ మాయా। అవిద్యలో ప్రతి బింబించినాడు। ఆ ప్రతిబింబం పేరు ఈశ్వరజీవులు। ఆజీవుడు కించజ్ఞుడు। యీశ్వరుడు సర్వజ్ఞుడు। యీలాగున జీవుడు। ఈశ్వరుడు ద్వైతాభాసం అయింది। దానిపేరు ఖండం। యీఖండం చైతన్యంలో లేదు। యట్లాలేదు। మాయా అవిద్యా రెండూ చైతన్య స్వరూపంలో లేదు। యిందు కోసానకు ఆచైతన్యంలో జీవేశ్వర భేదంలేదు। దాని పేరు అఖండైకరసం। ఏకార్ణవలంవలెను। తనకుతానేపరిపూర్ణం వున్నాడు। దాని పేరు అఖండ వాక్యార్థంలో లేదు। అఖండైకరసం బ్రహ్మ। సచ్చిదానందమద్వయం। **"ఏకమేవా ద్వితీయ్యం బ్రహ్మా। నెహనానాస్తికించనా"** ఇతి శృతి। యిట్లా సంసర్గ వాక్యార్థం విశిష్ట వాక్యార్థం। అఖండ వాక్యార్థం। యీమూటి అర్థం యిదినిశ్చయం॥ ఇతిశ్రీ జీవన్ముక్తకృత సంసర్గ వాక్యార్థ అఖండ వాక్యార్థ వివరణ ॥ ॥

౪౩ శ్రీ॥ ద్వైతం। అద్వైతం ద్వైతాద్వైతా తీతం। ద్వైతం అంటెనుయేమి। అద్వైతం అంటెనుయేమి । ద్వైతాద్వైతాతీతం అంటెనుయేమి। ద్వైతం అంటెను। కేవల చైతన్యం నుంచి అహంబ్రహ్మం స్ఫురణం అయ్యింది । దాని పేరు మాయా ఆ మాయలో చైతన్యం ఆభాసం అయ్యింది। దానిపేరు ఈశ్వరుడు। ఆ మాయనుంచి అవిద్యా నిర్మాణం అయ్యింది। ఆ అవిద్యలో చైతన్యం ఆభాసం అయ్యింది। దాని పేరు జీవుడు। ఆ జీవుడు అవస్థాత్రయానకూ సాక్షి। యిందు కోసానకు। కించజ్ఞుడు అనవలెను। ఈశ్వరుడు సర్వజీవాలకు అంతర్యామి అయ్యి। సర్వానకూయెరుగు చున్నాడు। యింద్దు కోసానకు సర్వజ్ఞుడు అనవలెను। ఆ

ఈశ్వరోపాధిమాయా। జీవుఉపాధి అవిద్య యిందుకోసానకు । జీవుడు వేరె । ఈశ్వరుడు వేరె । దానుపేరు ద్వైతం । జీవునిదిఅవిద్య। ఈశ్వరునిది మాయ। యీరెండు త్యాగం చేస్తె జీవేశ్వర ద్వైతం పాయను। జీవునిది స్వరూపం ఈశ్వరునిది స్వరూపం యేక చైతన్యం। యిది యట్లాను। జీవస్వరూపంప్రత్యక్‌చైతన్యం। ఈశ్వరునిది స్వరూపం పూర్ణ చైతన్యం । యీరెండు స్వరూపాలు అయిక్యం వున్నాది। దానిపేరు అద్వైతం। కేవల చైతన్యలో మాయాఅవిద్యాలేదు। జీవ ఈశ్వరులూ లేరు। దానిది అయిక్యమూ లేదు। ఆ కేవల చైతన్యం ద్వైతాద్వైతాతీతం। పరిపూర్ణం వున్నాది। యిది నిశ్చయం॥ఇతీ శ్రీ జీవన్ముక్తకృత ద్వైతాద్వైత ద్వైతా ద్వైతా తీతం వివరణ ॥

శ్రీ॥ సాక్షిత్వ సర్వసాక్షిత్వ విచారం॥సాక్షిత్వం జీవస్వరూపంలోవస్తుంది। సర్వసాక్షిత్వం ఈశ్వర స్వరూపంలోవస్తుంది। జీవుడు తనసాక్షిస్వరూపం మరచినాడు। యిందు కోసానకు సాక్షి విచారం చెయ్యవలెను। సర్వదృశ్యానకూనేను అతీతం వున్నాను। యీ జ్ఞానం అయితె సాక్షి స్వరూపం తెలుస్తుంది। ఆసాక్షిత్వం యట్లావున్నాది। తన స్వరూపం కేవల చైతన్యం। చిదాకాశంవున్నాది। ఆచిదాకాశంనుంచిస్ఫురణం అయ్యింది। దాని పేరు అంతఃకరణ। ఆ అంతః కరణ నుంచి మనుస్సు పుట్టింది। మనుస్సు ధర్మం సంకల్పవికల్పం। ఆమనుస్సుకు సాక్షితాను। తాను మనుస్సుకాదు। మనుస్సునుంచి బుద్ధి పుట్టింది। బుద్ధి ధర్మం యరుక। బుద్ధికి సాక్షి ప్రకాశకుడు తాను। తాను బుద్ధి కాదు। బుద్ధినుంచి చిత్తపుట్టింది। చిత్తం ధర్మం అనుసంధానం। ఆచిత్తానకు సాక్షి ప్రకాశకుడుతాను। తాను చిత్తముకాను। చిత్తంనుంచ్చి అహంకారంపుట్టింది। అహంకార ధర్మం। అహం మమత్వం। అహంకారసాక్షి ప్రకాశకుడు తాను। తాను అహంకారముకాను। యీ అంతఃకరణ పంచకంనుంచి పంచజ్ఞానయింద్రియాలు పుట్టింది। శ్రోత్రం। శ్రోత్ర ధర్మం వినేది। ఆశ్రోత్రందిసాక్షి ప్రకాశకుడు తాను। తాను శ్రోత్రంకాను। త్వక్కుదిస్పర్శధర్మం। ఆత్వక్కు సాక్షిప్రకాశకుడు తాను త్వక్కునుకాను। చక్షుధర్మంచూచేది। ఆ చక్షుకు ప్రకాశకుడు। సాక్షితాను। తాను చక్షునుకాను। జిహ్వా। జిహ్వాధర్మంరసం పుచ్చుకునెది। ఆజిహ్వాప్రకాశక సాక్షితాను। తాను జిహ్వాకాను। ఘ్రాణం। ఘ్రాణధర్మంపరిమెళంపుచ్చుకునెది। ఆ ఘ్రాణముకు సాక్షి ప్రకాశకుడు తాను। తాను ఘ్రాణంకాను। వాక్కుపలికెది వాక్కు ధర్మం। ఆవాక్కు ప్రకాశక సాక్షితాను తాను వాక్కుగాను। పాణిధర్మం యిచ్చెది పుచ్చు కొనెది। ఆపాణి ప్రకాశకసాక్షితాను। తాను పాణికాదు। పాదం। నడిచేది పాదధర్మం। ఆపాద ప్రకాశక సాక్షితాను। తాను పాదంకాను। శిశ్నం। మూత్రం చేశెది। శిశ్న ధర్మం। ఆశిశ్న ప్రకాశకసాక్షితాను। తాను శిశ్నంకాదు। గుదం। మలవిసర్జన చేశెదిగుద ధర్మం। ఆగుదప్రకాశకసాక్షితాను। తానుగుదము కాదు। వ్యానసమాన వుదాన ప్రాణ అపానం। ఆపంచ్చ ప్రాణానకు సాక్షి ప్రకాశకుడు తాను। తానుపంచ్చ ప్రాణంకాను। ప్రాణధర్మం క్షుధాతృష్ణాదికం। దానిది సాక్షిప్రకాశకుడు తాను। తాను ప్రాణ ధర్మంకాదు। శబ్దంస్పర్శరూపంరసం గంధం। పంచ విషయానకు సాక్షి ప్రకాశకుడు తాను। తాను పంచవిషయాలు కాను। తాను పాంచభూతిక శరీరంకాదు। శరీరధర్మం షడ్వికారం।

అదితాను కాదు। ఆ శరీరం  శరీరధర్మం। దానికి సాక్షి ప్రకాశకుడు తాను। తాను శరీరం। శరీరధర్మంకాను। శరీరంకునామంరూపం వర్ణం ఆశ్రమం కర్మం ధర్మం జాతి గోత్రంకులం। శాఖా। యివ్వి అన్నీ శరీరానకు। తనకు లేదు। వైదీకి। వ్యాపారి। గోసావి। బ్రహ్మచారి। సన్యాశి। యివ్వి అన్నీ శరీరానకు। తనకుయివియేమీ లేదు। జాగృతి అవస్థ। నేత్రద్వారం చాత। విశ్వాభిమాని చూస్తాడు। ఆ జాగృతి। విశ్వాభిమాని। దానికి ప్రకాశక సాక్షితాను। తాను యివ్విగాను। సప్నావస్థ। కంఠంలో అవుచుంది। తైజసఅభిమాని స్వప్నం చూస్తాడు। స్వప్నం తైజసఅభిమాని। దానికి సాక్షి ప్రకాశకుడు తాను। తాను యివ్విగాను। సుషుప్తి అవస్థా హృదయస్థానంలో అవుచుంది। సుషుప్తి అవస్థ చూచెటివాడు। ప్రాజ్ఞ అభిమాని। సుషుప్తి అవస్థాప్రాజ్ఞ అభిమాని। దానిది సాక్షి ప్రకాశకుడు తాను। యిదిగాను। యీలాగున దేహత్రయానకు। అవస్థాత్రయానకు। అభిమాని త్రయానకు। తాను ప్రకాశకుడు। సాక్షి। దేహత్రయంతాను కాదు। తన స్వరూపం సచ్చిదానందం। బ్రహ్మం।  నిర్గుణం। నిరాకారం। నిర్వికారం। నిరాభానం స్వయం ప్రకాశ చైతన్యం। యిది తన స్వరూపం। యీలాగున వుండంగా। తన స్వరూపం సర్వానకూ ప్రకాశకుడు। సర్వానకు సాక్షి। సర్వాతీతంవుండంగా। అస్వరూపం మరచిపోయి నాడు। ఆమరుపు పేరు అజ్ఞానం। అజ్ఞానంచాత అన్యధా జ్ఞానం పుట్టింది। అన్యధా జ్ఞానం చాత దేహమెనేను అని యిట్లా అభిమానం పట్టివున్నాడు। అది వ్యర్థం। తన సాక్షి స్వరూపం యెరిగి ఆ స్వరూపంలో తన వృత్తి పరమంచేస్తె అదృశ్యసాక్షి స్వరూపంలో లయం అవుచుంది। నేను కేవల చైతన్యం వున్నాను। ఈశ్వరరూప సాక్షి తనకు తురియ్యం అనవలెను। ఆతుర్యస్వరూపంలో లయం అయితె। ఆవేళ్లకేవల స్వరూప స్థితి। మాత్రం పుట్టుతుంది। యీలాగున జ్ఞానికి అయ్యింది। వున్మనిఅనవలెను। దీనికి ప్రమాణం। శృతి। **"సమస్త సాక్షీసదసద్వీహీనం"** । యిదినిశ్చయం॥ సర్వసాక్షిత్వం ఈశ్వర స్వరూపంలో వున్నాది। సర్వసాక్షి అంటె యేమి। పాంచ్చభౌతికంచతుర్దశభువనాలు। దానిపేరు సకల జగత్తు । సకల జగత్తుకూ బ్రహ్మాండం। విరాట్పురుషుడు అనవలెను। యీ సర్వానకు సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। వాడు పాంచభూతిక బ్రహ్మాండంకాడు। బ్రహ్మాండంలో ఉత్పత్తి అవస్థఅవుచుంది। ఆ ఉత్పత్తి ప్రకాశక సాక్షి ఈశ్వరుడు వున్నాడు। యిందు కోసానకు। ఉత్పత్తి ఈశ్వరుడు కాడు। ఉత్పత్తి చేసెటివాడు బ్రహ్మదేవుడు । బ్రహ్మదేవుడు। ఆ బ్రహ్మదేవునికి సాక్షి స్వరూపం ఈశ్వరుడు। యిందు కోసానకు బ్రహ్మదేవుడు ఈశ్వరుడు కాడు। హిరణ్యగర్భదేహం ఈశ్వరుడు కాడు। యట్లాకాడు। అంతఃకరణం విష్ణు । ఆ విష్ణు ప్రకాశకసాక్షి ఈశ్వరుడు। ఆవిష్ణు ఈశ్వరుడు కాడు। మనస్సుచంద్రూడు। ఆ చంద్రప్రకాశకసాక్షి ఈశ్వరుడు । ఈశ్వరుడు చంద్రూడు కాడు। బుద్ధికి బ్రహ్మదేవుడు। బ్రహ్మదేవప్రకాశక సాక్షి ఈశ్వరుడు। బ్రహ్మదేవుడు ఈశ్వరుడు కాడు। చిత్తంనారాయణం। ఆ నారాయణప్రకాశక సాక్షి ఈశ్వరుడు। యీ ఈశ్వరుడు నారాయణుడు గాడు। అహంకారం శంకరుడు। ఆ శంకరసాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। ఆ ఈశ్వరుడు శంకరుడుగాడు। దిశాదైవతం శ్రోత్రం। ఆదిశాదైవత ప్రకాశక సాక్షి ఈశ్వరుడు। ఆ ఈశ్వరుడుదిశాదైవతంగాడు। త్వక్కుకు వాయువు। వాయు ప్రకాశక సాక్షి ఈశ్వరుడు। వాయువు

ఈశ్వరుడుగాడు। చక్షుస్సుకుసూర్యుడు। ఆసూర్యప్రకాశకసాక్షి ఈశ్వరుడు। సూర్యుడు ఈశ్వరుడుగాడూ। జిహ్వాకు వరుణుడు। ఆవరుణప్రకాశకసాక్షి ఈశ్వరుడు। వరుణుడు ఈశ్వరుడుగాడు। ఘ్రూణానకు అశ్వినీ కొమాళ్లు। అశ్వినీ కొమాళ్ల సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। అశ్వినీ కొమాళ్లు ఈశ్వరుడు గాడు। వాక్కుకు అగ్ని। ఆ అగ్నికి సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। ఆ అగ్ని ఈశ్వరుడుగాడు। హస్తంకు యింద్రుడు ఆ యింద్రప్రకాశకసాక్షి ఈశ్వరుడు। యింద్రుడు యీశ్వరుడు గాడు । పాదాలకు వామనుడు। వామన ప్రకాశక సాక్షి ఈశ్వరుడు। వామనుడు ఈశ్వరుడు గాడు। శిశ్నానకు ప్రజాపతి। ప్రజాపతి సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు । ప్రజాపతి ఈశ్వరుడుగాడు। గుదానకు నైర్‌రుతి। నైర్‌రుతి ప్రకాశక సాక్షి ఈశ్వరుడు। నైర్‌రుతి ఈశ్వరుడుగాడు। పంచప్రాణం। పంచ ప్రాణాలకు సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। పంచప్రాణాలు ఈశ్వరుడుగాడు। పంచ విషయాలకు సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। పంచవిషయాలు ఈశ్వరుడు గాడు। యిరువై అయిదు తత్వంది హిరంణ్యా గర్భదేహం। యీ సర్వానకు సాక్షి ఈశ్వరుడు । ఈ సర్వం ఈశ్వరుడుగాడు। ప్రతిపాలన అవస్థా। ఆ ప్రతిపాలన అవస్థాకర్త విష్ణు। ప్రతిపాలన అవస్థా విష్ణు। అభిమాని। యిద్దరికీ సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। యిది ఈశ్వరుడుగాడు। అవ్యాకృత మాయ। అవ్యాకృత మాయ కారణ శరీరం। దాని ప్రకాశక సాక్షి ఈశ్వరుడు। అది ఈశ్వరుడు గాడు। ప్రళయావస్థా। శంకరుడు అభిమాని। ఈరెంటికీ సాక్షి ప్రకాశకుడు యీశ్వరుడు। యిది ఈశ్వరుడుగాడు। మూలమాయమహాకారణ శరీరం। మూలమాయ సాక్షి ప్రకాశకుడు ఈశ్వరుడు। మూలమాయ ఈశ్వరుడుగాడు। సర్వసాక్షి అవస్థా। ఈశ్వరుడు అభిమాని। దానిదిసాక్షి ప్రకాశకుడుఈశ్వరుడు। ఈశ్వరుడు యిదిగాదు। ఈశ్వరస్వరూపం కేవల చైతన్యం। స్వయంప్రకాశ ఘనం। అఖండైకరసం। బ్రహ్మం। ఆ ఈశ్వర రూపంలో సర్వం లేదు। సర్వ సాక్షిత్వంలేదు। యిది సర్వంమాయామయం। మిథ్య। యిందుకోసానకు సర్వ సాక్షిత్వం మిథ్య। అవస్థాత్రయానకు సాక్షి ప్రత్యగాత్మ। అవస్థాత్రయం మిథ్య। దానిదిసాక్షిత్వం మిథ్య। ఆత్మకు ప్రత్యగాత్మ పేరు వచ్చింది। అది అవస్థాత్రయాన్నుంచివచ్చింది। ఆ అవస్థాత్రయం మిథ్యా అయితె ప్రత్రక్ శబ్దం మిథ్యా అవుచుంది। మిగిలింది కేవల ఆత్మ। ఆ ఆత్మ ఈశ్వర రూపం। బ్రహ్మం। ఆ బ్రహ్మం ఆత్మా వొక్కటె । అక్కడ సాక్షిత్వం సర్వసాక్షిత్వం యెమీలేదు। అఖండైకరసంబ్రహ్మ। దానికి బ్రహ్మం దానికి ఆత్మ అనవలెను। ఆ ఆత్మ బ్రహ్మ విష్ణు మహేశ్వర। ఈశ్వర। అందరూ కూడా ఆత్మదేవున్నాడూ। యింద్రాదిక దేవతలు సకల జీవులు। బ్రహ్మాది పిపీలికా పర్యంతం అందరూ వొక్కటె। ఆత్మ। ఈశ్వరుడు। ఆది జేశి సకలనామరూపాత్మకం। ఆత్మస్వరూంలో లేదు। ఆత్మపరిపూర్ణంతానేవున్నాడు । అన్వయంతానేవున్నాడు । వ్యతిరేకంచాత తానేవున్నాడు। అన్వయవ్యతిరేకం లేక తానేవున్నాడు । ఆత్మస్వరూపం వినహాయెమీలేదు। **"ఏకమెవా ద్వితీయ్యంబ్రహ్మ । నెహనానాస్తి కించనా"** శృతిః। యిదినిశ్చయం। ఇతి శ్రీ జీవన్ముక్త కృత సాక్షిత్వ సర్వసాక్షిత్వ వివరణం ॥

౪౫ శ్రీ॥త్రిపుటి ద్విపుటిరహిత విచారం॥ ఆత్మస్వరూపం కేవల చైతన్యం। అఖండైకరసం బ్రహ్మ వున్నాది। ఆత్మ స్వరూపంలో త్రిపుటులు లేవు। అదియేదెది। ధ్యేయధ్యాతాధ్యానం। యిదేధ్యానత్రిపుటి। ఆత్మ స్వరూపంలో లేదు । జ్ఞేయజ్ఞాతాజ్ఞానం। యిదే జ్ఞాన త్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు । దృశ్యద్రష్టాదర్శనం । యీదృశ్యత్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు। అనుభావ్యం। అనుభావకం। అనుభవం। యీ అనుభవత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। భోగ్య। భోక్తా। భోగం। యీ భోగత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। సాధకం సాధ్యం సాధనం। యీ సాధకత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు । కర్త కర్మకార్యం। యీ కర్మ త్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు। భజ్యభజకం భజనం। యీభజన త్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు। దేవభక్త భక్తి। యీ భక్తి త్రిపుటి ఆత్మస్వరూపంలా లేదు। స్వామి సేవకసేవ। యీ సేవ త్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు। గురుశిష్యోపదేశం । యీఉపదేశత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। స్థూల సూక్ష్మ కారణ। యీదేహత్రిపుటి। ఆత్మ స్వరూపంలో లేదు। జాగ్రత్స్వప్న సుషుప్తి। యీ అవస్థాత్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు । విశ్వతైజసప్రాజ్ఞ। యీ అభిమానత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। ఋగ్యజుస్సామం। యీవేదత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। స్థూల ప్రవివిక్త ఆనంద। యీభోగత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। నేత్రకంఠహృదయ। యీస్థానత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు । కర్మ ఉపానన జ్ఞానం। యీకాండ త్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు। బ్రహ్మాండ హిరణ్యగర్భఅవ్యాకృత మాయా। యీబ్రహ్మాండ త్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। ఉత్పత్తి స్థితిప్రళయం। యీ అవస్థా త్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। బ్రహ్మవిష్ణురుద్ర। యీ దేవత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। సత్యలోక వైకుంఠ కైలాసం। యీ స్థానత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। జ్ఞానం అజ్ఞానం। అన్యథాజ్ఞానం యీత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు । మాయా అవిద్యాకార్యం యీ మాయాత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। త్వంపదం। తత్పదం అసిపదం। యీవాక్య త్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు। సత్ చిత్ ఆనందం। యీత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు । విజాతిస్వజాతి స్వగతం। యీ భేదత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు । భూత భవిష్యద్వర్త మాన । యీకాలత్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు । దేశకాలవస్తు। యీపరిచ్ఛేదత్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు । ప్రాతః స్సాయం మధ్యాహ్నం। యీత్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। సత్వరజస్తమం యీగుణ త్రిపుటి ఆత్మ స్వరూపంలో లేదు। శ్రవణమనననిజధ్యాస। యీత్రిపుటి ఆత్మస్వరూపంలో లేదు। యికను ద్విపుటి। ప్రకృతి పురుషయీరెండూ ఆత్మస్వరూపంలో లేదు। క్షేత్రక్షేత్రజ్ఞం యీరెండూ ఆత్మస్వరూపంలో లేదు। క్షరాక్షర భేదం ఆత్మస్వరూపంలో లేదు। బంధముక్తి భేదం ఆత్మస్వరూపంలో లేదు। గురు శిష్యభేదం ఆత్మస్వరూపంలో లేదు। సాకార నిరాకారభేదం ఆత్మస్వరూపంలో లేదు। వ్యక్తా అవ్యక్తభేదం ఆత్మ స్వరూపంలో లేదు। స్మరణ విస్మరణభేదం ఆత్మస్వరూపంలో లేదు। ద్వైతాద్వైత భేదం ఆత్మస్వరూపంలో లేదు। స్థూల సూక్ష్మభేదం ఆత్మస్వరూపంలో లేదు। సవికార నిర్వికారభేదం ఆత్మస్వరూపంలో లేదు। ప్రభాసం నిరాభాసం ఆత్మ స్వరూపంలో లేదు। ప్రకాశం

అప్రకాశం ఆత్మ స్వరూపంలో లేదు। వ్యాపకావ్యాపకం ఆత్మస్వరూపంలో లేదు। శూన్యా శూన్యా భేదం ఆత్మస్వరూపంలో లేదు। సర్వజ్ఞత్వంకించజ్ఞత్వం ఆత్మ స్వరూపంలో లేదు। సదసద్భేదం ఆత్మస్వరూపంలో లేదు। చిద చిద్భేదం ఆత్మస్వరూపంలో లేదు। కర్మాకర్మ భేదం ఆత్మ స్వరూపంలో లేదు। కార్యాకార్యభేదం ఆత్మస్వరూపంలో లేదు। ప్రవృత్తి నివృత్తి భేదం ఆత్మస్వరూపంలో లేదు। నామరూప భేదం ఆత్మస్వరూపంలో లేదు। కర్తాకర్తభేదం ఆత్మస్వరూపంలో లేదు। భోక్తా భోక్తభేదం ఆత్మస్వరూపంలో లేదు। ప్రాప్తాప్రాప్తభేదం ఆత్మస్వరూపంలో లేదు। యోగాయోగం ఆత్మస్వరూపంలో లేదు। ఉపాస్యోపానకం ఆత్మస్వరూపంలో లేదు। చూచెదిచూడనిది ఆత్మస్వరూపంలో లేదు। గతి అవగతి ఆత్మస్వరూపంలో లేదు। హర్షవిషాదం ఆత్మస్వరూపంలో లేదు। నిందాస్తుతి ఆత్మస్వరూపంలో లేదు। మానావమానం ఆత్మస్వరూపంలో లేదు। సీతోష్ణభేదం ఆత్మస్వరూపంలో లేదు। వైరాగ్యావైరాగ్యం ఆత్మస్వరూపంలో లేదు। వివేకావివేకం ఆత్మస్వరూపంలో లేదు। పరోక్ష జ్ఞానం అ పరోక్షజ్ఞానం ఆత్మస్వరూపంలో లేదు। ప్రత్యక్పూర్ణం ఆత్మస్వరూపంలో లేదు। సాధ్యం అసాధ్యం ఆత్మస్వరూపంలో లేదు। నీవునేను అనేభేదం ఆత్మస్వరూపంలోలేదు। దేహవిదేహం ఆత్మస్వరూపంలో లేదు। యింద్రియాతీంద్రియ భేదం ఆత్మ స్వరూపంలో లేదు ప్రాణం అప్రాణం ఆత్మస్వరూపంలో లేదు। అహంకారం అనహంకారం ఆత్మస్వరూపంలో లేదు। ప్రకృతి పురుషభేదం ఆత్మస్వరూపంలోలేదు। స్త్రీ పురుష భేదం ఆత్మస్వరూపంలోలేదు। పితాపుత్ర భెదం ఆత్మస్వరూపంలో లేదు। గురు శిష్యభెదం ఆత్మస్వరూపంలో లెదు। దేవభక్త భేదం ఆత్మస్వరూపంలో లేదు। స్వామి సేవకభేదం ఆత్మస్వరూపంలో లేదు। జీవశివభేదం ఆత్మస్వరూపంలో లేదు। సాధు అసాధు భేదం ఆత్మస్వరూపంలో లేదు। నిత్యంఅనిత్యం ఆత్మస్వరూపంలోలేదు। మలినంఅమలినం ఆత్మస్వరూపంలో లేదు। సంసారం అసంసారం ఆత్మస్వరూపంలో లేదు। జాతి అజాతి ఆత్మస్వరూపంలో లేదు। జాతి అజాతి ఆత్మస్వరూపంలో లేదు। శుద్ధం అశుద్ధం ఆత్మస్వరూపంలో లేదు। వర్ణం అవర్ణం ఆత్మస్వరూపంలో లేదు । ఆశ్రమం అనాశ్రమం ఆత్మస్వరూపంలో లేదు। బ్రహ్మచారి అబ్రహ్మచారి ఆత్మస్వరూపంలో లేదు। గృహస్థు అగృహస్థు ఆత్మస్వరూపంలో లేదు। సన్యాసం అసన్యాసం ఆత్మస్వరూపంలో లేదు। గ్రామస్థం వానప్రస్థం ఆత్మస్వరూపంలో లేదు। బ్రాహ్మణ అబ్రాహ్మణం ఆత్మస్వరూపంలో లేదు। క్షత్రియం అక్షత్రియం ఆత్మస్వరూపంలో లేదు। వైశ్యుడు అవైశ్యుడు ఆత్మస్వరూపంలో లేదు। శూద్రం అశూద్రం ఆత్మస్వరూపంలో లేదు। స్థావరం జంగమం ఆత్మస్వరూపంలో లేదు। చరాచరం ఆత్మస్వరూపంలో లేదు। వినాయకం అవినాయకం ఆత్మస్వరూపంలో లేదు। సూర్యాసూర్య ఉపాసకం ఆత్మస్వరూపంలో లేదు। విష్ణువు అవిష్ణువుపాసకం ఆత్మస్వరూపంలో లేదు। శివాశివ ఉపాసకం ఆత్మస్వరూపంలో లేదు। శక్తి అశక్తి ఉపాసకం ఆత్మస్వరూపంలో లేదు। పూజాపూజకం ఆత్మస్వరూపంలో లేదు। పుణ్యం పాపం ఆత్మస్వరూపంలో లేదు। మరణం అమరణం ఆత్మస్వరూపంలో లేదు। బంధనం అబంధనం ఆత్మస్వరూపంలో లేదు। మోక్షం

అమోక్షం ఆత్మస్వరూపంలో లేదు। సిద్ధి అసిద్ధి ఆత్మస్వరూపంలో లేదు। ఆకర్షణం నిరాకర్షణం ఆత్మస్వరూపంలో లేదు। శమం అశమం ఆత్మస్వరూపంలో లేదు। దమం అదమం ఆత్మస్వరూపంలో లేదు। ఉపరతి అవుపరతిఆత్మస్వరూపంలో లేదు। తితీక్ష అతితీక్ష ఆత్మస్వరూపంలో లేదు। శాంతి అశాంతి ఆత్మస్వరూపంలో లేదు। శ్రద్ధ అశ్రద్ధ ఆత్మస్వరూపంలో లేదు। సమాధానం అస్సమాధానం ఆత్మస్వరూపంలో లేదు। ముముక్షు। అముముక్షు ఆత్మస్వరూపంలో లేదు। బోధ అబోధ ఆత్మస్వరూపంలో లేదు। భక్తి అభక్తి ఆత్మస్వరూపంలో లేదు। సంశయం అసంశయం ఆత్మస్వరూపంలో లేదు। శాస్త్రం అశాస్త్రం ఆత్మస్వరూపంలో లేదు। వేదం అవేదం ఆత్మస్వరూపంలో లేదు। ఓంకారం అఓంకారం ఆత్మస్వరూపంలో లేదు। ఈశ్వరం అనీశ్వరం ఆత్మస్వరూపంలో లేదు। జీవత్వం అజీవత్వం ఆత్మస్వరూపంలో లేదు। మాయా అమాయా ఆత్మస్వరూపంలో లేదు। అవిద్యా విద్యా ఆత్మస్వరూపంలో లేదు। భేదం అభేదం ఆత్మస్వరూపంలో లేదు। యేకం అనేకం ఆత్మస్వరూపంలో లేదు। సకలంనిసకలం ఆత్మ స్వరూపంలో లేదు। జనం అజనం ఆత్మస్వరూపంలో లేదు। తుర్యం వున్నది ఆత్మస్వరూపంలో లేదు। అంజనం నిరంజనం ఆత్మస్వరూపంలో లేదు। వృత్తి అవృత్తి ఆత్మస్వరూపంలో లేదు। పూర్వపక్షం సిద్ధాంతం ఆత్మస్వరూపంలో లేదు। ఉపాధికం నిరుపాధికం ఆత్మస్వరూపంలో లేదు। విశేషసామాన్యం ఆత్మస్వరూపంలో లేదు। మౌనం అమౌనం ఆత్మస్వరూపంలో లేదు। ప్రమేయం అప్రమేయం ఆత్మస్వరూపంలో లేదు। ప్రమాణం అప్రమాణం ఆత్మస్వరూపంలో లేదు। శబ్దం నిశ్శబ్దం ఆత్మస్వరూపంలో లేదు। అస్తినాస్తి ఆత్మస్వరూపంలోలేదు। అటువంటి ఆత్మస్వరూపం అఖండైకరసం । పరిపూర్ణం। చైతన్య ఘనం। తనకు తానేవున్నాది। యీలాగున యెరింగి। ఆత్మస్వరూపస్థితి తోటి వుండవలెను। గురువు కృపచాత అవుచుంది। అఖండైకరసం పరబ్రహ్మ। **"ఏకమేవాద్వితీయ్యం బ్రహ్మ। నెహనానాస్తికించన"** ఇతీ శ్రీ జీవన్ముక్త కృత త్రిపుటి ద్విపుటి రహిత వివరణం ॥

౪౬ శ్రీ॥చతుశ్లోక భాగవతం॥ భాగవతార్థం। శ్రీమహావిష్ణు బ్రహ్మదేవునికి చెప్పినాడు। సచ్చిదానందం। అఖండైకరసం। బ్రహ్మస్వయంప్రకాశ చైతన్యం। ఆత్మపరిపూర్ణం వున్నాడు। రెండోదియెమీ లేదు। అటువంటి పరబ్రహ్మఆత్మ। శ్లోకం॥ **"అహమేవసమేవాగ్రె నాన్యద్యే సదసత్పరం। పశ్చాదహం యదె తచ్చయోవశిష్యేతసోస్యహం"**॥ అర్థం ॥ ఏకార్ణవజలంవలెను। మాత్రంవున్నాను॥ మాయా ఆదిశేషసకల జగానకు। అగ్రం అగ్రం అంటెనుయేమి। సకల జగానకు మూలం। సకల జగానకూ ఆది। అదె సన్మాత్ర పరబ్రహ్మం। నేను వున్నాను। నాస్వరూపం। శృతివాక్యం । పలుకుచుంది। **"ఆత్మైవ ఇదమెకమేవాగ్ర ఆసీత్। బ్రహ్మమేవ ఇదమేక మేవాగ్ర ఆసీత్ । అరేదంసౌమ్యేదమగ్ర ఆసీత్"** । యీలాగు ఆత్మ నాస్వరూపం। చెప్పుచుంది। యిందుకోసానకు। **"అహమేవసమెవాగ్ర"** । నేనుసకలజగానకు అగ్రం। రెండోది యెమీలేదు। **"నాన్యద్యేసదసత్పరం। అన్యం సదసత్"** । నాస్వరూపంలో లేదు। నాస్వరూపం సదసత్స్వ రూపానకు

పరం। అతీతం। సదసద్రూపం అంటెయేమీ। మాయా భాసం సత్ అంటెను। అసత్। అసత్ అంటేను। సత్‌దానిది అర్థం॥ సత్ అంటెనుమాయాఉన్నాది। ఆత్మవిచారం తోటి చూస్తేలేదు। మాయ । అసత్ అంటెనుయేమి। జగదాభాసం। కనిపిస్తుంది। యిందుకోసానకు సత్ అసత్ మాయాకాదు। యిందుకోసానకు మాయామిథ్యా। మాయావున్నాది। యట్లాను। మాయాలేదు। యట్లాను ఆత్మవిచారం లేకుంటె మాయాభాసం వున్నాది। వలెనుకనిపిస్తుంది। ఆత్మవిచారం చేస్తె । మాయాఅక్కడను లేదు। యిందు కోసానకు మాయకుసద సద్రూపం అంచారు। అసదసద్రూపం మాయాయేది। చైతన్య స్వరూపంలో అహంయాలాగున స్ఫురణ అయ్యింది। దానిపేరు సూక్ష్మ మాయా। అస్ఫురణం నుంచి పంచమహాభూతాలు। మనోబుధ్యహంకారాలు పుట్టింది। యెనిమిది కూడా। స్థూలమాయా। యీసూక్ష్మ మాయా స్థూల మాయాయిద్దరి నుంచి సకల జగత్తునిర్మాణం అయ్యింది। ఆమాయా ఆదిజెశి। సకలజగత్తు రజ్జు సర్పంవలెను। మిథ్యా। నేను సచ్చిదానందస్వరూపం। సత్యం। అదేనేనుసకలజగత్తుకు పూర్వం। మాయా ఆదిజేశిసకల జగత్తులోనె। నేను పరిపూర్ణంవున్నాను। నాస్వరూపంమీద మాయామయ జగదాభాసంమిథ్యా। పశ్చానహంయదేతచ్చమాయా ఆదిజేశిసకల జగానకు ప్రళయం అయితె పశ్చాత్ నేనే వున్నాను। ప్రళయం రెండు విధాలు। కల్పాంత ప్రళయం వొక్కటి। కల్పాంతప్రళయం కల్పంలో సకల సంహారం అయితె। **"పశ్చాదహంయదేతచ్చ"** । రెండో ప్రళయం యేవెళ్ల ఆత్మజ్ఞానం అవుచుంది। అవేళ్ల మాయా సహితం సకలజగత్తు లేకుండా అవుచుంది। యిట్లా జగత్తు ప్రళయం అయ్యి **"పశ్చాత్ అహం"** యేమిమిగులుచుందో అదేనేను వున్నాను। ఆమాయాసహితం జగత్తుప్రళయం అయి **"తెయోవశిష్యేత। సోస్మ్యహం"** । జగత్తు సంహారమైతె। యేమిమిగులుచుందో అదేనేను పూర్ణబ్రహ్మనం వున్నాను। యిందు కోసానకు। సకలజగత్తులో ఆది మధ్యాంతం నేను వున్నాను । యిందుకోసానకు సకల జగదాభాసంమాయా మయంమిథ్యా। శ్లోకం॥ **"ఋత్యర్థం యత్ప్రతీ య్యేత నప్రతియ్యేత చాత్మని। తంవింద్యాదాత్మనోమాయా యదాభాసోయథాతమం"** ॥ అర్థం॥ మాయాఆత్మవిచారం చాయకనామరూపాత్మకం స్థూలసూక్ష్మ ఆభాసం సత్యంవలె కనిపిస్తుంది। ఆకాశంలో నీలవర్ణం యట్లా సత్యంవలెను కనిపిస్తుందో అట్లా కనిపిస్తుంది । పరంతు మిథ్యా మృగజలం సత్యంవలెను కనిపిస్తుంది। పరంతు మిథ్యా। స్థాణుపురుషత్వం సత్యం వలె కనిపిస్తుంది। పరంత్తు మిథ్యా। శుక్తి కమీద రజితం సత్యం వలెను కనిపింస్తుంది। పరంత్తు మిథ్యా రజ్జు సర్పంవలెను సత్యం వలెను కనిపిస్తుంది। పరంతు మిథ్యా। ఘటంలో పొగ సత్యంవలెను కనిపిస్తుంది పరంతు మిథ్యా। అట్లా ఆత్మ స్వరూపం విచారం చెయ్యవలెను। యిందుకోసానకు మాయాభాసం సత్యవలెను కనిపిస్తుంది। **"నప్రతియ్యేత చాత్మని"**। ఆత్మస్వరూపం విచారం చేస్తె ఆత్మసచ్చిదానందపరిపూర్ణబ్రహ్మవున్నాడు। ఆత్మదృష్టి తోటచూస్తె మాయయక్కడా కనిపించదు। ప్రతీతికిరాదు। యేవం। మాయా మిథ్యా। మాయాకార్యంజగదా భాసం మిథ్యా। ఆత్మపరిపూర్ణం వున్నాడు। సూర్యవుదయం అయితె అంధకారం యక్కడను లేదు। **"తంవిద్యా దాత్మనోమాయా"** । ఆ ఆత్మస్వరూపంలో మాయాలేదు।

యీలాగున తెలియవలెను। **"యథా భానోయథాతమః"** । తమంయట్లాకనిపిస్తుందో। అట్లాగె మిథ్య। అట్లా మాయా ఆదిజెశిజగదాభాసంమిథ్యా వున్నాది। ఆత్మపరిపూర్ణం వున్నాడు ॥శ్లోకం॥ **"యదామహంతి భూతాని। భూతెషుచవ చైష్టను। ప్రతిష్ఠానప్రతిష్ఠాని। తథా తెషునతెష్వహం"** ॥ అర్థం ॥ యట్లాపంచమహాభూతాలు । **"భూతెషు"** అంటెనుయేమి । దేహంలో పంచమహా భూతాలువున్నావి । అని చెప్పుచున్నారు । పరంతు పంచమహాభూతం అంశత్వంచాతవున్నాది। పంచమహాభూతంయట్లా వున్నాదో అట్లాగె వున్నాది। అట్లాసకల జగత్తు శరీరంలో పంచమహాభూతాలు ప్రవేశం అయింది। పరంతు ప్రవేశం కాలేదు । పంచమహాభూతంయట్లా వున్నాదో అట్లాగెవున్నాది । ప్రవేశించీ ప్రవేశించలేదు। తథా అట్లా బ్రహ్మం। పిపీలికాపర్యంతం సకల జగత్తు శరీరంలో జీవరూపంచాతనేనేప్రవేశించి నాను। పరంతు ప్రవేశించలేదు । యీ అర్థం యట్లాను। దేహంలో ప్రవేశించి జీవననామం నాకు వచ్చింది। పరంతు దేహవికారం జీవవికారం నాకు లేదు । నేను అసంగనిర్వికారం యట్లా వున్నానో అట్లాగె వున్నాను । సకల జగత్తు । మాయామయం । మిథ్య । మిథ్యలో మాప్రవేశం యేమి । నేను పరిపూర్ణ చైతన్యం। జగత్తు । **"ఏకాంశేనస్థితేజగత్"** । ఆ అంశలో నాది పూర్ణతనం యట్లాప్రవేశం అవుచుంది। సకలజగత్తు మాయా ఆదిచేశి మాస్వరూపం మీద మృగజలం వలెను వున్నాది । యిందు కోసానకు। ప్రవేశం అప్రవేశంనాకు లేదు । నేను పరిపూర్ణం వున్నాను ॥శ్లోకం॥ **"ఏతావదేవజిజ్ఞాసం తత్వజిజ్ఞాసు నాత్మనః। అన్వయవ్యతిరేకాభ్యాం యస్యాత్సర్వత్ర సర్వదా"** ॥అర్థం॥ **"ఏతావదేవ । జిజ్ఞాసం"** । అంటెను వెనకకు మూడు శ్లోకాలలో యేవిచారం చెప్పినాడో । ఆవిచారం పేరు జిజ్ఞాసం । **"తత్వ జిజ్ఞాసు నాత్మనః"** । తత్వం అంటె । ఆత్మ స్వరూపం। జిజ్ఞాసు అంటెను ఆ ఆత్మ స్వరూపవిచారం చాత । ఆత్మస్వరూపంలో మాయా మయం జగదాభాసంయెమీలేదు। ఆత్మమాత్రం వున్నాడు । యిది జగదా భాసంకనిపిస్తుంది । యిదియేమి । **"అన్వయ వ్యతిరేకాభ్యాంయ స్యాత్సర్వత్ర సర్వదా। యస్యాత్"** । సచ్చిదానంద రూపం। పూర్ణచైతన్యం। ఆత్మ। దానినుంచి బ్రహ్మస్ఫురణం అయ్యింది। నేనుబ్రహ్మం వున్నాను। ఆస్ఫురణం పేరుమాయా । ఆ మాయనుంచి అష్ట విధమాయ। సకల జగత్తు అయింది। సకల జగత్తులో నేనేజీవరూపంచాత ప్రవేశించినాను। యిందుకోసానకు సకల విశ్వం నేనేవున్నాను। నామినహకించిత్తు యెమీలేదు। శృతి వాక్యం ఆలాగే పలుకుచుంది । **"ఆత్మై వేదం సర్వం । బ్రహ్మై వేదం సర్వం । సర్వం ఖల్విదం బ్రహ్మ"** । యీ లాగున నాస్వరూపం శృతులు పలుకుచుంది। యిందు కోసానకు సకల మాయాభాసం। బ్రహ్మనుంచి అయింది ॥

౪౭ శ్రీ॥ భగవద్గీతల్లో రెండో అధ్యాయంలో॥ భగవంతుడు చెప్పినాడు। దానిదిసారాంశం॥ ముందు సాంఖ్య యోగం చెప్పినాడు। వెనక కర్మయోగం చెప్పినాడు। ఆవెనకబుద్ధియోగం చెప్పినాడు। అది యట్లాను। సాంఖ్య యోగం అంటెను। జ్ఞానియోగంపేరు। ఆత్మకుజన్మమరణం లేదు ॥శ్లో॥ **"నజాయతేమ్రియ్యతె వాకదాచిన్నాయంభూత్వాభవితా వానభూయః। అజోనిత్యః**

**శాశ్వితోయంపురాణోనహన్య తెహన్యమానేశరీరే"** ॥ అర్థం॥ ఆత్మకు జన్మంలేదు మరణంలేదు। వెనకకు అయ్యింది లేదు । యిపుడున్నులేదు । ముందరనున్నులేదు । **"ఆత్మ అజఃనిత్యః శాశ్వితః పురాణః"** । దేహానకు నాశంఅయితె ఆత్మకునాశంలేదు । ఆత్మస్వరూపంయట్లావున్నాది। చిదాకాశం। సచ్చిదానందస్వరూపం। నిరాకాశం। నిరాభాసం। స్వయం ప్రకాశం। పరిపూర్ణం। ఆద్యంతరహితం । ఆత్మకు । ఉత్పత్తి । స్థితిప్రళయంలేదు ॥శ్లో॥ **"నైనంఛిందంతి శస్త్రాణి నైనందహతి పావకః। నచైనం క్లేదయంత్యా పోనశోషయతిమారుతః । అచ్ఛేద్యోయ మదాహ్యోయమ క్లెద్యోశోష్య ఏవచ। నిత్యః సర్వగతస్థాణురచలోయం సనాతనః। అవ్యక్తోయ మచింత్యోయమ వికారోయ ముచ్యతె। తస్మాదేవం విదిత్వైనం నాను శోచతి హర్ష"** ॥అర్థం॥ శస్త్రంచాత ఆత్మస్వరూపం ఛేదనం కాదు। అగ్నిచాత ఆత్మస్వరూపం దహనం కాదు। వుదకం చాత ఆత్మస్వరూపం మునిగిపోదు। వాయువుచాత ఆత్మస్వరూపం శోషణంకాదు। ఆత్మ అచ్ఛెద్యం। ఆదాహ్యం। అక్లేద్యం। అశోష్యం। నిత్యం అంటె శాశ్వితం। సర్వగతం అంటె। సర్వజగత్తులో వ్యాపించియున్నాడు। స్థాణువంటె అచలం। అచలం అంటె చలనం లేదు। సనాతనం అంటె అనాది సిద్ధం। యట్లా వున్నాడో అట్లాగె వున్నాడు। అవ్యక్తం అంటె నిరాకారం। అచింత్యం అంటె చింతతోటి చింతనం చాయరాదు। అవికారి అంటెను నిర్వికారి। యిందు కోసానకు। యిట్ల ఆత్మస్వరూపం వున్నాది। యరగవలెను దేహందిశోక మోహం విడచి పెట్టవలెను। యీఆత్మ। సకల జగత్తుకు మూలం। **"అవ్యక్తాదీని భూతాని । వ్యక్తమధ్యాని భారతా। అవ్యక్త నిధనాన్యేవ। తత్రకా పరివేదనా"** ॥ ఆత్మ అవ్యక్తరూపపర బ్రహ్మవున్నాడు। భూతాని అంటెను। సకల జగత్తు। సకల జగత్తుకు। ఆది ఆత్మ। సకలజగత్తు వ్యక్తరూపం వున్నాది । అంటెను। ఆకారరూపం। యీజగత్తుకు। ఆత్మవ్యాపించియున్నాడు। సకలజగత్తు ప్రళయం అయితె। కేవల ఆత్మమిగులుచుంది। ఆఆత్మఅవ్యక్తం। అవినాశం। గగనం వలెపరిపూర్ణం। అవస్థాత్రయానకు సాక్షిరూపం। స్వయం జ్యోతి। స్వప్రకాశం। చిన్మాత్రం। చైతన్యఘనం। యిదె ఈశ్వర స్వరూపం। యిదెతనస్వరూపం। యిదె సకలజీవనస్వరూపం। యిట్లాయెరిగెది। దాని పేరుబ్రహ్మాత్మైక్య జ్ఞానం। యీ జ్ఞానం పేరుసాంఖ్యయోగం। సాధుసంతులు। యిట్లా యెరిగి అంత్తుర్ముఖం అయ్యి। యీకేవల చైతన్యంకు అయిక్య రూపం అయివుంచారు। యిట్లా తానువుండవలెను। దీని పేరుసాంఖ్య యోగం। కర్మయోగం యెందుకు చెప్పినాడు। యిట్లా జ్ఞానం అయ్యేది। సాధన కర్మం । కామ్యకర్మం। నిషిద్ధకర్మం। త్యాగంచేశి। నిత్యనైమిత్తి కకర్మం పేరు స్వధర్మం । **"స్వధర్మ మపిచావేక్ష్య"** । స్వధర్మంచాత చిత్తశుద్ధి అవుచుంది। వైరాగ్యం వివేకంపుట్టుచుంది। వైరాగ్య వివేకంచాత। సత్సమాగమం అవుచుంది। సత్సమాగమంచాత। శ్రవణమవుచుంది। శ్రవణంచాతమననం అవుచుంది। మననంచాత నిజధ్యాసం అవుచుంది। నిజధ్యాసంచాత బ్రహ్మసాక్షాత్కారం అవుచుంది । బ్రహ్మసాక్షాత్కారం చాత బుద్ధి తదాకారం అవుచుంది। దాని పేరుబుద్ధి యోగం। బుద్ధియోగం యట్లా యట్లాను। సూల్థదేహం పాంచభూతికం నేనుగాదు। లింగదేహంది। యిరువై అయిదు తత్వందినేనుగాదు। కారణదేహం అజ్ఞానం నేను గాదు ।

జాగ్రత్స్వప్నసుషుప్తి అవస్థాత్రయంనేను గాదు। విశ్వతైజసప్రాజ్ఞ అభిమానిత్రయం నేనుగాదు। నేనుయీసకల జగానకు ప్రకాశకుడను। యీసకలానకూసాక్షి మాస్వరూపం। సచ్చిదానంద పూర్ణబ్రహ్మంనువున్నాను। యిట్లాబుద్ధిచాత యెరింగి। యీబుద్ధి ఆత్మస్వరూపంలో వుంచుంది। దానిపేరు బుద్ధియోగం। **"బుధ్యాయుక్తో యయాపార్థః కర్మ బంధం ప్రహస్త్రసి"**॥ యవ్వరికి బుద్ధి యోగం అయ్యింది। వారికి కర్మబంధనం లేదు। **"దూరేణ హెవరం కర్మబుద్ధి యోగాద్ధనంజయ"**। బుద్ధి యోగం నాలుగు దేహాతీతం। కేవల చైతన్యంలో బుద్ధియోగం అయ్యింది। కర్మస్థూల దేహంలో నిలిచె। ఆకర్మకు బుద్ధియోగికి సంమంధం యెమీలేదు। దేహాది కర్మం మాయామయం మిథ్య। ఆత్మస్వరూపం నిష్కర్మస్వరూపం। చైతన్యం। ఆ ఆత్మమాయం బుద్ధి అయితె। కర్మ బంధనం లేదు। అజ్ఞానవంతుడు యట్లాచూస్తాడు॥శ్లో॥ **"యానిశా సర్వభూతానాం। తస్యాం జాగృతి సంయ్యమీ యస్యాం జాగృతి భూతాని సానిశా పశ్యతోమునేః"**॥ సంయమీఅంటెను జ్ఞానవంతుడు। వానిదిచూపుయట్లాను। సర్వభూతాలకు అంటె సర్వజగత్తు ఆత్మస్వరూపానకు చూడడు। అదెరాత్రి । ఆరాత్రి జ్ఞానికిలేదు। సకల జగత్తు ప్రపంచంలో జాగృతి వున్నాడు। అప్రపంచభాసం జ్ఞాని చూడడు। జ్ఞానికేవల చైతన్య స్వరూపమే పరిపూర్ణం చూస్తాడు। బ్రహ్మస్థితితోటివుంచాడు। దేహ అహంకారం లేదు। శాంతంతోటి వుంచాడు। **"యెషాంబ్రంహ్మస్థితి పార్థః। నైనప్రాప్య విముహ్యతి। స్థిత్వాశామంతకాలెపి। బ్రంహ్మనిర్వాణ మృచ్ఛతి"** ॥ యీ బ్రహ్మస్థితి జ్ఞానికి అయ్యింది। వానికి మోహాదికంలేదు । దేహానకు అంతం వస్తే బ్రహ్మ స్థితికి మరచిపోడు । దేహంపడిపోతె। వానికి బ్రహ్మప్రాప్తి అవుచుంది। పునః జన్మవానికి లేదు। యిదిరెండో అధ్యాయందిసారాంశం। యిది నిశ్చయం॥ఇతి శ్రీ జీవన్ముక్త కృత సాంఖ్య యోగం కర్మ యోగం బుద్ధియోగవివరణం॥

౪౮ శ్రీ॥ భగవంతుడు మూడో అధ్యాయంలో కర్మ యోగం చెప్పినాడు। అర్జునునికి సందేహంఅయ్యింది। జ్ఞానికి ఆత్మజ్ఞాన అయితె। వానికి కర్మంది అక్కర లేదు। నాకు ఆత్మ జ్ఞానం చెప్పినారు తిరిగీ కర్మం చెయ్యుమంచారు। యిది యేమి। యిట్లాసంశయం అయ్యింది। దానికి భగవంతుడు చెప్పుచున్నాడు ॥శ్లో॥ **"లోకెస్మింద్వివిధా నిష్ఠాపురాప్రోక్త మయానఘా। జ్ఞానయోగెన సాంఖ్యానాం కర్మయోగెన యోగినాం"**॥ భగవంతుడు అంచాడు। నేను కర్మం జ్ఞానికి । చెప్పలేదు। జ్ఞానికి అజ్ఞానం నిరసనం అయ్యింది। చైతన్య స్వరూపంలో సమరసం అయ్యిపోయినాడు। వానికి కర్మంది అక్కర లేదు। వాడు జ్ఞానం చాత బ్రహ్మస్థితితోటివుంటాడు। వానికి కర్మసాధనం యెమీ లేదు। వాడు పరబ్రహ్మమేవున్నాడు। యెవ్వరికి అజ్ఞానం దేహాకారంచాత వున్నాడు। జీవదశతోటివున్నాడు। వాడు స్వధర్మ కర్మం చెయ్యవలెను। స్వతాకర్మం చాత। చిత్తశుద్ధి అవుచుంది। ఆత్మజ్ఞానం చాత విముక్తుడు అవుచాడు। చిత్తశుద్ధి ద్వారా ఆత్మజ్ఞానం అవుచుంది। యిందుకోసానకు కేవల తాదాత్మ్యం చాత వుంచాడు। నేనుకర్తనేను భోక్త । యిట్లా జీవంశచాతవుంచాడు। వానికి కర్మంచెప్పినాను। కర్మంచాయకుంటె జ్ఞానం యట్లా అయ్యాని। యిందుకోసానకు। స్వధర్మాచరణం కర్మం అగత్యం చెయ్యవలెను। జ్ఞానికి

జ్ఞానికి చిత్తశుద్ధి అయ్యింది। ఆత్మ జ్ఞానం అయ్యింది। బ్రహ్మ స్థితిప్రాప్తి అయ్యింది। వానికికర్మం చెప్పలేదు ॥శ్లో॥ **"యస్త్వాత్మరతిరేవదాత్మ తృప్తశ్చమానవః। ఆత్మన్యేవచసంతుష్టః తస్యకార్యంన విద్యతే"** ॥ యిట్లాభగవంతుడు చెప్పినాడు। జ్ఞానికి సదాసర్వదా ఆత్మరతివున్నాది। ఆత్మరతి అంటెను। యెమీ। తాను ఆత్మగదా సచ్చిదానందస్వరూపం। పరబ్రహ్మం। పూర్ణం। యిట్లా యెరింగి। స్వరూపంలో చిత్తం సమరసం అయివున్నాడు। స్వరూపం మీద అతిప్రీతి। దాని పేరు ఆత్మరతి। ఆత్మస్వరూపం పరిపూర్ణం। చైతన్య ఘనం వున్నాది। ఆస్వరూపంపూర్ణత్వం చాత వుండెదితృప్తి। తృప్తి అంటెనుపూర్ణతనం। అజ్ఞాని ఆత్మస్వరూపంతోటి సంతోషం వున్నాడు। ఆంనదరూపం ఆత్మరూపం। ఆనందంతోటివుండెది। సంతుష్టుడు। వాడు కేవలపరబ్రహ్మం వున్నాడు। వానికి యెమియెమీ చేశెదిమిగుల లేదు। యిందుకోసానకు। జ్ఞానికి। కర్మంలేదు। మరీ అర్జనునికి భగవంతుడు అంచాడు। నీకుజ్ఞానం నిశ్చయంకాలేదు। యిందుకోసానకు కర్మం చెయ్యి మంచాడు ॥శ్లో॥ **"మయిసర్వాణికర్మాణి సన్యస్యాధ్యాత్మ చెతసా। నిరాశీ నిర్మమోభూ త్వాయుధ్యస్వ విగతజ్వరః"** । నీవు అర్జునా తన స్వధర్మ ఆచరణం చేశి మదర్పణంచెయ్యిమా। మత్పరుండవైయుండు। మత్పరం అంటె యెమి। దేహం అహంకారం విడిచిపెట్టి। అంతర్ముఖం అయ్యిమనస్వరూపం కేవల చైతన్యం। అవస్థాత్రయాతీతం। ఆమనస్వరూపం కేవల చైతన్యం। దానికి అయిక్యంతోటి వుండెది। తత్పరం। మరీ తన చిత్తం అస్వరూపంలో సమరసం చెయ్య వలెను। దేహమమతా ఆశావిడిచిపెట్టవలెను। అంతరంలో స్వరూపంతోటి వుండవలెను। బాహ్యం దేహక్రియ దేహస్వభావంచాత అవుచుంది। ఆకర్మదికర్తృత్వ అభిమానం పట్టరాదు। యిదే అజ్ఞానిలక్షణం। **"తత్వవిత్తుమహా బాహోగుణకర్మ విభాగయోః । గుణాగుణేషువర్తంతే ఇతిమత్వాన సజ్జతే"** ॥ తత్వవిత్తు అంటెను। ఆత్మజ్ఞాని। దేహం యింద్రియాల తోటి సాత్వికరాజ సతామసకర్మంలు అవుచుంది। ఆకర్మాలదిఅభిమానం పట్టడు। సత్యగుణంచాతవిద్యా ప్రకాశం అవుచుంది। యేవెళ్ల యేగుణం లేస్తుందో ఆ వేళ్ల యింద్రియాలలో దాని చొప్పున కర్మాలు అవుచున్నావి। మరి జ్ఞానికి ఆకర్మాభిమానంలేదు। త్రిగుణం మనోబుద్ధియింద్రియాలు। దేహం యీ సకలానకు। అతీతం। సకల ప్రకాశక సాక్షి చైతన్య స్వరూపంతాను। వున్నాడు। జ్ఞాని యీ చొప్పుననే వుంచాడు। శరీరం యేజాతికులంలో పుట్టింది। ఆజాతికులమర్మధర్మం సహజస్వభావంచాత అవుచుంది। దానిది కర్మతనంది అహంభావం జ్ఞానికిలేదు। జ్ఞానిసదా సర్వదా తన చైతన్య స్వరూపంతోటివుంచాడు। **"యేవంబుద్ధేఃపరాబుధ్వా సంస్తభ్యాత్మా నమాత్మన"**। జ్ఞాని యిట్లావుంచాడు। సకలకర్మానకు। కామక్రోధాదికానకు। అధిష్టానంబుద్ధి। బుద్ధి అంటెను యెమి। నేను దేహం। నేను జీవుడ। యిట్లా నిశ్చయం పేరుబుద్ధి। అషువంటి బుద్ధి జ్ఞానికిలేదు। బుద్ధి ప్రకాశక ఆత్మస్వప్రకాశక చైతన్యం । ఆ బుద్ధినుంచి పరంవున్నాడు। యిట్లాయెరింగి ఆత్మస్థితితోటివుంచాడు। యిట్లానీవు వుండివుంటె నీకు కర్మబంధనంలేదు। నిష్కర్మ బ్రహ్మ మేనీవు। వున్నావు। యిది తృతీయ్యాధ్యాయంలో సారాంశం। యిదినిశ్చయం।ఇతి శ్రీ జీవన్ముక్తకృత కర్మగ్రంధి సారాంశవివరణం॥

౪౯ శ్రీ॥నాలుగో అధ్యాయంలో భగవంత్తుడు జ్ఞానమహిమ చెప్పుచున్నాడు॥ మూడో అధ్యాయంలో చెప్పినాడు। అకర్తృత్వం యోగం। మనుస్సు యింద్రియాలతోటి సకలకర్మాలు అవుచున్నావి। ఆమనుస్సుయింద్రియాలకు సకలకర్మాలకు సాక్షి ప్రకాశక ఆత్మ। ఆ ఆత్మతాను। యిట్లా జ్ఞానంచాత తెలశి నేను ఆత్మ। సకల కర్మాలకు అతీతం నిష్కర్మస్వరూపం। యిట్లా తెలిస్తే । వానికి కర్మబంధనం లేదు। యీలాగు నమూడో అధ్యాయంలో చెప్పినాడు। యీలాగె పూర్వమందు వైవస్వతమనువుకు చెప్పినాము। అని యిట్లా భగవంతుడు అర్జునునికి చెప్పినాడు। అర్జునుని మనస్సులో ఆశంక అయింది। కృష్ణ జన్మం మొన్నను అయింది। వైవస్వతమనువుకు। వుపదేశంచేశినాడు। యిదియేమి। యీమాటకు భగవంతుడు। అర్జునునికి। చెప్పుచున్నాడు॥శ్లోకం॥ **"అజోపిసన్నవ్యయాత్మా। భూతానామీశ్వరోపిసన్ । ప్రకృతి స్వామధిష్ఠాయం। సంభవామ్యాత్మ మాయయా"** ॥ భగవంత్తుడు అంచ్చాడు। యేవేళ్లపృథివిమీద అధర్మం అవుచుంది। దైత్యరాక్షసులుపుట్టి ధర్మంమణిగి పోతుంది। ఆవేళ్లనేను। అవతారం పుచ్చుకొంటాను। నేను చైతన్యస్వరూపం। బ్రహ్మం అజం అవ్యయం। సకల భూతాలకు ప్రకాశకుడను। ఈశ్వరుడ నేను। నేనుదైవీమాయాంగీకారంచేశి అవతారం పట్టినాను। దైత్యరాక్షస సంహారం చేస్తాను। ధర్మప్రతిష్ఠ చేస్తున్నాను। యిందునిమిత్యార్థమై। ధర్మప్రతిష్ఠా। సాధుసంతులను। భక్తులను సంరక్షణ చేస్తాను। యిందు కోసానకు మాకు అవతారం అవుచుంది। ఆ అవతారకృత్యం సంపాదన చేశి అవతారం విడుస్తాను। లేకుంటె నాకు జన్మమరణం వున్నాదా। నేను సచ్చిదానంద రూపం। పరబ్రహ్మం । పరిపూర్ణం। చైతన్యఘనంవున్నాను। మాయచాత। నాకు ఈశ్వర తనం వచ్చింది। మాయ మిథ్యావున్నాది। మాయయోగం చాత నాకు ఈశ్వరతనం వచ్చింది। అదిమిథ్య। ఆ మిథ్యామాయాజగదాభాసం। అది మిథ్య। ఆమిథ్యా మాయా అంశం అవిద్య। అది మిథ్యా। అవిద్యా మాయచాత జీవతనంది ఆభానం। అది మిథ్యాసకలజీవస్వరూపం మన స్వరూపంకూడా కేవలచైతన్యం। అఖండైకరసం బ్రహ్మవున్నాది। రెండోదియెమీలేదు। యిట్లా యెవ్వరికిజ్ఞానం అయ్యింది। వారికి మాస్వరూప ప్రాప్తి। అవుచుంది ॥శ్లో॥ **"వీతరాగ భయక్రోధ। మన్మయామాముపాశ్రితా॥ బహవోజ్ఞాన తపసాపూతమద్భావమాగతః"**। రాగభయక్రోధం త్యాగం చేశి। మాస్వరూపంలో అయిక్యమయ్యి మాభజనం చేస్తారు। సదాసార్వకాలికం। మాచైతన్యస్వరూపంనేను। అనియిట్లాయెరుగుచాడు। అదేజ్ఞానం। చైతన్య స్వరూపం తోటెవుంటె। అదే పవిత్రం। అషువంటి సాధుకు మాస్వరూపప్రాప్తి అవుచుంది। యిదే బ్రహ్మాత్మైక్యజ్ఞానం। యీజ్ఞానంచాత బ్రహ్మప్రాప్తి అవుచుంది। జ్ఞానం వినహాకర్మ సాధనం చాత బ్రహ్మప్రాప్తికాదు। యీజ్ఞానం యట్లాప్రాప్తి అవుచుంది ॥శ్లో॥ **"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా। వుపదేశంతితేజ్ఞానం జ్ఞానినస్తత్వదర్శనః"** ॥ తత్వదర్శిజ్ఞాని। వానికి శరణుపోవలెను। నమస్సుచాయవలెను। ప్రశ్నచెయ్యవలెను। ఆవేళ్లఆసాధుబ్రహ్మాత్మైక్య జ్ఞానం చెప్పుచాడు। ఆజ్ఞానం చాత సకలమోహముదినిరసనం అవుచుంది। పాపం పుణ్యం భ్రాంతి దేహబుద్ధి

అవిద్యా। జీవతనం। ద్వైతభావం సకల నివృత్తి జ్ఞానంచాత అవుచుంది। అజ్ఞానం యవ్వరికిశ్రద్ధ వున్నాదోవారికి అవుచుంది ॥శ్లో॥ "**శ్రద్ధావాౕల భతెజ్ఞానం**" ॥ యిట్లాగున భగవంతుడు చెప్పినాడు॥ "**నమేజ్ఞానేన సదృశం**" । యిట్లా భగవంతుడు చెప్పినాడు। యిందు కోసానకు। సకలబంధనం। నివృత్తి అవుచుంది। జ్ఞానం సమానం యేమి సాధనం లేదు। యజ్ఞం చేస్తె స్వర్గానకు పోచాడు। బ్రహ్మప్రాప్తి గాదు। తపస్సుచేస్తె అయిశ్వర్యప్రాప్తి అవుచుంది। బ్రహ్మ ప్రాప్తి కాదు। దానం చేస్తె పునర్జన్మానకు భాగ్య ప్రాప్తి అవుచుంది। బ్రహ్మప్రాప్తిగాదు। యోగంచేస్తె సిద్ధి ప్రాప్తి అవుచుంది। బ్రహ్మప్రాప్తికాదు। వుత్తమకర్మంచేస్తె ఉత్తమగతి అయ్యాని। బ్రహ్మప్రాప్తిగాదు। కామ్యకర్మాలు వ్రతాలు నేమాలు చేస్తె ముందరి జెన్మంలో ఫలంప్రాప్తం అయ్యాని। బ్రహ్మప్రాప్తిగాదు। నిషిద్ధ కర్మముచేస్తె అధోగతికి పోతారు। బ్రహ్మప్రాప్తిగాదు। విష్ణుభజనంచేస్తె వైకుంఠానకు పోచారు। బ్రహ్మప్రాప్తిగాదు। శివభజనంచేస్తె కైలాసానకు పోచారు బ్రహ్మప్రాప్తి కాదు। వినాయక ఉపాసన చేస్తె వినాయకలోకానకుపోచారు । బ్రహ్మప్రాప్తి కాదు। సూర్య ఉపాసవ చేస్తె సూర్యలోకానకు పోచున్నారు। బ్రహ్మప్రాప్తిగాదు। శక్తి ఉపాసన చేస్తె శక్తిలోకానకుపోచారు। బ్రహ్మప్రాప్తి గాదు। నానాదైవత ఉపాసన చేస్తె నానాదైవతలోకానకు పోచారు। బ్రహ్మప్రాప్తి గాదు। యింద్రాదిదేవతుల పేరను। హవనంచేస్తె। అగ్నిహోత్రం। సోమయాగం। పౌండరీకం చయనం అషువంటి నానావిధయాగాలు చేస్తె యింద్రలోకానకు పోచారు। బ్రహ్మప్రాప్తి గాదు । వేదాధ్యయనం చేస్తె। గాయత్రీ మంత్రం అనుష్ఠానం చేస్తె। సత్సహవాసంబ్రహ్మచర్యం। వానప్రస్థం। సన్యాసాశ్రమం। చేశినారు। జ్ఞానంలేకుంటె సత్యలోకానకు పోచారు। అషువంటి నానావిధసాధనలు చేస్తె బ్రహ్మప్రాప్తి లేదు। బ్రహ్మాత్మైక్యజ్ఞానంచాత బ్రహ్మప్రాప్తి అవుచుంది। బ్రహ్మాత్మైక్య జ్ఞానం అంటె యెమి। ఆత్మ అంటెను అవస్థాత్రయానకు సాక్షిరూపం। దాని పేరు ఆత్మ। ఆఆత్మతనం । మాయాతీతం। పరబ్రహ్మచైతన్యం స్వరూపం। అదే ఈశ్వర స్వరూపం। ఆఈశ్వరస్వరూపంబ్రహ్మతనస్వరూపం। ఆత్మప్రత్యక్చైతన్యం। ప్రత్యక్ చైతన్యం ఆత్మా। పూర్ణచైతన్యంబ్రహ్మ। ఆ బ్రహ్మ ఆత్మఅయిక్యం వున్నాది। దీనిపేరు బ్రహ్మాత్మైక్య జ్ఞానం। యీజ్ఞానం సమానం। మరియెమీ లేదు। యీజ్ఞానం చాత అవిద్యా మాయానిరసనం అవుచుంది। జీవేశ్వర ద్వైతాభాసం పోచుంది। అఖండైక రసంబ్రహ్మమెనేను। యిట్లాపూర్ణ బ్రహ్మప్రాప్తి అవుచుంది। యీ లాగున జ్ఞానమహిమవున్నాది। యిట్లా భగవంతుడు నాల్గో అధ్యాయంలో చెప్పినాడు యిది నిశ్చయం॥ఇతి శ్రీ జీవన్ముక్త కృత జ్ఞాన మహిమ వివరణం॥

౫౦ శ్రీ॥ అయిదో అధ్యాయంలో భగవంత్తుడు సన్యాసయోగం చెప్పినాడు। అర్జును నిమనుస్సులో ఆశంకం అయ్యింది। జ్ఞానం చాత సర్వకర్మ త్యాగం చెయ్యవలెనని చెప్పినాడు। తిరిగీ కర్మాచరణం చెయ్యుమంచాడు। యీ మాటనుంచి ఆశంకం వచ్చింది। వానిది ఆశంక నివారణం భగవంతుడు చేస్తున్నాడు। యెవ్వరికి ఆత్మజ్ఞానంలేదు వారికి కర్మం చెయ్యుమని చెప్పినాము। యవ్వరికి ఆత్మజ్ఞానం అయ్యింది। వారికి కర్మం చెప్పలేదు। యిట్లాభగవంత్తుడు

చెప్పినాడు। కర్మంచాత చిత్త శుద్ధి అవుచుంది। చిత్తశుద్ధి అయితె ఆత్మజ్ఞానం అవుచుంది। ఆత్మజ్ఞానం చాత బ్రహ్మస్థితి అవుచుంది। వాడు కర్మం చెయ్య అక్కరలేదు। లౌకీక వ్యవహారం సంపాదన చేస్తాడు। కర్మంది అభిమానం లేదు। అషువంటి జ్ఞానికి కర్మంది స్వీకారం యేమి। త్యాగం యేమి। లౌకీక సంపాదన మాత్రం చేస్తాడు। మనోబుద్ధీంద్రియాలతోటిసకలకర్మాలు అవుచున్నావి। మనోబుద్ధీంద్రియాలకు ప్రకాశకుడు ఆత్మ। ఆ ఆత్మ స్వరూపం నిష్కర్మం వున్నాది। యిందు కోసానకు। కర్మకర్త తనంది అభిమానం లేదు। సకల కర్మంలో సకల యింద్రియాలలో। మనోబుద్ధి చిత్తాహంకారంలో। పంచప్రాణాలలో చైతన్యం వ్యాపకం వున్నాది। ఆ చైతన్యం అలిప్తం। కర్మ స్పర్శం చైతన్యానకు లేదు। యట్లా ఆకాశం సకలంలో వున్నాది। పరంతు సకలానకు అలిప్తం। అట్లా చైతన్య స్వరూపం అలిప్తం। ఆ చైతన్య స్వరూపం ఆత్మతానువున్నాను। యిట్లా యవ్వనికి జ్ఞానం అయ్యింది। వాడు సన్యాసి। వాడే కర్మయోగి। కర్మంబ్రహ్మం రెండూఐక్యం తోటి చూస్తాడు॥ **"యత్సాంఖ్యైః ప్రాప్యతె స్థానం తద్యోగైరపి గమ్యతే। యో వైసాంఖ్యం చయోగంచయః పశ్యతి సపశ్యతి"** । సాంఖ్యైః అంటె జ్ఞానికి యేస్థానం ప్రాప్తి అవుచుందో ఆస్థానం యోగికి ప్రాప్తం అవుచుంది। యిందుకోసానకు సాంఖ్యయోగం వొక్కటె వున్నాది। యిట్లా జ్ఞానికి చూపువున్నాది। అకర్తాత్మ స్థితి చాతకర్మాలు చేస్తున్నాడు। వాడే సన్యాసి । వాడేకర్మ యోగి। కర్మం అవుచుంది । యింద్రియాలతోటి। దానిది। అభిమానం జ్ఞానికి లేదు। వానికి సన్యాసి అనవలెను। శిఖాసూత్రంత్యాగం చేశినాడు । దేహా బుద్ధి దేహాభిమానంపోలెదు । బ్రహ్మాత్మై క్య జ్ఞానం లేదు । అషువంటి వారు గృహస్థాశ్రమంది కర్మత్యాగం అయింది । సన్యాసకర్మం తగిలింది । కర్మ త్యాగంకాలేదు వాడు సన్యాసి యట్లా॥ లౌకిక సన్యాసి దేహేంద్రియాల వద్ద కర్మం అయ్యేది అవుచుంది । తనకు దేహేంద్రియాతీతం। కేవలచైతన్య స్వరూపంతోటి చూస్తాడు। వాడే సన్యాసి । వాడేయోగి । వాడేబ్రహ్మనిష్ఠ । వాడుతనకు యట్లాయట్లా చూస్తాడంటెను । శ్లో॥ **"తద్బుద్ధ యస్తదాత్మానంతన్నిష్ఠా తత్పరాయణం । గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞానీనిర్ధూతకల్మష"** తద్బుద్ధయః తచ్చబ్దం బ్రహ్మం అదేనేను । యిట్లా యరుగుచున్నాడు బ్రహ్మ మేనేను వున్నాను। యిట్లా తెలిశి బ్రహ్మపరుడు। అవుచున్నాడు। బ్రహ్మపరాయణుడు అవుచున్నాడు। వానికి సన్యాసి అనవలెను । యే ఆశ్రమంలో దేహంవున్నాది। ఆ ఆశ్రమకర్మం చెస్తెవాడు యెమీ చెయ్యలేదు। యట్లా చెయ్య లేదు । మనస్సు యింద్రియాలతోటి కర్మాలు అవుచున్నావి । మన యింద్రియాలకు అతీతం ఆత్మ । ఆత్మ స్వరూపంలో యేమీ కర్మం లేదు । చిదాకాశం । చిన్మాత్రచైతన్యఘనం। ఆత్మఅదేతాను । యిట్లానిశ్చయపూర్వకంజ్ఞానం అయ్యింది । జ్ఞానికి విద్వత్సంన్యాసి అనవలెను। వానికి కర్మంది స్వీకారంలేదు । త్యాగంలేదు । యిలాగుననీవు వుండుమని । అర్జునునికి భగవంతుడు చెప్పినాడు । నీవు ఆశంకచేశినావు అదివ్యర్థం । మరిజ్ఞానిచూపుయట్లా ॥ **"విద్యావినయసంపన్నె బ్రాహ్మణేగవిహస్తిని । శునీ చైవశ్వపాకేచ పండితాస్సమదర్శనః** ॥ విద్యావినయ సంపన్నం బ్రాహ్మణం । గౌ । ఆవు । హస్తి యెనుగు । శుని కుక్క । శ్వపాకేచ శ్వపచుండు । అందరు జగత్తులో వొక్క ఆత్మనేచూస్తాడు ॥

**"సర్వ భూతస్థ ఆత్మానం। సర్వభూతాని చాత్మని యీక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనం"** సర్వభూతంలో ఆత్మను చూస్తాడు । సర్వభూతాలు ఆత్మలో చూస్తాడు । యిట్లా యెవ్వరు వున్నారు । తనమనస్సు ఆత్మస్వరూపంలో అయిక్యం చేశి । సమమె చూస్తాడు । యిట్లా యెవ్వరు వున్నారు జ్ఞాని । వాడే । సన్యాసి గృహస్థా శ్రమంవుండగాను వాడు సన్యాసి । నాలుగు వర్ణాలు నాలుగు ఆశ్రమాలు। దేహానకు । ఆత్మకుయెమీలేదు । ఆత్మచైతన్య ఘనం। పరిపూర్ణం । ఆత్మదేవున్నాడు । యిట్లా భగవం తుడు చెప్పినాడు । యిది అయిదో అధ్యాయంలో సారాంశజ్ఞానం యిదినిశ్చయం ఇతీ శ్రీ జీవన్ముక్తకృత సన్యాస కర్మవివరణం ॥

౫౧ శ్రీ॥ ఆరోఅధ్యాయంలో భగవంతుడు యోగాలు చెప్పినాడు ॥ బహువిధయోగాలు చెప్పినాడు । ముందుకర్మయోగం చెప్పినాడు "॥ శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతియః ససన్యాసీచయోగీచననిరగ్నిర్నచాక్రియః ॥ వర్ణాశ్రమానకు విహితం। సత్కర్మాచరణం చయ్యవలెను । కర్త తనందిఅహంకారం ఫలాశ । రెండుత్యాగం చెయ్యవలెను । యిట్లాయవ్వడు చేస్తాడు । వాడేసన్యాసి । వాడే కర్మయోగి । ఫలత్యాగంచాత కర్మ క్షయం అవుచుంది । వానికి ఆత్మ జ్ఞానం అయ్యిముక్తుడు అవుచున్నాడు । అష్టాంగయోగం యెవ్వడుచేస్తాడు । వాడేముక్తుడు। అవుచున్నాడు । అష్ట యోగాలు । అష్ట యోగం యట్లా చేస్తారు । యమం । నియమం। ఆసనం । ప్రాణాయానము । ప్రత్యాహారం । ధారణం । ధ్యానం ।సమాధి ॥ దీని పేరు అష్ట యోగం । యమమంటెను యింద్రియనిగ్రహం । నియమంటెను మనస్సు నిగ్రహం। ఆసనం అంటెను అధిష్ఠానంలో మనస్సు స్థిరంచే శెది । ప్రాణాయామంఅంటెను। ప్రణవంచెశేది। ప్రత్యాహారం అంటెను । సకలవృత్తి అంతర్ముఖం చెశేది। ధారణం అంటెను। మనోవృత్తితోటి చైతన్య స్వరూపం ధారణం పట్టెది। ధ్యాన్నం అంటెను। ఆచైతన్య స్వరూపమేనేను। అని యిట్లా చూచెది। సమాధి అంటెను వృత్తి చైతన్య స్వరూపంలో సమరసం చెశేది। యీ అష్టయోగం యవ్వరు చేస్తారు వారికి బ్రహ్మసాయుజ్యం అవుచుంది। దాని మీద జ్ఞానయోగం చెప్పినాడు॥శ్లో॥ **"ఉద్ధరేదాత్మ నాత్మానం। జితాత్మనః ప్రశాంతస్య। పరమాత్మాస మాహితః"**। జ్ఞానంచాత। స్థూలసూక్ష్మ కారణ దేహత్రయనిరసనం చేశి మిగిలింది చైతన్య స్వరూపం। అదే తాను। యిట్లాయెరిగి మనుస్సు ఆ చైతన్య స్వరూపంలో వుంచినారు। ఆచైతన్య స్వరూపమేపూర్ణ బ్రహ్మం। పరమాత్మ। యిట్లాయెరింగి। ఆస్వరూపంలో సమరసం అయ్యి। పోయినాడు। వానికి బ్రహ్మసాయుజ్యం అయ్యింది। మరిప్రాణాపాన యోగం చెప్పినాడు॥శ్లో॥ **"సమంకాయ శిరోగ్రీవంధార యంన చలస్ఫురన్। సంప్రేక్షనాసి కాగ్రస్థది నశ్చనవలోకయన్"**॥ యేకాంత్తస్థానంలో। వజ్రాసనం వేశిప్రాణాపాన యోగంచేశి షట్చక్రాలు భేదించ్చి సహస్ర దళంలో పోచాడు। స్వయంజ్యోతి ప్రకాశవున్నాది। అందుట్లో కలిశిపోచాడు। యిది వొఘుసాధనం కొందరు చేస్తారు। దాని మీద ఉపరమయోగం చెప్పినాడు॥శ్లో॥ **"యుక్తా హారవిహారస్య। యుక్త చెష్టస్యకర్మసు।"** యింద్రియాల యుక్తాయుక్తముచాత శాంతము చేశి। సకలవృత్తి అంతర్ముఖం చేశినాడు। మనుస్సులో

కలిశినావి। మనుస్సు చైతన్య స్వరూపంలో వుంచినారు। దానిపేరు ఉపరమయోగం ॥శ్లో॥ **"యత్రో పరమతెచిత్తం నిరుద్ధం యోగసేవయా। యత్రచైవానాత్మానం పశ్యన్నాత్మనిరుధ్యతి॥"** యిట్లా చెప్పినాడు। ఉపరమవృత్తి చాత తన ఆత్మస్వరూపం చాతను చూచి సంత్తోషపడు చున్నాడు। వానికి అదేప్రాప్తి॥దాని మీద వైరాగ్యయోగం చెప్పినాడు ॥శ్లో॥ **"సంకల్ప ప్రభవాకర్మాన్త్యక్త్వా సర్వాన శేషతః॥"** వైరాగ్యము చాత సకలమనుస్సుది కామ్యంవిడచిపెట్టి మనుస్సు చైతన్య స్వరూపంలో వుంచేది ॥శ్లో॥ **"శనైశ్శ నైరుపరమె బుధ్యాత్వతి గృహీతయా। ఆత్మసంస్థం మనకృత్వా నకించ్చి దపిచింతయెత్"**॥ బుద్ధి ధైర్యంచాత మనుస్సు ఆవరించి । ఆత్మస్వరూపంలో వుంచ్చి సదాసర్వదా ఆత్మచింతనం చెయ్యవలెను। మరేమి చింతనం చెయ్యరాదు। ఆత్మచింతనం చాత అదే అయిపోచారు। యిదివొక్క యోగం। దాని మీద భక్తి యోగం చెప్పినాడు॥శ్లో॥ **"యోమాంపశ్యతి సర్వత్ర సర్వం చమయిపశ్యతి॥"** నేను పరమాత్మ॥ నాకు సర్వత్ర జగత్తులో చూస్తారు। సర్వ జగత్తు నాలో చూస్తారు। యిట్లా అద్వైత భక్తి యవ్వరు చెస్తారో వారికి ఆత్మజ్ఞానం అవుచుంది। ఆ పరమాత్మ స్వరూపంమేనేను వున్నాను। యిట్లా భక్తి చాతమా స్వరూపంలో కలిశిపొచారు। వారికి అదే ప్రాప్తి । దాని పేరు భక్తి యోగం। అషువంటి నానా విధయోగాలు। ఆరో అధ్యాయంలో చెప్పినాడు। మరి అర్జునుడుశంకచేశినాడు। మనుస్సు చంచలం వున్నాది। యీయోగాలు యట్లా అవుచుందిఅనంగాను। మరి భగవంతుడు చెప్పుచున్నాడు॥శ్లో॥ **"అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యంనచముహ్యాతె ॥"** వైరాగ్యంచాత నిజధ్యాసంచాత మనుస్సు ఆవరించవలెను। యిట్లా అభ్యాసంచాయంగా చాయంగా మనుస్సు స్వరూపంలో నిశ్చయం అయ్యి। మరి అర్జునుడు శంకచేశినాడు। యోగంపూర్ణం గాక శరీరానకు మరణం వస్తెను వానికి ముందరయేమి గతి। వానికి భగవంతుడు చెప్పుచున్నాడు। వొక్క జన్మం అయ్యి ఆ జన్మం యందరివద్ద అవుచుంది అంటెను॥శ్లో॥ **"శుచీనాం శ్రీ మతాంగేహె యోగభ్రష్టోభి జా యతే। అథవా యోగినామేవకులె భవతి ధీమతాం"** ॥ ఆయోగభ్రష్టు శుచిష్మంతు॥ శ్రీమంతువారి గర్భమందు జన్మ మవుచుంది। లేకుంటె జ్ఞానయోగియందు జన్మమవుచుంది। పూర్వ జన్మంలో యేమియోగాభ్యాసం చేశినారు। ఆబుద్ధి యీ జన్మంలో పుట్టుచుంది। అదే తిరిగీ అభ్యాసం చేస్తారు। యీ అభ్యాసంచాత। దేహ బుద్ధి దేహాహంకారం త్యాగం చేశి అంతర్ముఖులయ్యి చైతన్య స్వరూపంలోకలిశిపోతాడు। వాడు పరమయోగి ॥శ్లో॥ **"తపస్విభ్యోధికో యోగి। జ్ఞానిభ్యోపి మతోధికః। కర్మభ్యశ్చాధి కోయోగి తస్మాద్యోగీ భవార్జునా॥"** కర్మమటుమంది తపస్వి శబ్దజ్ఞాని। యీ సకలంనుంచి ఆయోగి। అధికం శ్రేష్టం। యట్లాను శ్రేష్ఠం అంటెను। కర్మికి కర్మాభిమానం వున్నాది। తపస్వికి తపాభిమానం వున్నాది। శబ్దజ్ఞానికి జ్ఞానాభిమానం వున్నాది। యక్కడ అభిమానం వున్నాదో అక్కడ అవిద్యావున్నాది। యవ్వరికి అవిద్యా నిరసనం అయ్యిందో సకల అభిమానం పొయ్యింది। చైతన్య స్వరూపంలో సమరసం అయ్యిపోయినాడు। వాడే పరమయోగి। యిందుకోసానకు అర్జునునికి అంచున్నాడు। నీవుయిట్లా అయ్యివుండుమని। భగవంతుడు చెప్పినాడు। ఆరోఅధ్యాయంలో భగవంత్తుడు చెప్పినాడు। యిది ఆరో అధ్యాయంలో సారాంశం ॥ ఇతీ శ్రీజీవన్ముక్తకృత యోగవివరణం॥

౧౧.౨ శ్రీ॥భగవంత్తునికి అర్జునుడు అడిగినాడు। విశ్వరూపం చూపించమన్నాడు। ఆవ్యాళ్ల భగవంతుడు విశ్వరూపంచూపినాడు। విశ్వరూపం అంటెనుయేమి। మాయా అవిద్యారహితం। చిన్మాత్రం చైతన్యఘనం స్వయం జ్యోతి స్వయం ప్రకాశం। ఆద్యంతరహితం। కేవలపరబ్రహ్మం। దానికే విశ్వరూపం అనవలెను। అదే పరబ్రహ్మ స్వరూపం అనవలెను। శ్రీకృష్ణునిది నిజస్వరూపం। అర్జునుని మనుస్సుకోసానకు మూర్తి మాయా అకారంచాత చూపించినాడు। ముందు చూచిసంతోషం అయ్యింది। వుగ్రరూపం భయంకరం చూచి అర్జునునికి భయం అయ్యింది। అవిశ్వరూపానకు నమస్కారం చేశినాడు। మరి అర్జునుడు అంచాడు। నాకుభయం శానా అయ్యింది యీా విశ్వరూపంచాలించ్చు। కృష్ణరూపమూర్తి చూపిస్తే నాకు సమాధానం అవుచుంది। ఆ వేళ్ల భగవంతుడు విశ్వరూపంచాలించి తిరిగీ కృష్ణ రూపం అయ్యినాడు। మరి భగవంతుడు అర్జునునికి। అంచున్నాడు। నీ చిత్త వృత్తి విశ్వరూపంలో వుంచ్చి కృష్ణరూపమూర్తికి। భజనం చెయ్యుమా। విశ్వరూపం కేవల బ్రహ్మం । అయ్యింది। యేసాధన చాతా ప్రాప్తి గాదు। మా కృప యవ్వరి మీద అవుచుంది। వారికి విశ్వరూపం ప్రాప్తి అవుచుంది। విశ్వరూపం పేరు కేవల చైతన్యం॥శ్లో॥ **"నాహంవెదైర్నతవసాన దానేననచెజ్యయా। శక్యంయెవంవిధోదష్టు। దృష్టవాన సిమాంయధా"॥** ఆస్వరూపప్రాప్తి వేదాధ్యయనం చాత గాదు। తపస్సు చాతను మాస్వరూపప్రాప్తిగాదు। దానంచాత మా స్వరూప ప్రాప్తి గాదు। యజ్ఞంచాత మా స్వరూప ప్రాప్తిగాదు। మాకృప యవ్వరి మీద అవుచుంది వారికే స్వరూపప్రాప్తి అవుచుంది। నీ మీద మా కృప అయ్యింది। యిందు కోసానకు నీకువిశ్వరూపం చూపించినాము। మాకృప యవ్వరిమీద అవుచుంది। మా అనన్య భక్తి యవ్వరు చెస్తూవున్నారు। వారి మీద అవుచుంది ॥శ్లో॥ **"భక్త్యాత్వనన్యయశక్య అహమెవం విదోర్జనా। జ్ఞాతుంద్రష్టుచతత్వేన। ప్రవిష్టం చపరం తప॥"** అనన్యభక్తి అంటెను। యెమి। తరంగం యట్లాసముద్రంతోటి అభిన్నం వున్నాదో । అలంకారంయట్లా బంగారంతోటి అభిన్నం వుంన్నాదో। అట్లాయవ్వరు దేహత్రయం నిరసనం చేశి దేహాహంకారం విడిచిపెట్టి దేహత్రయాతీతం శుద్ధ చైతన్యం । అదేనేను। అనియిట్లా తెలిశి సచ్చిదానంద పరిపూర్ణం బ్రహ్మం। అదే నేను సాక్షిరూపచైతన్యం। యట్లా పరబ్రహ్మం । ప్రత్యక్చైతన్యం ఐక్యం తోటి। యవ్వరువున్నారో। వారికేఅనన్యం అనవలెను॥ **"నచాహంబ్రంహ్మణఃపృథక్"**। పరబ్రహ్మమేనేను వున్నాను। యిట్లా తనకు పరబ్రహ్మతో అయిక్యంచూచేది। అనన్యం । భక్తి అంటెనుయేమి। గంగయట్లా సముద్రంలో అయిక్యమయ్యింది। అట్లా బాహ్యవృత్తి అంతరవృత్తి అంతర్ముఖం చేశి యెకాగ్రంచేశి। ఆచైతన్య బ్రహ్మస్వరూపంలో కలిశిపోయింది। దానిపేరు భక్తి । చైతన్యస్వరూపంతోటి వుండేది భక్తి। యిా భక్తి చాత సర్వభూతంలో బ్రహ్మవేచూస్తారు। సర్వజగత్తు సహితం। తానుపరబ్రహ్మమెవున్నాది। యిట్లా జ్ఞానం చాత తెలిస్తె। ఆన్వయంప్రకాశఘన పరబ్రహ్మస్వరూపమును చూస్తాడు। స్వరూపంలో సమరసం అయ్యిపోచాడు। వానికిమాప్రాప్తి

అయ్యింది। ప్రారబ్ధ శేషం తోటి శెరీరం బ్రతికెవున్నాది। అదేహేంద్రియాల తోటి మాభజనం చేస్తారు ॥శ్లో॥ **"మత్కర్మకృన్మత్పరమో। మద్భక్తః సంగవర్జితః। నిర్వైరస్సర్వ భూతేషు యస్సమామేతిపాండవ"** ॥ అర్థ ॥ మత్కర్మ అంటెను। మనుస్సుతోటి మాధ్యాన్నం। చెయ్యవలెను। వాక్యంతోటి మానామస్మరణం చెయ్యవలెను। జిహ్వాతోటి మాతీర్థప్రాశనం చాయవలెను । నేత్రం తోటి మావిగ్రహానకు చూడవలెను । హస్తంతోటి మాపూజనం చెయ్యవలెను। పాదాలతోటి మాయాత్రకు రావలెను। సర్వాంగంతోటి మాకు సాష్టాంగ నమస్సు చెయ్యవలెను । ప్రేమచాత మాకీర్తన మేచాయవలెను । రాత్రింబగళ్లు సదాసార్వకాలం మాభజన యందేవుండవలెను। దీనిపేరుమత్కర్మం। యీ ప్రకారముగా జ్ఞానమానవులు చేస్తారు। వారికి ఫలాశయెమీ లేదు। నేనేవానిది పరమఫలము।**"సంగవర్జితః"** లేదు। సర్వ భూతాంత్తర్యామిత్వంలో మమ్ములను శేవిస్తున్నాడు। యవ్వరితోటి వైరంలేదు। అషువంటి కేవల జ్ఞానిభక్తుడు । వానికి మాస్వరూపప్రాప్తి అవుచుంది। యిట్లా భగవంతుడు అర్జునునికి చెప్పుచున్నాడు। యిది ఏకాదశాధ్యాయంలో సారాంశం యిది నిశ్చయం॥ ఇతిశ్రీజీవన్ముక్తకృత విశ్వరూపసందర్శన వివరణం॥

౫౩ శ్రీ॥ భగవంత్తుడు పంన్నెండో అధ్యాంలో అర్జునునికి చెప్పినాడు। అర్జునుడు ప్రశ్న చేశినాడు। నిర్గుణం నిరాకారం నిరాభాసచైతన్య పరబ్రహ్మం అదేవిశ్వరూపం। అక్కడ మనుస్సు వుంచుమా। కృష్ణమూర్తికి బాహ్యభజనం చెయ్యుమని భగవంతుడు అన్నాడు। అందుకు అర్జునుడు అన్నాడు। నిర్గుణం బ్రహ్మమునీవే। సగుణ బ్రహ్మమునీవే। యక్కడ భజనంచేస్తె నీదె ఆయను। సగుణ నిర్గుణ భక్తి చేశెటివాడు అపరోక్ష జ్ఞానముచాత నిర్గుణ బ్రహ్మంను యెరిగి। యింద్రియంప్రాణం మనుస్సు నిరోధనం చేశి నిర్గుణ బ్రహ్మంజ్యోతి స్వరూపం ఆ స్వరూపంలో మనుస్సు వుంచుతున్నారు। వారికి ప్రాప్తి సులభం చాత అవుచుంది। పరోక్ష జ్ఞానం లేదు। నిర్గుణానిర్గుణ బ్రహ్మంను యెరుగడు। యిందుకునీసగుణ మూర్తి చతుర్భుజంపీతాంబరధారి। నీలవర్ణం మకుటకుండనాలు। వనమాల। కమల నయనం। శంఖచక్రగదాపద్మధారి వైనషువంటి । సుందర నీమూర్తి ధ్యానం చేస్తారు। నీనామస్మరణం కథావర్తన కీర్తనం పూజనంచేస్తారు। అషువంటి భక్తులకు ప్రాప్తిసులభముగా అవుచుంది అని యిట్లా ప్రశ్నంచేశినాడు। ॥శ్లో॥ **"ఏవంసతతయుక్తా యేభక్త స్త్వాంపర్యుపాసతే। యచ్చాప్యక్షరమవ్యక్తం। తేషాంకెయోగవిత్తమః"** । యీ మాట కు భగవంతుడు అంచాడు॥ **"మాయ్యావేశ్యమనోయెమాం నిత్యయుక్తఉపాసతే । శ్రద్ధ యాపరయోపేత। స్తమేయుక్తత మామత"**॥ భగవంతుడు అంచాడు। నాది చతుర్భుజమూర్తిలో మనుస్సు వుంచ్చి। శ్రద్ధాయుక్తం అయ్యి। మాభజనం చేస్తారు। వానికిసులభంచాత మాస్వరూపంప్రాప్తి అవుచుంది। యట్లా యట్లాను అవుచుంది। అది చెప్పుచున్నా। సగుణధ్యాన్నంచాత నామస్మరణం చాత। వానిచిత్తం నిర్మలమవుచుంది। వానిమీద నాకృప అవుచుంది। నాకృప చాత జ్ఞానంవానికే ఉత్పత్తి అవుచుంది। జ్ఞానం చాత అవిద్యానిరసనం అవుచుంది । మరి అవిద్యానిరసనం అయితెవాడు మాస్వరూపంలో

అయిక్యంఅయితె మాప్రాప్తి సులభంచాత అయింది। యిందుకోసానకు భక్తి చాతమాప్రాప్తి సులభంగా అవుచుంది। కష్టం యెమీలేదు । అపరోక్షం చాతనిర్గుణం ఉపాసన చేస్తారు। వారికేకష్టం । యట్లాయట్లా। కష్టం అంటె యేకాంత స్థానంలో కూర్చుండవలెను। ఆసనం చెయ్యవలెను। ఆహారంజయం చెయ్యవలెను। యింద్రియజయం చెయ్యవలెను। మనుస్సునిగ్రహం చెయ్యవలెను రేచకపూరక కుంభకంతోటి ప్రాణజయం చెయ్యవలెను। షట్చక్రం భేదించవలెను। సహస్రదళంలోకి పోవలెను। ఆవేళ్లజ్యోతిరూపంలో కలుస్తున్నాడు। అషువంటి కష్టంతోటె వానికి ప్రాప్తి అవుచుంది। దానినుంచి మాసగుణభక్తి మేలు। అతిసులభోపాయం। ఆనందంచాత సగుణ భక్తి చాయంగాను అనాయాసంచాత వానికేబ్రహ్మస్థితి ప్రాప్తి అవుచుంది ॥శ్లో॥ **"శ్రేయో విజ్ఞానమభ్యాసం జ్ఞానాధ్యానం విశిష్యతే । ధ్యానాత్కర్మ ఫలత్యాగం త్యాగాచ్ఛాంతి రనంతరం"** ॥ అభ్యాసం అంటెను మాభజనంపేరు। భజనంచాత జ్ఞానంప్రాప్తి అవుచుంది। జ్ఞానంచాత ధ్యాన్నం అవుచుంది। ధ్యానం అంటెనుబ్రహ్మనిష్ఠ। ధ్యానం చాతకర్మఫల త్యాగం అవుచుంది। ఫలత్యాగం చాత శాంతి అవుచుంది। శాంతి అంటెను యెమి। అవిద్యానిరసనం। అంతపొయ్యేది। శాంత్తి చాత బ్రహ్మస్థితి అవుచుంది। బ్రహ్మస్థితి అయితె వానికి లక్షణం యేమి॥ **"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ మేవచ। నిర్మమోనిరహంకారోసమదుఃఖ సుఖక్షమీ"** ॥అంటెను। సర్వభూతంలోను సమభావం అవుచుంది। యెవ్వరికీ ద్వేషం లేదు। సర్వభూతాలయందుకరుణ। నిర్మమోనిరహంకారం। సుఖదుఃఖ। యిది సమానం। క్షమావంత్తుడు। సదాసర్వదా। సంతోష రూపుడు। బ్రహ్మానందం చాత వుంచాడు। యవ్వరికీ స్తుతిలేదు। యిట్లాలక్షణాలు నిందాలేదు। మానం అవమానం। దిద్వైత భాసంలేదు। యీలాగున నానావిధాలు శానావున్నావి। అషువంటి జ్ఞాని బ్రహ్మస్థితి వంతుడు। మాభజనం చేస్తాడు। వాడు। **"భక్తిమన్మే ప్రియోనరః"**। జ్ఞాని వుండంగా సగుణభజనం అత్యాదరం చాత చేస్తాడు॥ యట్లా యట్లాచెస్తాడు। మాసగుణమూర్తిని మనుస్సులో చింతించి నమస్కారం చేస్తాడు। బాహ్యావిగ్రహం పూజ చెశి నమస్కారం చేస్తున్నాడు। ఆనందంచాత కీర్తనం చేస్తున్నాడు। కీర్తనంలో నృత్యం చెస్తున్నాడు। సాధుసంతుల పాదాలమీద మస్తకం వుంచి నమస్కారం చేస్తున్నాడు। విగ్రహానకు సాష్టాంగనమస్కారం చేస్తున్నాడు। బ్రాహ్మణభోజనం। బ్రాహ్మణ భక్తి చేస్తాడు। సర్వ జగత్తుకు భగవద్భజనం చేస్తున్నాడు। అషువంటి కేవల భక్తుడు। అంతరమందు అఖండైకరసబ్రహ్మంచాత వుంచున్నాడు। అషువంటి నిజభక్తునిమీద మాప్రీతి శానావుంచుంది। యిందుకోసానకు। యోగాభ్యాసం నుంచి మాభక్తి సులభం। సులభం చాత మాప్రాప్తి అవుచుంది। యీలాగున భగవంతుడు పంన్నెండో అధ్యాయంలో భక్తి సారాంశం చెప్పినాడు ॥ ఇతి శ్రీజీవన్ముక్త కృతద్వాదశాధ్యాయ గీతాసారాంశం ॥

౧౪ శ్రీ పధ్నాల్గో అధ్యాయంలో అర్జునుడు ప్రశ్న చేశినాడు ॥ అర్జున ఉవాచ। " **కైర్లింగైస్త్రీ గుణానేతా । నతీతోభవతి ప్రభో । కిమాచారః కథంచైతాం స్త్రీన్గుణా । నతివర్తతే** ॥ గుణాతీతం

బోధ అయితె । వాడు గుణాతీతబ్రహ్మం అయినాడు । వాని దేహత్రయంలో గుణత్రయం వున్నాది। గుణత్రయంవుంటె। గుణక్రియయింద్రియాల తోటి అవుచుంది। ఆజ్ఞా గుణాతీతం। అయితె। వానిది లక్షణం। యెమో। వానిది లక్షణం అయ్యింది యట్లా యరుగవలెను। ఆలక్షణం నాకు చెప్పుమా। గుణాతీతం అయ్యినారు। ఆవానిది ఆచారం యేమి। గుణాల్లోవుండి గుణాతీతం యట్లాను। యీలక్షణంమాకు చెప్పమని యిట్లా ప్రశ్నచేశినాడు । శ్రీ భగవానువాచ ॥

**"ప్రకాశంచప్రవృత్తించ్చ మోహమేవచ పాండవా నద్వేష్టి స్సంప్రవృత్తాని । ననివృత్తానికాంక్షతి"॥**

ప్రకాశంచ అంటెను । విద్యాపేరు । యెవెళ్ల సత్వగుణంమనుస్సులేస్తుంది ఆవేళ్లరజో గుణంతమోగుణం లేకుండా అవుచుంది । అంత్తర్బాహ్యం అంతాన్ను । సత్వగుణమె అవుచుంది। సత్వగుణం చాత బుద్ధికి ప్రకాశం అవుచుంది విద్యాచాతుర్యం వస్తుంది । పదపదార్థముది అర్థము తెల్లమిగాలెస్స తెలుస్తుంది। చెప్పచున్నారు । సర్వయింద్రియాలతొటి సాత్వికకర్మం చేస్తున్నారు । కర్మ జ్ఞానంకుశలబుద్ధి చాత చెప్పచున్నారు । యిట్లా జ్ఞానంప్రకాశమవుచుంది। కర్మ జ్ఞానం । ఉపానన జ్ఞానం । యోగ జ్ఞానం । బ్రహ్మ జ్ఞానం । ప్రకాశ మవుచుంది । యిది సత్వగుణందికార్యం ॥ యెవేళ్లమనుస్సులో రజోగుణం లేస్తుంది । ఆవేళ్లనత్వగుణం తమోగుణం లేకుండా అవుచుంది। రజోగుణ:చాతకర్మ ప్రవృత్తి అంత్తా అవుచుంది । నిత్యనైమిత్తికకర్మం । కామ్యకర్మం । యింద్రియాల తోటి అవుచుంది । యిది రజోగుణ కార్యం ॥ యేవెళ్లతమోగుణం లెస్తుంది । ఆవేళ్లసత్వగుణం రజోగుణం రెండు లేకుండాను అవుచుంది । మనుస్సు యింద్రియాల తోటి నిషిద్ధకర్మం అవుచుంది । ఆలస్యం అవుచుంది అసావధతనం అవుచుంది। నిద్రవస్తుంది । జడత్వం అవుచుంది।బుద్ధికియె మీసూచనగాకవుంచుంది । మోహాభ్రాంతి అవుచుంది । యిదితమోగుణకార్యం । యిట్లానుత్రిగుణం । కార్యం సకల జీవులలో అవుచుంది। జ్ఞానికి అజ్ఞాన గుణాకార శరీరంనిరసనం అయ్యింది । పరంతుదేహద్వయం వున్నాది । ప్రారబ్ద శేషంవున్నాది । అంతపరియంతరం । యిదేహద్వయంలో త్రిగుణ కార్యం అయ్యేది అవుచుంది। అక్కడ జ్ఞానికి దేహద్వయసంమంధం లేదు । గుణ కార్య సంమంధం లేదు । జ్ఞాని శుద్ధ చైతన్యం వున్నాడు । అక్కడగుణాలు లేవు । గుణకార్యం లేదు । యిది దేహద్వయంగుణ కార్యం । యిది మాయామయం । మిధ్యా । యిట్లా జ్ఞానికి తెలిశింది । యిందుకోసానకు గుణ కర్మంది అభిమానం జ్ఞానికి లేదు । సత్వగుణంచాత । విద్యా ప్రకాశం అయితె జ్ఞానికి విద్యాభిమానంలేదు । రజోగుణం చాతప్రవృత్తి అయితె । జ్ఞానికి కర్మాభిమానంలేదు । తమోగుణం చాత మోహజడత్వం అయితె జ్ఞానికి మోహాభిమానంలేదు । అక్కడ త్రిగుణకర్మం లేకుండా చెయ్యవలెనన్న అపేక్ష లేదు । సత్వగుణం చాత విద్యా ప్రకాశం అయితె తనచైతన్య స్వరూపం యెమీలేదు రజోగుణంచాత । కర్మప్రవృత్తి అయితె తన ఆత్మస్వరూపంలో యేమీ లేదు । తమోగుణం చాత జడత్వంవస్తే ఆత్మస్వరూపంలో యెమీలేదు । ఆత్రిగుణకర్మంది నిరననం చెయ్యవలెనన్న అపేక్షలేదు । దేహద్వయంమాయామయం । త్రిగుణకర్మ మాత్రం। మాయామయం మిధ్యాభాస చైతన్యం స్వరూపంలో । యెమీలేదు చైతన్య స్వరూపం

గుణాతీతం । అక్కడ వేద శాస్త్ర విద్యాయెమీలేదు । కర్మ ధర్మం యెమీలేదు। జడత్వం లేదు। నిష్కర్మ జ్ఞాన రూపం । ప్రకాశరూపం । ఆనందరూపం । ఆద్యంతమధ్యరహితం। చిదాకాశం । చిన్మయం । చైతన్య ఘనం । పరిపూర్ణం వున్నాది । యిట్లా తన స్వరూపం యెరింగి । స్వరూపస్థితి చాతవుంచాడు । ॥ శ్లో॥ **"ఉదాసీనవదాసీనోగుణైర్యోనవి చాల్యతే। గుణాగుణే షువర్తంతే యోవతిష్ఠతి నెంగతే"** ॥ వుదాసీనవంతుడు॥ త్రిగుణకర్మం లో వున్నాడు। అత్రిగుణాతికి ఆత్మస్థితికి। చలనం లేదు। నిశ్చలంగా స్వరూపంలో వున్నాడు। చలనం యట్లాలేదు సత్వగుణం చాత విద్యా అయితె। అభిమానంలేదు। రజోగుణంచాత కర్మ ప్రవృత్తి అయితె। కర్మాభిమానం లేదు। తమోగుణం చాత జడత్వం వస్తే । జడాభిమానంలేదు। తనస్వరూప స్థితి తోటితాను వున్నాడు। యిట్లా జ్ఞాని లక్షణం। వాని ఆచారం యట్లాను। అని అడిగినావు ॥శ్లో॥ **"సమదుఃఖసుఖ స్వస్థః సమలోష్టాశ్మకాంచనః । తుల్యప్రియాప్రియోధీరః తుల్యనిందాత్మసంస్తుతిః। మానవమా నయోస్తుల్యోతుంల్యో మిత్రారిపక్షయోః । సర్వారంభపరిత్యాగీ। గుణాతీతస్స ఉచ్యతే"** ॥ జ్ఞాని పురుషునిది। ఆచారంప్రారబ్ధంచాత। అన్నవస్త్రాదికంలేకుండా అయ్యింది। దానిది దుఃఖం లేదు। ప్రారబ్ధంచాత అన్నవస్త్రాదికం సౌఖ్యం అయ్యింది। దానిదిహర్షంలేదు। లేనిదిదుఃఖంలేదు । తాను శరీరమెకాను। శరీరంకుసుఖదుఃఖం అయితె దానిది హర్షం విషాదం లేదు। యందుకు లేదు। తనస్వరూపస్థితి చాత తానువుంచాడు। అషువంటివానికి। లోష్ఠం అంటెనుయినుము। కాంచనం అంటెను బంగారం। యిది వానికి సమానం। యెవ్వరు సన్మానంచేస్తె దేహానకు చేశినారు। తనకు యెమీలేదు। తనస్వరూపంకేవలచిన్మాత్రం। చైతన్యం। దానికియెవ్వరూ సన్మానం చెయ్యరు। యిందుకోసానకు మానావమానందిహర్ష విషాదం యెమీలేదు। యవ్వరు తనతోటి మితృత్వం చేశినారు । యెవ్వరువైరత్వం చేశినారు । మిత్రత్వం వైరత్వం దేహానకు। చేశినారు। పరంత్తు తనస్వరూపానకు। యెమీలేదు। దేహంమాయామయం। మిథ్యావున్నాది। దానిది మిత్రత్వం మిథ్యా। వైరత్వం మిథ్యా। యిందుకోసానకు హర్షవిషాదంలేదు। మరితాను నిష్కర్మం। యక్కడాయెమీలేదు। నిరాభాసచైతన్యం। దానికి వర్ణాశ్రమకర్మం యక్కడా యెమీలేదు। యిందు కోసానకు । సర్వారంభపరిత్యాగం । యెమైనా చెయ్యవలెనన్న సంకల్పమెలేదు । అషువంటి జ్ఞానివున్నాడు। వానికి గుణాతీతం అనవలెను। యిదె గుణాతీతం। ఆచరణం। యీలక్షణంనుంచి గుణాతీతంవున్నాడు। అనితెలుసుకొనవలెను। యిట్లాను భగవంతుడు అర్జునునికి చెప్పినాడు యిది నిశ్చయం। ఇతి శ్రీజీవన్ముక్త కృతగుణాతీత వివరణం॥

**ఇది జీవన్ముక్త సారాంశజ్ఞానము**

**- :: సమాప్తము :: -**



## - (ఫీల్ఖానాశంకరప్రభుచేసిన వేదాంతవిచారవిమర్శ) -
## మాయాస్వరూపం.

ఆ-స్వయంప్ర-కాశబ్రహ్మంలో - అహంస్ఫురణ అయింది - ఆస్ఫురణపేరుమాయ-అంతఃకరణ, దీనిపేరే అవిద్య, ఆబ్రహ్మం - బంధమోక్షాలులేనిది, ఆమాయ పేరే జ్ఞానం, చిచ్ఛక్తి - చిత్కళా - బ్రహ్మకళా, సర్వార్థదాత్రిసావిత్రీ సచ్చిదానందరూపిణీ అనివున్నది కనుక సచ్చిదానందంయిదే = ఇది అనాది, యిదిమిథ్యగనుక దీనికి ఆదిలేదు, తల్లిదండ్రులు లేరు, యీజ్ఞానంపేరేస్మరణ, యీస్మరణకింద విస్మరణపుట్టింది. ఆవి స్మరణపేరుఅజ్ఞానం, యీస్ఫురణధ్వనిరూపం, అర్థమాత్ర, యిరువైఅయిదోతత్వం, శుద్ధ సత్వాహంకారం, సర్వసాక్షిణ్యవస్థా - ఈశ్వరుడభిమాని, అక్షరస్వరూపం.

### ౨. ఈశ్వరరూపం.

ఆమాయాయుక్త చైతన్యం పేరు ఈశ్వరుడు, ఇతనికి సర్వ జ్ఞత్వం, సర్వసాక్షిత్వం, సర్వప్రకాశత్వం, సర్వవ్యాపకత్వం సర్వనియంతృత్వంవున్నాది, యీమాయా, త్యాగంచేస్తే ఆచైతన్యానకు ఈశ్వరత్వంలేదు.

### ౩. జీవస్వరూపం.

ఆ-అవిద్యాయుక్త చైతన్యం పేరు జీవుడు, యితనికి, కించిజ్జత్వం, అవస్థాత్రయ సాక్షిత్వం, అవస్థాత్రయంలో వ్యాపకత్రయం - అవస్థాత్రయానకు ప్రకాశత్వంవున్నాది. యితనికిదేహత్రయ తాదాత్మ్యంఅయింది. యీతాదాత్మ్యంపేరు బంధనం, యీబంధనం విచారముచేత పోతుంది, పోతే, దాని పేరు మోక్షం, దేహత్రయతాదాత్మ్యంచేత బద్ధత అనిపిస్తుంది గాని జీవునిస్వరూపంచిన్మాత్రం, చిదాకాశం అక్కడదేహతదాత్మ్యంవున్నను దేహతాదాత్మ్యం లేదు, తనస్వరూపవిచారము చేతదేహతాదాత్మ్యంపోతుంది, దానిపేరుమోక్షం, చైతన్యానకుబద్ధత్వంలేదు, ముక్తత్వంలేదు, బంధంమోక్షంకల్పనామాత్రం జీవస్వరూపంలో యేమీలేదు, అతనిస్వరూపం స్వప్రకాశం, చిద్రూపం, కేవలచైతన్యం, బ్రహ్మవున్నది, అక్కడయే కల్పనాలేదు, యితని అవిద్యాత్యాగంచేస్తే, ఆచైతన్యానకుజీవత్వం లేదు, సూక్ష్మదేహద్వయ మూల మంతఃకరణ, దానిపేరుహృదయం, దానిలోపలతనస్వరూపం స్వప్రకాశం, చిద్రూపం ఆనందరూపం, సచ్చిదానందబ్రహ్మం, పరిపూర్ణం చైతన్యఘనం, చిదాకాశం, చిన్మాత్రం, అవినాశం, నిర్వికారంఅసంగం, తన స్వరూపంవున్నది, యిట్లాయెరిగిదేహాభిమానం విడిచిపెట్టవలెను, వర్ణాభిమాన-ఆశ్రమాభిమాన-కర్మాభిమాన-జాత్యభిమానములనే-అనేక అభిమానములను విడిచి, తనస్వరూపముతో తానుండవలెను. దీనిపేరు బ్రహ్మాత్మైక్యజ్ఞానం, యీ జ్ఞానంపేరు బ్రహ్మసాక్షాత్కారం, యిట్లాయెరింగి వూరికె వుండవలెను. అగ్న్యాకాశవాయువులుగూడి జీవుడు, జాగ్రత్స్వప్న, సుషుప్తి, తురీయ్య, తుర్యాతీతాలు జీవుని గుణాలు

## ౪. జ్ఞానేంద్రియపంచకములో - త్వగింద్రియం.

త్వగింద్రియం॥ మనస్సు నుంచి స్పర్శగొనవలెననే వృత్తి పుట్టింది, దానిపేరు త్వగింద్రియం, దీనికధిపతి వాయువు, స్పర్శవిషయం, ఇంద్రుడధి దేవత, యిదివాయు మిశ్రితాగ్న్యర్థ చతుర్థాంశ.

## ౫. చక్షురింద్రియం.

చక్షురింద్రియం॥ బుద్ధినుంచి రూపంచూడవలె ననేవృత్తి పుట్టింది. దానిపేరు చక్షురింద్రియం దీనికధిపతి సూర్యుడు. ఇది అగ్న్యర్థం, దీనికి అగ్ని మహాభూతం, రూపంవిషయం.

## ౬. శ్రోత్రేంద్రియం.

శ్రోత్రేంద్రియం॥ అంతఃకరణనుంచి శబ్దం వినవలెననేవృత్తి పుట్టింది । దానిపేరే శ్రోత్రేంద్రియం । దీనికధిపతిదిక్కులు । యిదిఆకాశమిశ్రిత అగ్న్యర్థ చతుర్థాంశ । దీనికి ఆకాశభూతం శబ్దవిషయం॥

## ౭. జింహ్వేంద్రియం.

జింహ్వేంద్రియం । చిత్తంనుంచిరసంపుచ్చుకొనవలెననే వృత్తి పుట్టింది । దానిపేరే జిహ్వేంద్రియం । దీనికధిపతి వరుణుడు । ఉదకమహాభూతం । రసంవిషయం । యిది ఉదకమిశ్రితాగ్న్యర్థచతుర్థాంశ

## ౮. ఘ్రాణేంద్రియం

ఘ్రాణేంద్రియం । అహంకారంనుంచి గంధం పుచ్చుకోనవలెననేవృత్తి పుట్టింది । దాని పేరే ఘ్రాణేంద్రియం । దీనికధివులు - అశ్వనీ దేవతలు । పృథ్వీమహాభూతం । గంధంవిషయం । యిదిపృథ్వీ మిశ్రితాగ్న్యర్థ చతుర్థాంశ॥

## ౯. విషయపంచకం.

శబ్దవిషయం॥ అంతఃకరణనుంచి శబ్దంపుట్టింది । యిదిసుశబ్దాపశబ్దములు - ఇది ఆకాశాన్వితోదకార్థచతుర్థాంశ, యిది పామును - లేడినిబంధనం చేసును॥

## ౧౦. స్పర్శవిషయం.

స్పర్శవిషయం॥ మనస్సునుంచి స్పర్శపుట్టింది । యిది శీతోష్ణములు యిది వాయురన్వితో దకార్థచతుర్థాంశ । యిది యేనుగును బంధనచేసును॥

## ౧౧. రూపవిషయం.

రూపవిషయం॥ బుద్ధినుంచిరూపంపుట్టింది । యిదిరక్త - శ్వేత - కృష్ణ - ధూమ్ర - హరిత - పీతములు । యిదిఅగ్న్యన్వితోదకార్థచతుర్థాంశ । మిడుతనుజంపును॥

## ౧౨. రసవిషయం.

రసవిషయం॥ చిత్తమునుంచి రసంపుట్టింది । యిది లవణామ్లతిక్త మధుర కటుకషాయాలు । యిదిపుదకార్థం । చాపనుచంపును॥

## ౧౩. గంధవిషయం.

గంధవిషయం॥ అహంకారం నుంచిగంధంపుట్టింది । యిదిసుగంధ దుర్గంధములు। యిదిపృధివ్యన్వితోదకార్థచతుర్థాంశ । తుమ్మెదనుచంపును॥

## ౧౪. కర్మేంద్రియపంచకం.

వాగింద్రియం॥ అంతఃకరుణనుంచి । శబ్దంపలుకవలెననేవృత్తి పుట్టినది । దానిపేరే వాగింద్రియం । దీనికధిపతిఅగ్ని । సరస్వతిఅధిదేవత । సువాక్కు దుర్వాక్కు విషయం । నాగ వాయువు॥

## ౧౫. పాణీంద్రియం.

పాణీంద్రియం॥ మనస్సునుంచి సేవచెయ్యవలెననే వృత్తి పుట్టింది । దానిపేరే పాణీంద్రియం - దీనికధిపతి ఇంద్రుడు । దానప్రతిగ్రహాలువిషయం । కూర్మవాయువు॥

## ౧౬. పాదేంద్రియం.

బుద్ధినుంచిరాకడపోకడ చెయ్యవలెననే వృత్తిపుట్టింది । దానిపేరే పాదేంద్రియం । దీనికధిపతి ఉపేంద్రుడు । గమనాగమనములువిషయం । కృకురవాయువు॥

## ౧౭. గుహ్యేంద్రియం.

గుహ్యేంద్రియం॥ చిత్తంనుంచిమూత్రం చెయ్యవలెననే వృత్తిపుట్టింది । దానిపేరేగుహ్యేంద్రియం । దీని కధిపతిప్రజాపతి । ఆనందంవిషయం । ధనంజయవాయువు॥

## ౧౮. పాయురింద్రియం.

పాయురింద్రియం । అహంకారంనుంచి మలవిసర్జనం చెయ్యవలెనని వృత్తిపుట్టింది। దానిపేరే । పాయురింద్రియం । దీనికధిపతిమృత్యువు । మలవిసర్జనంవిషయం । దేవదత్తవాయువు॥

## ౧౯. భూతసృష్టి.

ఆద్యాన్మహాకాశః । మహాకాశాన్మహావాయుః । మహావాయోర్మహాతేజః । మహాతేజాన్మహాసలిలం । మహాసలిలాన్మహాపృథ్వీ॥ ఆత్మనకాశఃసంభూతః । ఆకాశాద్వాయు। వాయోరగ్నిః । అగ్నేరాపః । ఆపభ్యాంపృథ్వీ॥

## ౨౦. భూతపంచకం.

ఆకాశం॥ శబ్దంనుంచి ఆకాశంపుట్టింది । దీనికిప్రతిధ్వని యిచ్చేదిగుణం । బయలైయ్యుండుటధర్మం । తిరగనిచ్చుట కూర్చోనిచ్చుటకర్మం । దీనికికృష్ణవర్ణం । తదధిదేవత సూర్యుడు॥ అవకాశం॥ అచ్ఛిద్రం । అస్పృశ్యత్వం । నీలవర్ణత్వం॥ శబ్దం॥ తమోగుణాన్నుంచి పుట్టింది । త్రిగుణాత్మకం॥

## ౨౧. వాయువు.

స్పర్శనుంచివాయువుపుట్టింది । భిసిభిసి అనేశబ్దగుణమున్ను శీతోష్ణముల నేస్పర్శమున్ను । చలించుటమనేధర్మమున్ను । పొదిజేసుటమనేకర్మమున్ను । హరితవర్ణమున్ను కలది । దీనికి యింద్రుడధిపతి । సంచారం । చలనం । స్పర్శనం । శోషణం । ధూమ్రవర్ణంగలది। ఆకాశంనుంచిపుట్టింది । త్రిగుణాత్మకం॥

## ౨౨. తేజస్సు.

రూపంనుంచితేజస్సు పుట్టింద । భుగభుగమనేశబ్దగుణమున్ను । ఊష్ణస్పర్శాంన్ను । ప్రభారూపమున్ను । పాకం చేసుటమనెకర్మమున్ను । ఊష్ణించుటమనేధర్మమున్ను । కలది దీనికిరుద్రుడధిపతి॥ దాహకత్వంపాచకత్వం । ఊష్ణత్వప్రకాశత్వరక్తవర్ణత్వములుగలది । వాయువునుంచిపుట్టినది । త్రిగుణాత్మకం॥

## ౨౩. ఉదకం.

రసంనుంచిపుదకంపుట్టినది । దీనికిభుళ భుళశబ్దగుణమున్ను । శీతస్పర్శాన్ను । శుక్లరూపమున్ను । మాధుర్యరసమున్ను । తడుపుటమనేధర్మమున్ను । ముద్దజేసుటమనే కర్మమున్ను । శ్వేతవర్ణమున్నుకలది । దీనికిఅధిపతివిష్ణు । ప్రవాహంఆప్యాయనం । ద్రవం రసం । శ్వేతవర్ణంకలది । అగ్నినుంచిపుట్టినది త్రిగుణాత్మకం॥

## ౨౪. భూమి.

గంధంనుంచిభూమిపుట్టినది - దీనికికటకటధ్వనిన్ని । కఠినస్పర్శ । నీలాదిక చిత్రరూపం । మధురామ్లాదిరసం । సువాసనదుర్వాసనలు । కఠినత్వధర్మమున్ను ॥ ధరించుట మనేకర్మమున్ను । పీతవర్ణమున్ను । బ్రహ్మాదిదేవ ॥ యిన్నికలది । స్థూలతా ॥ నానాకారత । కాఠిన్యం । గంధం । పీతవర్ణంకలది ॥

## ౨౫. గుణత్రయం.

సత్వగుణం । బుద్ధినుంచి పుట్టినది । దీనిపేరేబాహ్యాజ్ఞానం దీనినుంచి దేవలోకప్రాప్తి అదేఅన్యదాజ్ఞానబుద్ధి । దీనదేవయోనిప్రాప్తి । దీనిధర్మంస్వప్నావస్థ । నిత్యనైమిత్తికకర్మం ॥ వైరాగ్యం॥ క్షాంతి॥ ఔదార్యంకలది । సౌమ్యం । జ్ఞానం । మౌనం । హర్షం । క్షమా । సత్సహవాసం।

నిశ్చయం । శ్రద్ధా । ధైర్యం । వివేకం । యీపదీ దీనిగుణాలు ॥ దయాధర్మం కృపా । భక్తియివ్వి దీనిగుణాలే ॥యెరుక॥

## ౨౬. రజోగుణం.

రజోగుణం । మనస్సునుంచి రజోగుణంపుట్టింది । దీనిపేరే విషయాసక్తి । దీన మనుష్యలోకప్రాప్తి । అన్యధాజ్ఞానజన్యం దీనమనుష్య యోనిప్రాప్తి । దీనిధర్మంజాగ్రదవస్థ । కామ్యకర్మం । కామక్రోధ లోభాదులుగలది । దర్పం మందం । అహంకారం । విషమవాదం। అప్రియవాక్యం । ఉద్యోగం । మత్సరం । కోపం । యీ యెనిమిది రాజసగుణాలు ॥ దానం భోగం శృంగారం । వస్తుగ్రహణం । స్వార్థం । యివియన్ని యుకలది ॥ యెరుకమరుపులు కలసినది॥

## ౨౭. తమోగుణం.

అహంకారమునుంచిపుట్టినది తమోగుణం । ఆలస్యం । మోహం । నిద్రా-చాపల్యం। హీనవృత్తి । పరనిందా । హింసా । సాంప్రష్టత్వం । వివాదం । శోకం । కలహం । వధా । వంచన। యివితమోగుణగుణాలు । యీ తమోగుణం పేరే మోహభ్రాంతి । దీనఅధోలోకప్రాప్తి । యిది అన్యధాజ్ఞానజన్యం । దీనపశ్వాదియోనిప్రాప్తి । దీనిధర్మం । సుషుప్త్యవస్థ । తామసకర్మం । ఆలస్యంభ్రాంతి తొందర మొదలైన వికారములుగలది ॥మరుపు॥

## ౨౮. ఈశ్వరదేహ చతుష్టయం.

మహాకారణం॥ ఈశ్వరుని మహాకారణశరీరం మాయ । మూలప్రకృతి । స్వరాట్టు అనాహతం । పంచబ్రహ్మమయంబు । పంచభూతములకు హేతుభూతం । దీనికి సర్వసాక్షిణ్యవస్థం । ఈశ్వరుడభిమాని । శుద్ధసాత్వికాహంకారం । జ్ఞానశక్తి । బ్రంహ్మాండాతీతస్థానం । సర్వకర్తృత్వ। సర్వపాలకత్వ । సర్వసంహారకత్వ । సర్వ నియామకత్వ । సర్వభోక్తృత్వ । సర్వేశ్వరత్వాది । షడ్గుణైశ్వర్యభోగం । ఓంకారమాతృక । మహాత్మ । నిరంజనస్థానం । అర్థమాత్రుక । యిదే అంతటికిమూలం । యిదేత్రిగుణాలపుట్టిల్లు । సునీలగతస్ఫటికవర్ణం । విద్యావిద్యాచ స్వయమేవభవతి । అనివున్నది ॥

## ౨౯. ఈశ్వరుని కారణ శరీరం

ఈశ్వరుని కారణశరీరం - అవ్యాకృతమాయ - యిదేజ్ఞానం - మహత్తత్వం - మకారమాత్ర - విస్మరణ ప్రళయావస్థ - రుద్రుడభిమాని - తామసాహంకారం - యీ అహంకారంవలన తావత్రయాదులవుట్టినవి-దీనికిద్రవ్యవక్తి - అగ్ని స్థానం - సర్వసంహ్మారభోగం - శుద్ధాత్మదీన మహదహంకారాదులుబుట్టును - యిది త్రిగుణగర్భం-బింద్వోపాధి పంచభూతాలకుకారణం - దీనికిపార్వతిశక్తి - కైలాసస్థానం - కృష్ణవర్ణగతశ్యామవర్ణం - యిదిప్రణవతృతీయ్యపాదం॥ అజ్ఞానం కేనభవతీతిచేత్ - నకేనాపిభవతి॥

## ౩౦. ఈశ్వరుని సూక్ష్మశరీరం.

ఈశ్వరునిసూక్ష్మశరీరం - హిరణ్యగర్భం - ఉకారమాత్ర - స్థిత్యవస్థ విష్ణుఅభిమాని-సాత్వికాహంకారం - యీ అహంకారంవలన - సూర్యాదిదేవతలుపుట్టిరి - దీనికిదశదిక్కులు-శ్రోత్రంబులు - వాయువు త్వగింద్రియంబు - సూర్యుండు - నేత్రంబులు వరుణుండు - జిహేంద్రియంబు - అశ్వినీదేవతలు ఘ్రూణేంద్రియంబు - వంహ్ని వాగింద్రియంబు - యింద్రుండు - కరంబులు - ఉపేంద్రుడు-పాదంబులు - బ్రహ్మ గుహ్యాంబు ॥ మృత్యువు - గుదంబు - జ్ఞాతృవంతఃకరణ - మనంబు - చంద్రుండు - బుద్ధి - బ్రహ్మ - క్షేత్రజ్ఞుండు - చిత్తం అహంకాంబు - రుద్రుండు - దీనికి చంద్రస్థానం - సర్వపాలకభోగం - లక్ష్మీశక్తి - వైకుంఠస్థానం - స్వేతవర్ణగతకర్బువర్నం - నీలమేఘమందుండే - మెరుపువన్నె - యితనికి సప్తవాయువులుప్రాణాలు - యిదిప్రణవద్వితియ్యపాదం॥

## ౩౧. ఈశ్వరుని స్థూలశరీరం.

ఈశ్వరునిస్థూలశరీరంవిరాట్టు । యిందుకు-అకారమాత్ర । సృష్ట్యవస్థ-బ్రహ్మాభిమాని । రాజసాహంకారం । పృధివ్యాపస్తేజో వాయురాకాశ చంద్ర సూర్యాత్మలనే అష్టమూర్తులీశ్వరుని యొక్క । విరాఢ్రూపంబగు స్థూల దేహంబు । దీనికిక్రియాశక్తి । సూర్యస్థానం । సర్వకర్తృత్వభోగం। యిందుకు - ఆత్మ । భూతాత్మ । యితనికిధరణిపాదములు । దివితలంమస్తకం । అంతరీక్షంనాభి। యిట్టివిశ్వశరీరునకు । అతలంబుపాదంబులు । వితలంబుగుల్భలు । సుతలంబుజంఘలు । రసాతలంబు జానువులు । మహాతలంబూరువులు । తలాతలంబుకటిప్రదేశం । నాగలోకం నాభ్యధోభాగం । భూలోకంనాభి । భువర్లోకంజఠరం । మహర్లోకంకంఠం । జనలోకంముఖం। తపోలోకం భ్రూమధ్యం । సత్యలోకంసహస్రారం । దీనికి సావిత్రిశక్తి । సత్యలోకస్థానం । రక్తవర్ణ గతపీతవర్నం । జీవునీనాలుగోశరీరం । యితనికిస్థూలశరీరం । యిదిప్రణవప్రధమపాదం । సముద్రాలుకుక్షి । నదీనదములు నాడులు । పర్వతంబులు శల్యంబులు । వృక్షలతలురోమంబులు॥

## ౩౨. జీవదేహచతుష్టయం.

జీవునిమహాకారణశరీరం । యిదేమూలమాయ । యిదేఅంతఃకరణ । అర్థమాత్ర । స్ఫురణరూపం । ధ్వనిరూపం । జ్ఞానం । స్మరణ । యిరువైఅయిదోతత్వం । తుర్యావస్థ । ప్రత్యగాత్మాభిమాని । శుద్ధసాత్వికగుణం । అక్షరస్వరూపం । కూటస్థం । పంచభూతోత్పత్తికి హేతువైన। సద్యోజాత వామదేవ । అఘోర-తత్పురుష-ఈశానులనుపంచబ్రహ్మలు గలది । ఆదిశక్తి పరాశక్తి-జ్ఞానశక్తి-ఇచ్ఛాశక్తి క్రియాశక్తులుగలది । ప్రేరేపకంబులైన । పంచప్రాణంబులు । పంచాక్షరియనే-పంచేంద్రియంబులుగలది। బ్రహ్మ-విష్ణు-రుద్ర-ఈశ్వర-సదాశివులను । పంచకర్తలంతఃకరణంబులుగలది। దీనికిమూర్ధ్నిస్థానం । ఆనందఅవభాసభోగం । ఓంకార మాతృక । నిర్మలాత్మ యిదిబ్రహ్మానుసంధానంజేసేది । మనురామాత్రప్రమాణం । మేఘకాంతి । అతసీపుష్పసంకాశం।

సునీలవర్ణం । ధూమ్రవర్ణం । యిది ప్రణవచతుర్థపాదం । అంతఃకరణ । అంతఃకరణ ప్రతిబింబ చైతన్యం । తదధిష్ఠానచైతన్యంగలసి - జీవుడననైనది॥ బ్రహ్మానుసంధాన మనంగాయేనంటే॥ పరమజడమయినస్థూల దేహమునునేగానుజ్ఞానకర్మలక్షణంబులుగల యింద్రియంబులు నేగాను । గమనాగమనములుగల ప్రాణములునేగాను । మాట్లాడే నోరును నేగాను । స్ఫురణగల అంతఃకరణనునేగాను । సంకల్పవికల్పాత్మకమైన మనస్సునునేగాను । నిశ్చయగుణంగల బుద్ధినినేగాను । చింతజేసెచిత్తమునునేగాను । దేహాన్నిలేవనెత్తెఅహం కారమునునేగాను । గుణత్రయంనేగాను॥ నేనుఅభోక్తను । అర్థమాత్రకు అవలివాడను । శక్తిత్రయాతీతుండనుఅని యెరుగునది.

## ౩౩. జీవునికారణశరీరం.

జీవునికారణశరీరం॥ అజ్ఞానం । గుణసామ్య మాయా । దీనిపేరేమహత్తత్వం । మకారమాత్ర । విస్మరణ । సుషుప్త్యవస్థ । ప్రాజ్ఞుడభిమాని । తమోగుణం । దీనందువాయు రూపమైన-వుశ్వాసంవున్నదిగనుక । యిదితిరిగేటందుకు అకాశంవున్న దనవలెను । ఆకాశానిలములువుండబట్టి । అనలజలాలువున్న వనవలసెను । యివిఅన్నీవుండేటందుకు భూమిగ్గావలెగనుక - అదికూడావున్నదని ఆనుకోవలసినది । యీబీజరూపాలైన పంచభూతాలు గలసినదానిపేరే కారణశరీరం । దీనికిస్థానంహృదయం । చిత్తాహంకార జీవాత్మసంగమమే కారణతనువు । ఆకాశాహంకారములు - కారణతనువు । దీనికి హృదయస్థానమే - ద్రవ్యశక్తి। ఆనందభోగం । పరమాత్మ పారమార్థికుడు । యిదిసాభాస । అవ్యాకృతం। దీనకి అంగుష్టార్థ ప్రమాణం। కృష్ణవర్ణం । పశ్యంతివాక్కు । ఆనందభోగం । మకారమాత్రక । యిదిప్రణవ తృతీయపాదం । యిదిసత్తుగాదు - అసత్తుగాదు - సదసత్తులుగాదు । ఆత్మకుభిన్నంగాదు । అభిన్నంగాదు । భిన్నాభిన్నంగాదు । సావయవంగాదు । నిరవయవంగాదు। ఉభయంగాదు । ఇదిఆనందమయకోశం.

## ౩౪. జీవునిసూక్ష్మశరీరం.

జీవునిసూక్ష్మశరీరం॥ ఉకారమాత్ర । స్వప్నావస్థ । తైజసుడభిమాని । సత్వగుణం । పంచప్రాణ-పంచజ్ఞానేంద్రియపంచకర్మేంద్రియ - మనస్సులుగలసి - షోడశవికారాత్మకం । సూక్ష్మశరీరమని కొందరన్నారు । బుద్ధినిగలిపి పదియేడవయవలిదని కొందరన్నారు । చిత్తాహంకారములగలిపి పందొమ్మిదవయవలిదని కొందరన్నారు । యిందులోనే అంతఃకరణను విషయపంచికాన్నికలిపి । యిరువైఅయిదు ఆవలియవలిదని కొందరన్నారు । యీపైవి అన్నీ ఒక్కఅంత్తఃకరణపొట్టలో నివే-కనుక । కొందరు, ఒక్కఅత్తఃకరణనేఅన్నారు । కొందరువిషయ పంచకాన్ని తీసివేసి । భూతపంచకాన్నికలుపుకొన్నారు॥ దీనికికంఠస్థానం । అగ్నివాయువులుగలసి। సూక్ష్మశరీరమనబడును । జ్ఞానేంద్రియపంచక । కర్మేంద్రియపంచక । మానసాధ్యంత్తః కరణచతుష్టయం । తత్కర్మం । కాలం । భూతపంచకం । దశప్రాణాలు । యిట్టి అష్టపురంబులు

గలది । దీనికి ఇచ్ఛాశక్తి । స్వేచ్ఛాభోగం । అంతరాత్మ । ప్రాతిభాసికుడు । యీదేహంవాసనకు బిధారమైనది॥ దీనికి వివిక్తభోగం । ప్రాణధర్మమనోధర్మాలై నక్షుత్పిపాస శోకమోహాలనే ఊర్మిచతుష్కంగలది. అంద-బధిర-మూక-ఖంజ-పంగు-క్లీబత్వాది ధర్మాధర్మా । స్వర్గనరక బంధమోక్షాలుగలది । ప్రాణమనో విజ్ఞానకోశత్రయాత్మకమైనది । అంగుష్ఠప్రమాణంగలది । శ్వేతవర్ణంయిదివిక్షేపశక్తి.

## ౩౫. జీవునిస్థూలశరీరం.

జీవునిస్థూలశరీరం । యీదేహంఆత్మస్వరూపం కాదు । ఆత్మస్వరూపంవేరే । దేహస్వరూపంవేరే । దేహంపాంచభూతిక ఆకారం । యిదియెట్లాగంటే । పంచభూతాలనుంచి ధాన్యంనిర్మాణంఅయినది । ఆధాన్యమువలన అన్నముఅవుతుంది । ఆ అన్నమునుంచి దేహనిర్మాణం అయినది । యీ దేహంపేరుఅధిష్ఠానం । దీనికి అకారమాత్ర । జాగ్రద వస్థ విశ్వుడభి మాని ॥ రజోగుణం ॥ ఆకాశాంశలైన - రాగ ద్వేషభయలజ్జామోహాదులును । వాయుఅంశలైన - చలనవశనధావన । అకుంచనప్రసరణాలున్ను । ఉదకాంశలైన క్షుత్తృష్ణ నిద్రాలస్యాసంగమాదులున్ను । ఉదకాంశులైన । లాలమూత్రస్వేదరక్త శుక్లములున్ను (శుక్లమనగా=చీముకర్ధము) పృధ్వి అంశలైన అస్తిమాంసత్వఙ్నాడీరోమాలున్ను కలిసిన । యీయిరువైఅయిదింటిపేరు స్థూల దేహం । యిదితొంబయిఆరు అంగుళాలేకాని, యెనిమిదిజానలేకాని పొడువు । నాలుగుజానలవెడలుపు - దీనిలో డెబ్బదిపెద్దయెముకలు। యెనిమిదిపలాలుగుండెలు । నూటతొంబదిమర్మస్థానాలు । డెబ్బది రెండు సంధులు । ముప్పదియారు పడికిల్ల మాంసము । ముప్పదిమూడుకోట్ల రోమంబులు । డెబ్బది రెండు వేల నాళ్ళు-ముప్పది మూడుమూర్ల పెద్దపేగు । అర్ధశేరు రుధిరం । ఒకసోల పైత్యం । అరసోలెడు శ్లేష్మంవుండును॥ దీనికి యుక్త భోగంక్రియాశక్తి । జీవాత్మవ్యావహారికుడు । యీ దేహం లింగశరీరానకు । బిధారమైనది । దీనిపేరే భూతకర్ధమం । దీనికి స్థూలభోగం । ప్రణవప్రధమపాదం । అన్నమయకోశం । ఆవరణశక్తి । స్థూల, కృశ, హ్రస్వ, దీర్ఘ, ప్లుత, దేవదత్త - యజ్ఞదత్త - ధనుంజయులనె - నామరూపవర్ణాశ్రమ । కులగోత్రాదులుగలది । పితృసంబంధమయిన । మజ్జ । నాడ్య । స్థులనే । శోకత్రయమున్ను । మాతృసంబంధమయిన। చర్మమాంసరుధిరములనె । కోశత్రయమున్ను । కలసినషట్కోశాలది॥ అస్తితే-జాయతే-వర్ధతే-పరిణమితే - అపక్షీయ్యతే - వినశ్యతులనె - షడ్భావవికారాదులుగలది ॥ అంగుళం - నరప్రమాణం॥ రక్తవర్ణం । దీనికి జననమరణాదులనే ఊర్మిద్వయంగలది.



## శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశికప్రభు మహారాజులవారి కృతం,

## ౧౨. ద్వాదశవిధబోధలు.

### ౧. విశ్వోద్భవస్థితిప్రళయాష్టకం.

సీ॥ జగదుద్భవస్థితి సంహారములుమీకు తెలిపెదవినరయ్య తెల్లమిగను ◆ జనులారసాధన సంపద్విశిష్ఠుడౌ సచ్చిష్యవరుడొక సద్గురునకు ◆ జేయవలసినవాల్గు శుశ్రూషలొనరింపుచుండి వాడడిగెబ్రహ్మాండమెట్లు ◆ జన్మించివర్థిల్లజన్మ స్థలమునకు జేరునోయిది దెలియజెప్పుమనుచు ◆ వినయమున ప్రెుక్కిలేవకవేడుచున్న ◆ జూచికరుణించిభక్తికిచోద్యమంది ◆ లెమ్మితెల్పెదననివాని లేవనెత్తి త్రివిధదీక్షలుగావించి తెలుపదొణగే ॥౨॥

సీ॥ వినుమునీవడిగిన విశ్వోద్భవస్థితి ప్రళయముల్ వినుపింతు బ్రహ్మమందు ◆ బ్రహ్మాహమస్మను పలుకులేనిదెగల్గి పురుషప్రకృతులయ్యు పుట్టజేసె ◆ ముగ్గురు మూర్తులవారీ మూడులోకములను పుట్టించిరక్షించి పాలియజేయు । చుందువీ లోకములందాత్మ కర్మవశంబున పిండముల్ జననమగుచు ◆ జనునుకర్మక్షయంబైన మునుగగనము ◆ వహ్నిపవనజలావనుల్ వరుసబెట్టి ◆ స్వాంశములతోడ నేగుస్వస్థానములకు ◆ వాటిసంబంధులేడ్తురు వాటికొరకూ ॥౨॥

సీ॥ శ్వాసలారైనను జరుగునొక్కవిఘడియ యవి యారుపదులైన నగునుఘడియ ◆ యవిరెండుముప్పదులైననహెూరాత్రమౌనది మూడునూర్లరువదరుగ ◆ నగువత్సరము మూడులనలువదిలక్షల యిరువదివేలవ్వియెంచిచూడ ◆ నైనయుగములునాల్గొనని రెండువే లరిగిననొకదినం బగునజునకు ◆ నతడువైమార్లరుగ విష్ణుకగునుఘడియ ◆ శంభునికి హరివైమార్లుజనిననగువిఘడియ ◆ శంభుడువేమార్లుగడువ శక్తికగునరవిఘడియ ◆ యిదెసుమీకాలగణనా ॥౩॥

గీ॥ ఎవరిశతవర్షములు వారి కేగవారు ◆ మేనికెడబాసి తిరిగి జన్మింతురట్టి ◆ శక్తులకు లెక్క లేదాత్మ జలధియందు ◆ వీచికలచందమున నుద్భవించిచనునూ ॥౪॥

క॥ వనధిప్రవాహమునవలెమన ◆ కనులకుగనుపించినట్లుగాన్పించుజగ ◆ జ్జననంబాత్మలోమృషయని ◆ కనువారికిప్రళయపంచకములేదెపుడు౬ ॥౫॥

గీ॥ జీవశివులనషుప్తులు జీవశివుల ◆ తనువిసర్జనములు మహత్తత్వసృష్టి ◆ లేనెలేదనిగురుని చేతానెరుగుట ప్రళయపంచకమిదియె పొభక్తియుక్తా ॥౬॥

క॥ అనవిని శిష్యుడుమునుపటి ◆ తనమదిసంశయముబాసితానుండెనుయే ◆ మనుజులుయిదివినిచదివిన ◆ జననస్థితినాశములను జెందరువారల్ ॥౭॥

గీ॥ పరశురామవంశ భవునిసీతారామ ◆ గురునిగొల్చియిట్టిగుట్టుభాగ ◆ వతులకృష్ణు డనెడివసుధామరుడుదెల్పు ◆ కొనియెబోధలెవ్విగోరబోకా ॥౮॥

ఇది శ్రీమద్భాగవతకృష్ణ విరచిత విశ్వోద్భవస్థితి ప్రళయాష్టకం సమాప్తం.

## ౨. హంససంచార చతుష్కం.

సీ॥ హంససంచార ప్రశంసమీరిదిలెస్స వినరయ్యజనులారమనసుబెట్టి ◆ యొకశిష్య వరుడు దేశిక చక్రవర్తిని ◆ గనిప్రశ్న జేసెయీకాయమందు ◆ హంనచరించునంచనవింటి నవిదెల్ప వలెనన్న వినిగురువరుండనియె ◆ యొకదినంబునిరువదొక్క వెయ్యిన్నారునూర్లు దిరుగుగుదమాదిగాను ◆ గుదమునను గుహ్యమున నాభికుహరమందు ◆ హృదయకంఠాక్షి మూర్ధ్నులవదలకారు ◆ నూరులార్వేలునరువది నూరులారు ◆ వేలువెయి వెయ్యవెయిమార్లు వేసరిలక ॥౧॥

సీ॥ తెలియుమాధారస్వాధిష్ఠానమణిపూరకనాహతవిశుద్ధకమలములకు ◆ మీదనాజ్ఞేయమామీదసహస్రారముండునచటనేలుచుండుదొరలు ◆ హేరంబవాక్పతిహరి హరజీవేశ గురువుల్దళంబుల క్రమముగాను ◆ నాల్గారుపది మూడునాల్గులుపదియారు రెండులైయుండునుదండిగాను శక్తులక్షరములు భూతసమితిబీజ ◆ ములుదిశలుకాంతులు ముఖముల్ మొదలైనని ◆ గలవనేకములవియన్ని గణనజేసి ◆ పెంచలేదిందుముచ్చట పెగుననుచు ॥౨॥

క॥ అనిగురుడుపదేసించిన ◆ వినిశిష్యుడుసంత్తసమునవిస్మితుడగుచుం ◆ వినుజనురత్యానంద్దం ◆ బుననట్లనెపొందగలరు బుధనుతులగుచుꣳ ॥౩॥

గీ॥ ప్రేమతోడపరశురామసీతారామ ◆ గురుడుదెల్పహంసనెరిగిభాగ ◆ వతులకృష్ణుడ నెటి వసుమతీసురుడది ◆ వదలడయ్యేమదినిముదముజెందీ ॥౪॥

ఇతి శ్రీమద్భాగవతకృష్ణవిరచితహంససంచ్చారచతుష్కం సమాప్తం.

## 3. దృగ్దృశ్యవివేక చతుష్కం ॥౪॥

సీ॥ దృగ్దృశ్యముల రెంటి దెలిపెదవినరయ్య గురుమూర్తి తన శిష్యవరునిప్రజ్ఞ ◆ గనగోరిశబ్దాదుల నెరుంగువారెవ్వరనిన శ్రోత్రాదులంచనియెవాటి ◆ గనెటిదో । మనసుయామనసునో । బుద్ధి । బుద్ధినిబుద్ధియని । తెలుసుకొనినవాడు ◆ కలడొ లేదో చూడుకలడుకల్గితేవాని నెరుగునాయివియని । నెరుగవి విటి ◆ నెరుగునతడతడెవ్వడో । యెరుగదెల్పు ◆ మనిననతడవు నీవెనేనిననీవె ◆ యనుచుదెల్పినవిని బ్రహ్మమనగనేదో ◆ తెల్పగదవయ్య మదినాట దేశికేంద్రా ॥౧॥

క॥ అనవినియుదధినిబుట్టిన ◆ ఘనవీచికబృందమందు కమలమువ్యాపిం ◆ చ్చినమాడ్కినీవెత్రిజగం ◆ బుననిండిన బ్రహ్మమరసిబుద్ధినెరుగుమీ ॥౨॥

క॥ అనియీరీతినిబోధిం ◆ చినశిష్యవరుండు సంతసించెను యీబోధను ◆ విన్న కన్నమనుజుం ◆ దనిశముతనరూపు నెరిగి యానందించుఁ ॥౩॥

గీ॥ ప్రేమజేసిపరశురామ శీతారామ ◆ మూర్తిదృక్కుదృశ్యములను దెల్ప ◆ కేరిభాగవతులకృష్ణుడు వినిదృక్స్వ ◆ రూపమేనటంచురూఢిజెందే ॥४॥

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత దృగ్దృశ్య వివేకచతుష్కం సమాప్తం ॥౩॥

## ౪. మహావాక్యవివరణపంచ్చకం ॥౫॥

సీ॥ వినుడిమహావాక్యవివరణజనులార గురుమూర్తినొక శిష్యవరుడడిగిన ◆ నామహావాక్యములవిటియంన్వయంవమును వినజెప్పెనీవు నీతనుచతుష్క ◆ మునుగూడిత్వంపద మునకర్ధ మీశ్వరతనుచతుష్కమతండు తత్పదార్ధ ◆ మిరువురిదేహం బులిద్ధరిగుణములు తొలగించి చూచినతుదపదార్ధ ◆ మౌను యీమూడుతత్వమస్య నెటివాక్యమ ◆ య్యేనీగుణములు కొద్దివధికమామహా ◆ త్మునిగుణములు యిద్దరియంగములను ◆ వినుముచెవి యెగ్గి తెల్పదవేరెవేరే ॥౧॥

సీ॥ స్థూలంబు మొదటిది / సూక్ష్మంబు రెండోది కారణంబు తృతీయ కాయమగుమ ◆ హాకారణముతుదదగునీకు నీశునికి విరాట్టుతొలుకాయ మవలిదగుహి ◆ రణ్యగర్భుండు/ కారణము ప్రకృతి సర్వసాక్షి నాల్గవదగు సత్యమివిటి ◆ తోటివచ్చును బోవుతొలగకెనిమిది యాత్మలును మాతృకలు నవస్థలు గుణములు శక్తులభిమానులును భూతసముదయంబు ◆ స్థలములవలి మహావాక్యసమితియందు ◆ దీనియర్థంబెకలిగుండు మానకెపుడూ ॥౨॥

సీ॥ ఆయమాత్మబ్రహ్మయంచను వాక్యమిదికొనవేదమందునగలదు వెదకికొనుము ◆ సామవేదంబునుజదివి సతత్వమస్యనువాక్యమగుపడు వినుము మొదట ◆ వేదంబులోపల వెదక ప్రజ్ఞానంబ్రహ్మయనెటి వాక్యంబుమనకెదొరుకు ◆ రెండ్లవ వేదమందుండ హంబ్రహ్మాస్మియను వాక్యమది వెదికినగనవడునిన్ని వెదకంగ నేటికియన్నిగురుని ◆ వద్దగల్గును శేసించ దిద్దితెలుపు ◆ ననినవినిమ్రొక్కి యామహాత్మునికరుణను ◆ మోదమునజెందెనప్పుడాముముక్షజనుడూ ॥౩॥

గీ॥ అతనివలె నెదీనిసతతంబుమరువక ◆ చదువుచున్న వినినసకలవేద ◆ సారమెరిగచిత్త చాంచల్యమును మాని ◆ స్మృతతి జెందుపరమగతిని నిజమూ ॥४॥

గీ॥ ప్రేమతొడపరశు రామసీతరామ ◆ గురుడుదెల్పవే దగుహ్యామెరిగి ◆ పరమశాంతినొందె భాగవతులకృష్ణ ◆ భూసురుండుపూర్వపుణ్యమేమో ॥౫॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత మహావాక్యవివరణ పంచకం సమాప్తం ॥४॥

## ౫. ప్రణవార్థప్రకాశికాత్రయం ॥౩॥

సీ॥ జనులారప్రణవార్థమును సద్గురునిజేరిసచ్ఛిష్యుడడిగిన సంత్తసించి ◆ వినుమని

చెప్పె జీవునికి నాల్గంగ్గములఁగల వీశ్వరునికినాల్గంగ్గములును ◆ గలవనిలో చనకంజ్ఞాతమున జూడుమెరుపు తెలుపునలుపు మేఘవన్నె ◆ లివిజీవతను కాంత్తులెరుపులో పచ్చన తెలుపులోపల నలుపునలుపులోన ◆ శ్యామముసు నీలమందునస్ఫటిక కాంతి ◆ గలుగునివి యీశ్వరుని దేహకాంత్తులిన్ని ◆ తనువులకుమీద శుద్ధపీతస్వరూపు ◆ డైనబ్రహ్మంబు గలిగుండునతడెనీవూ ॥౧॥

కః అని చెప్పినదేశికునకు ◆ వినయంబున మ్రొక్కిలేచివినుతించిముదం ◆ బునజెందెనట్లుతద్భో ◆ ధనువినుకనుస్మృతనిజెందుతద్భావమునఁ ॥౨॥

గీః పరశురామవంశభవుడుసీతారామ ◆ ధరణి సురుడుదెల్పదానిభాగ ◆ వతులకృష్ణుడెరిగివదలక తలపోయ ◆ దొణగెమనసు నెటకుదొలగనియకా ॥౩॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ప్రణవార్థప్రకాశికాత్రయం సమాప్తం ॥౪॥

## ౬. పరిపూర్ణబోధాష్టమాలిక ॥౮॥

సీః మరియొకనాడు సద్గురునిగంన్గొని మ్రొక్కి ప్రస్తుతిగావించి పణతిబల్కె ◆ భువిలోనరామడుగు శివరామదీక్షితులఁ వచనకావ్యంబుగనచలబోధ ◆ గల్పించెనటదాన్ని కరుణించి తెల్పుమంచనవినినంతోషమునగురుండు ◆ పరిపూర్ణ మొకటిలేనెరుక నేదొకటుండుపరిపూర్ణము నెరింగి నెరుకను విడ ◆ చాలునిక యేమిబట్టదో సఖియయనిన ◆ యచలమన నేదిలేనెరుకనగనేది ◆ యెరుక నెవ్వరు బుట్టించియణగజేతు ◆ రయ్యవిస్పష్టముగబోధజెయ్యవయ్యా ॥౧॥

కః అని ప్రార్థించినహర్షం ◆ బునపరిపూర్ణమును జూపి పురుషయువతులై ◆ కనుపట్టలేని యెరుకను ◆ కనుగొనుమని చూపిదీన్ని కలదనకుసుమీ ॥౨॥

కః పరిపూర్ణమనినయచలము ◆ యెరుకనవిశ్వంబు తనువులెరుకననేని ◆ వెరుకన సంకల్పంబగు ◆ యెరుక నెయెరుకనుత్యజించయెరుకేపోవుఁ ॥౩॥

కః లేనికలమేలుకొన్నను ◆ తానెక్కడనిల్వనట్లుదబ్బరయగునీ ◆ వీనిర్మల బోధనుమే ◆ ల్కేననుకలవంటియెరుకగనరాదుజుమీ ॥౪॥

కః పరిపూర్ణము పరిపూర్ణము ◆ నెరుకనుగుర్తెరుగదెరుక యెరుకనచలముం ◆ యెరుగునుగురునెప్పటకీ ◆ యెరుకనుగనబోకుపోనియేమిటికింక్కఁ ॥౫॥

కః వినుముపరిపూర్ణమందున ◆ తనకైతాబుట్టియెరుకతనపుట్టిల్లుఁ ◆ గనబోవతనకుదానె ◆ కనుపడదీవిశ్వమంత్త గనుపడదుసుమీ ॥౬॥

యీ బోధకెక్కువైనవి । యేబోధలుగావుమూర్ఖు । లిది నమ్మరునీ । కె బోధ లేల చాలును । యీ బోధొక్కటి యెవిడుక । కెప్పటికబలా ॥౭॥

కః మంత్రములు రెండుగలవా ◆ మంత్రంబులలోన మొదటిమంత్రమచలముం ◆ మంత్రించునెరుకనావలి ◆ మంత్రము మంత్రింపుచుండుమరువక రెంటిఁ ॥౮॥

సీ॥ తలపోయుచుండుము తరుణినిన్నెవరైన బోధించుమన వారిబుద్ధినెరిగి ◆ తగినవారైరేని తప్పకబోధించు తగనివారై రేనితగదు తెల్ప ◆ నిన్నెన్నోరీతులనేపరిక్షించ్చి యీ బోధనీకెరిగిస్తి బోధజేయ ◆ తగినదానవటంచు దయజేసిసుజనులతో పొందుసలువుము దుష్టజనుల ◆ పొందుకలనైనజేయక ప్రొద్దుగడుపు ◆ చుండుమనిచెప్పి తానూరకుండెనంత ◆ జాలమాంబయు సద్గురుమూలమునను ◆ యెరిగి పరిపూర్ణమున లేనియెరుకనువీడే॥౮॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభుశిష్యురాలగు తల్లాపర్ఘుల జాలమాంబ్బా కోరికప్రకారం శ్రీకృష్ణదేశిక ప్రభువులవారురచించిన పరిపూర్ణబోధాష్టమాలిక సంపూర్ణం.

## ౭. పరిపూర్ణబోధాషట్కం ॥౬॥

సీ॥ శ్రీరమాద్వైతుడౌ నారాయణునిపేర వెలసిన గ్రామం బువిడిదిగాను ◆ జేకొన్న రాముడుగు శివరామ దీక్షితుల్ రచియించినట్టి యీయచలబోధ ◆ నాయయ్యచేత కంబ్బాలూరి అప్పయ్యమంత్రి దావినివచ్చి యంత పరశు ◆ రామసీతారామరత్నమునకు జెప్పెనతడు నేననుభాగవతులకృష్ణ ◆ భూసురుడు వేద దెల్పె తద్బోధమీకు ◆ విన్నవించెదవినితప్పులున్నదిద్ద ◆ వలసినదియిం తె నజ్జనవర్యులార ◆ భద్రవరులార కరుణాసముద్రులారా ॥౧॥

సీ॥ ఈసృష్టికన్న మున్నేకమైనిత్యమై యాద్యంతశూన్యమైయమితమగుచు ◆ యెరుగుట మరుచుట లేప్రొద్దు లేనిద్వైద్వంద్వత్రిపుటులను దగులనిదై ◆ నామరూపంబు లెన్నటికి గైకొననిదై వాఙ్మనోతీతమై వగపుమురిపె ◆ మెరుగనిదై శబ్ద విరహితాకాశమై యిదియది యింతంతయిట్టిదట్టి ◆ దనుచుజెప్పంగరానిదై జననమరణములను బొందనిదై వ్యోమమునకు లోనబైటగలదై ప్రపంచకల్పనకుజొరనిదై ◆ వెలితిలేని యీవట్టిఅచలమందూ ॥౨॥

సీ॥ తనకుదానరుదెంచి తనకుదాచనులేని సంకల్పుడొక యరక్షణములోన ◆ కోటిమాట్లవి వెంచుకొనువారెవరు వేరే తనువుతో జగముతోదగులుకొని ◆ నానావిధములైన నామరూపములతో తననుతాగనుకొని తానెమురుసు ◆ సాలీడురీతినిసకలప్రపంచంబు సృజియించురక్షించు సృక్కణంచు ◆ రాకపుట్టుటతాలేకపోకచావు ◆ లవియుమేలుకబల్ నిద్రలగును మొదలు ◆ లేనిసంకల్పమే తాను నేను మేను ◆ లగుచువర్తించుతనవంటి మగువనుగనీ ॥౩॥

సీ॥ పెండ్లాడినీవునా పెండ్లామునేనునీ మగడనంచనికూడి మందిరములు ◆ గట్టిపిల్లలగని చుట్టరికెమొనరించి విసికి సంసారంబు విడచిగురుని ◆ సన్నిధికరుదెంచి స్వామియీసంసార వేదనబడలేను వేగనన్ను ◆ కడతేర్చుమని మ్రొక్కకరుణించి యీవృత్త బట్టబయల్ వునికి ఘట్టిగాను ◆ చెప్పినీ వేమిలేదని చెప్పెనతడు ◆ గురుడుజెప్పినబోధ పైగురిదగిల్చి ◆ తననమూహముతోదర్లె తానువచ్చి ◆ నట్టిచోటికియీబోధ యిట్టిదిసుమీ॥౪॥

క॥ సంకల్పజాలమనియెడి ◆ యంకిలిలేనట్టిచోటు నరసినయంతన్ ◆ సంకల్పము మాయమగున్ ◆ సంకల్పపుజగమునిల్వజాలునేయవలన్ ॥౪॥

క॥ బూటకపుగురుడుజెప్పె ◆ తాటకతూటకలుగాదు తక్షణమునయే ◆ పాటలు నిలువవుయిదివిన ◆ మాటలుతముదామె లేచి మాయముగావే ॥౬॥

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత పరిపూర్ణబోధాషట్కం సంపూర్ణం ॥౭॥

## ౮. గురుశిష్యసంవాదషోడశి ॥౧౬॥

శ్రీమద్భాగవత శ్రీకృష్ణదేశిక ప్రభువులవారు - తమశిష్యురాలగు - తల్లావఝ్ఝల జాలమాంబకోరినందున - రచించిన - షోడశీ ॥

క॥ శ్రీమద్భాగవతాన్వయ ◆ తామరసాదిత్యకృష్ణధాత్ర్య మరునకున్ ◆ మామకగురునకు మ్రొక్కిమహామోదముతోడసజ్జ నానందముగాన్ ॥౧॥

క॥ గురుశిష్యవచనములుగా ◆ పరమరహస్యార్థమెల్ల బల్కెదవినుడో ◆ నరులారతప్పులెన్నక ◆ హర్షంబీరీతియాట లాడించుజుమీ ॥౨॥

క॥ సారముగనిసంసృతి నిః ◆ స్సారముగాజూచినట్టి సద్గురు మూర్తిన్ ◆ జేరియొకబ్రాహ్మణస్త్రీ ◆ నేరుపుతో మ్రొక్కి యెదుట నిలచిట్లనియెన్ ॥౩॥

క॥ బిసరుహభవకులభూషణ ◆ వసుధామరవర్యవినుత వరగుణబృందా ◆ వసుధీశవంద్యచరణా ◆ కుసుమాయుధశత సహస్ర కోమలగాత్రా ॥౪॥

క॥ అనివినుతిజేసినేనని ◆ తనువునుదలపోయుచుంటితద్దయు బ్రీతిన్ ◆ మునుపిపుడిదినేగానన్ ◆ చనితోచెను తెల్పవయ్య అతివిశదముగాన్ ॥౫॥

క॥ నేననువస్తువయెట్టిదొ ◆ నేనువిచారించితెలియ నేరను యీమేన్ ◆ దేనబుట్టిన దొయెరుగను ◆ దీనుతమద్గురువరేణ్య దీనశరణ్యా ॥౬॥

సీ॥ అనిపల్క విని గురుం డాపెతోనిట్లనె ◆ భూతకర్దమముచే బొడమెస్థూల ◆ తనువుదృశ్యంబగు స్తంభంబువలెనీకు కనుక యీ దేహంబు గావునీవు ◆ అనవినియయ్యనే నదిగాక మరియేమ్య పంచకృతములైన పంచభూత ◆ ములజనించిన లింగ మునునేననెటి భ్రాంతి దగిలెనీవదిగావు దాన్ని బాయు ◆ మన దానివిడచినే నెనెటి దేమనియన్న నీవునీవయ్యుండి నిన్ను నీవు ◆ ఎరుగబోవుటకారణమెరుకననిన ◆ నదిమహాకారణము వీటి నరయుదీవు ◆ అవియునిన్నెరుగలేవని యనిన మ్రొక్కి ◆ చేతులు మొగిడ్చిప్రస్తుతుల్ జేసి జేసి ॥౭॥

సీ॥ పంచభూతములెందు ప్రభవించెననవిని యాత్మలో నేనాత్మన నెటిదొకటి ◆ గలిగెమహత్తత్వమలమహతత్వము కుదయించె నొకగుణక్షోభిణియది ◆ చెలగిసత్వాదుల సృజియించె తామసగుణము కంబరమను కొడుకతనికి ◆ వాయువాయువందనలమం దుదకంబుబొడమె నాయుదకమందు ◆ భూమియీయన్నిటికి విరాట్పురుషుడతడె ◆

స్థూలతనవయ్యె శివునకుసూక్ష్మమఖిల ◆ దేవతానీకమయ్యె నా దేవవిభుని ◆ కతనికారణతనువుప్రకృతిసర్వ ◆ సాక్షినాలవదేహమౌ సఖియవినవే ॥౮॥

గీ॥ అష్టతనువులవర్ణము లష్టగుణము ◆ లష్టమాతృకలష్టాభిమానలష్ట ◆ నిలయములుగలవవి తమ్మునిన్నెరుగవు ◆ యిన్నిటిని నీవె యెరుగుదు నీవెనేనూ ॥౯॥

సీ॥ అణుమహచ్ఛైతన్యమవ్యయ మవ్యక్త మజమచల మనంతమాత్మవీవు ◆ అనంతకర్తృత్వమాత్మదోతనువుదో పాపపుణ్యద్వయఫలమెవరిదో ◆ తనువనన్నెట్లుచైతన్య ప్రవేశమో ఉత్పత్తి నాశంబులే తనువువో ◆ యిన్నిటినెరిగించుమన్న నాగురుడనె ఖరకరదీపప్రకాశములను ◆ జనులుతమతమ స్వప్రయోజనములన్ని ◆ జేయరవిదీపములు వాటికాయసాక్షు ◆ లట్లనీ తేజమునసుయీయంగసమితి ◆ కార్యములు జేయజూతు వకర్తవరయా ॥౧౦॥

గీ॥ అర్కుడుదయింపగనిపశుఘ్నావనీసు ◆ రులొనరించిన పనులసూర్యుడు స్పృశించ ◆ నట్లుసుకృతాఘములను నీవంటవంగ ◆ మెరుగదవిటినిజడముదా నెట్లెరుంగూ ॥౧౧॥

సీ॥ అనుభవింపుచునుండునజ్ఞాని యపుడుబాబుచ్చిని గని పసిబాలరఘుడసి ◆ నట్లుకుమ్మరిజేయు కోట్లబానలయందు గగనంబుజొచ్చినగతినియాత్మ ◆ జొచ్చుతత్త్వములలో జొచ్చిఘటోదకమునఘటముదొలిగి నవనజహితుడు ◆ జావలేదట్లాత్మ జావడీదేహంబువిచ్చి పోయిననైదు విధములైన ◆ ప్రళయములు గలవందులో ప్రళయయుగము ◆ పిండమందుండు రెండు బ్రహ్మాండమందు ◆ గలిగియుండును గురునిచేగలుగునొకటి ◆ ప్రళయమనుమాట మృషనుమీపద్మనేత్రీ ॥౧౨॥

గీ॥ అక్షిపురుషాద్యుపాసనలాదియైన । వెన్నొకలవాత్మనెరుగుటకన్నిటందు ◆ యెక్కువైనట్టి దీబోధ పెక్కుపలుకు ◆ లేలనామాటనమ్మితెచాలుచాలూ ॥౧౩॥

క॥ అనిశమునీవీబోధను ◆ మనమునయేమారబోకుమతి విభ్రమచే ◆ మునుపటిమాయనుయెరుగవె ◆ నినునీలోనిలువ నివదునిశ్చయముజుమీ ॥౧౪॥

క॥ అనిబోధించెనుదేశిక ◆ జనపతితద్బోధనమ్మిజాలమదొలగె ◆ జననమరణములకట్లనె ◆ వినునృతతికిమాతృగర్భ వేదనయణగు ॥౧౫॥

క॥ తల్లావఱ్ఱులజాలము । యుల్లంబీబోధమిదయునిచి యితరమౌ ◆ చిల్లరబోధలవిడిచెను ◆ బెల్లముదినువాడుచేదుబెట్టునెనోట ॥౧౬॥

ఇతి గురుశిష్యసంవాద షోడశీ సంపూర్ణం ॥౮॥

## ౯. బృహద్వాశిష్ఠబాణం ॥౫॥

సీ॥ శ్రీమద్రమాసుందరీమనోహరుడగు ◆ నారాయణాభి ధానమునవెలయు ◆ గ్రామనివాసియౌరామడగుశివరామదీక్షితుల్ తనశిష్యశిక్షకొరకు ◆ వచనకావ్యంబుగ నచలబోధయొనర్చెనందులోగల యర్థమంతమీకు ◆ వినజేతువినరయ్యజనులార వొకశిష్యవరుడు ◆ సద్గురునకువందనములు జేసితద్బోధనడిగిన జెప్పెనిట్లు ◆ సర్వగతమునునిత్యంబుస్థాణువచల ◆ మునుసనాతనమున నంతమనజమసహ ◆ మైనయీవృత్తబట్టబయలందులేన్దే ॥౧॥

సీ॥ నీనాస్వరూపమైనిఖిలప్రపంచమై ◆ నేనునీవనినన్ను నిన్నెరిగెటిదై। కారణములేని దైకార్య కారణములు రెండు దానైయె వెలసియమిత ◆ వేదముల్ గల్పించి భేదములను జెందికలిమిలేముల సుఖకష్టములను ◆ పుట్టుచావులగెంటి బొందుచు నానావికారియై మాయనంజేరియడుగ ◆ నేను తనమీదివస్తువునిదుగొచూడు ◆ మనినసవినయమున దాని గనిస్వకీయ్య ◆ చిత్రములతోడ నిలువక చేరెనపుడు ◆ తానువచ్చినచోటుకు తక్షణమునా ॥౨॥

క॥ మేలుకగాఢాసుప్తిని ◆ యేలీలంవచ్చినిలిచి యేగునొనేనుం ◆ అలీలవచ్చి పోయెను ◆ నేలేనటువంటిచోటనిజగురు కరుణ౯ ॥౩॥

క॥ అనిగురుడీరీతినిదె ◆ ల్పినవినిశిష్యుండువానివిధమున యీబోధనుజెందెదీని ప్రేమను ◆ వినువారలువారివలెనెవెల యుదురుజుమీ ॥౪॥

సి॥ శివరామదీక్షితుల్ జెప్పకంబ్బాలూరియప్పయ్యమంత్రియీయచలబోధ ◆ వినిపిల్చివినజేశెతనశిష్యుడగుపరశురామ సీతారామరత్నమునకు ◆ వారునేననుభాగవతకృ ష్ణుడదిగొర బోధించిరతనికా బోధనతడు ◆ కలలోనివాడు మేల్కనినతాలేనట్లు యీ ప్రపంచంబుదా నేమిలేక ◆ పాయెవినినిల్చెపైమాట పలుకరాదు ◆ చేటులేనట్టిచోటపై కూటమంత ◆ వినుడియుళ్ళక్కి యిదియైన వెదకిచూడ ◆ నెందుగనరాదుసరెకదా యిదెసరిసరీ ॥౫॥

ఇతి శ్రీమద్భాగవత శ్రీకృష్ణవిరచిత బృహద్వాశిష్ఠబాణం సమాప్తం ॥౯॥

## ౧౦. అచలబోధాషట్కం ॥౬॥

సీ॥ వినరయ్యజనులార వినజేతుశివరామ దీక్షితుల్ జేసినతెనుగుబోధ ◆ లోగలయర్థంబు నేగంటిపరశు రామసీతారామ రత్నమునకు ◆ సేవజేయుచుప్రియ శిష్యుడనై భాగవతకృష్ణుడనుపేర వసుధమీద ◆ వెలసితియీబోధ వృత్తాంతమెఱుగక నంబరబోధని యపహసించి ◆ వినరుకొందరువినకున్న విలువదిగునె ◆ వకమహాత్మునిగనిశిష్య డొకడడిగిన ◆ నతడువానినిజూచియి ట్లనియెదీని ◆ వినుమునామాటమీదనీ మనసునిలిపీ ॥౧॥

సీ॥ అహమనేదానిని యంటనిజముదాన వికారిగనుకనే ననదులేని ◆ అహమనేమాటత దవికారినెరుగదా యవికారిలోజేరి యాడుచుండు ◆ యిదెపంచభూతాల నేవుతోనీనిన తల్లితల్లినిగన్న తల్లిదండ్రి ◆ అవికారియొకటున్న దని తెల్పికని దాని లేనినేలేననితా నెరిగిన ◆ నేనునిలచుండదదిబోవ దాని వెంట ◆ దానిసంతతియేగును తక్షణమున ◆ మొదటిదచలంబురెండోది మొదలులేని ◆ యట్టియీగురుతెరుగుమేనని వచించీ ॥౨॥

క॥ అనహమునకహమునకుసు ◆ ప్తినిమేల్కనుదీటుజేసి వినుమహమునుమే ◆ ల్కనురెంటిదీసివేసిన ◆ ననహముగాఢాసుషుప్త లాపైనిలుచు౯ ॥౩॥

సీ॥ మొదలులేక నెవచ్చి మొదలైప్రపంచంబు పుట్టించి రక్షించి పొలియజేయు ◆ నిదియెమూలంలేని యీగురు తెరిగేశ రీరంబుదానవి కారియైన ◆ యీవుత్తబయలేవు న్నదందునేలేననిగుర్తెరిగి లేక యున్న ◆ దానితో బేపొపు దానిప్రపంచంబు మిగులదంబరమైన మిగులునట్టి ◆ వస్తువచలంబునిత్యంబు వాస్తవంబు ◆ సర్వగతమజమవికారి స్థాణువెరుక ◆ మరుపులెరుగనిదింతైన మరుగులేక ◆ నిబిడమైయ్యుండియున్నది నేనుగాన్డీ ॥౪॥

క॥ అనిగురువరుడెరిగించిన ◆ వినియతడాబోధజెందె వేడ్కనుయీబో ◆ ధనువిన్నకన్ననరుల ◆ ట్లనెతద్బోధార్థమబ్బి యహమనరుజుమీ ॥౫॥

గీ॥ ఉన్న దానిలోన వుళ్ వుళ్క్కైనట్టి ◆ గురువరుడుశిష్యవరుడువారి ◆ బోధ నేనుమీకు బోధించినదిమీర ◆ లేను ళక్కుళక్కి తానుళక్కి ॥౬॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత అచలబోధాషట్కం సంపూర్ణం ॥౧౦॥

## ౧౧. గురుశిష్యసంవ్వాదైకాదశకం ॥౧౧॥

సీ॥ శ్రీమద్గురుపరశు రామసీతారామ మూర్తినిధ్యానించిమ్రొక్కివినుతి ◆ జేసిచేసెదగురు శిష్యసంవ్వాదంబు వినరయ్యజనులార వేడ్కతోడ ◆ సాధనచత్వారి సంపద్వి శిష్టుడై శిష్యుండునాల్గుశి శ్రూషణములు ◆ కరుణరాగురునకు గావించియొకనాడు నేను వేననుకొంటి నేటిదనుక ◆ యిపుడువేరనితోచెను యీశరీర ◆ మెట్లగలిగెనొనేనన నేమిటిదియొ ◆ తెల్పగదవయ్యయిదిలెస్స దేశికవర ◆ పరమకారుణ్యరసపూరభవవిదూరా ॥౧॥

క॥ అనిప్రార్థించినవినుమని ◆ తనహస్తముమస్తకమున తగనిడిబోధిం ◆ చెనుభూతకర్దమంబున ◆ గనుపడుయీస్థూల తనువు గలిగెనుజడమై ॥౨॥

క॥ ఇదినీవుగావుదీనిని ◆ వదలిసుఖంబుండుమనిన వాడిట్లనియె౯ ◆ యిదిగాకనునేనెవడనొ ◆ వదలక వేవేగదెల్ప వలెనన నతడు౯ ॥౩॥

సీ॥ వినుముయాదేహంబు విడచియపంచీకృత ములైనపంచభూతములవలన ◆ గలిగినయాసూక్ష్మ కాయంబునేనని తలపుచున్నాడవు దానిబాయు ◆ మననదని బాసినే ననేమి యనియన్న ◆ నీవునీవైయ్యుండి నేనెవడనొ ◆ యనుకారణ శరీర మునుబట్టి యున్నావు తగిలియాదేహంబు దలపకుమన ◆ వినిశరీరత్రయమునునే వేరెవేరె ◆ యెరిగి తెలుసుకొనేటియా యెరుకననిన ◆ నవిమహాకారణముదాని కవలనున్న ◆ వాడ వీడనితెల్పిన వాడుమ్రొక్కి ॥౪॥

సీ॥ భూతపంచకమెందు బొడమెనంచనవినియాత్మలో నేనాత్మననెటిభ్రాంతి ◆ తనకుదాగలిగెను దానిమహత్తత్వమని మూలమాయనియనిరిదాని ◆ కుదయించెనొకగుణ క్షోభిణియది గుణత్రయమునుబుట్టించె తామసమున ◆ గలిగెనభంబు తద్గగనమంద నిలమాయ నిలమందనల మాయనలమందు ◆ జలముజలముననవనియీా సర్వమునవి ◆ రాట్టుజన్మించెవిను మావిరాట్టుశివున ◆ కాదితనువయ్యె తక్కిన యంగసమితి ◆ సకలసురలు ప్రకృతిసర్వ సాక్షులయ్యె ॥౫॥

గీ॥ నీకు శివునకుగల యట్టినిజగుణముల ◆ విడచికనుగొనుమీశుండువేరెలేదు ◆ ఆశరీరాష్టకమును నీవరయుదరయ ◆ దాశరీరాష్టకంబునిన్ననఘయనినా ॥౬॥

సీ॥ కర్మత్రయమునకు కర్త లెవ్వరు పాపపుణ్యంబులెవరిని బొందునాత్మ ◆ తనువులోపలనెట్లు తాప్రవేశించును మృత్యువెవరినిబట్టి మిడుకజేయు ◆ ననవిని ప్రజలందరొనరించుప్రజలకు దీపమంభోజాప్తుడేపగిదిని ◆ శాశించకను తమస్వప్రభచే రాత్రిపగలొక్కరీతిని ప్రజ్వరిలుచు ◆ సాక్షులైయుండుచురా రీతిసకలతత్వ ◆ ములపనుల కెల్లసాక్షివైవెలుగుదీవు ◆ సూర్యుడుదయింప మేదినిసురపశుఘ్ను ◆ లాచరించెటికర్మ ఫలముల రెంటీ ॥౭॥

గీ॥ అర్కుడంటనిపగిది నీవంటవనఘసుకృతములులను దేహమెరుగదది తిజడంబు ◆ చంటిపిల్లలబాబుచ్చి చణకినట్లు పుణ్యపాపములనుజ్ఞాని పొగరణచునూ ॥౮॥

సీ॥ ఖండముగాక సఖండమైగగనంబు ఘటకారుడొనరించు ఘటములందు ◆ జొచ్చినవిధమాత్మ జొచ్చుతత్వములందు జలపూర్ణఘటములో జలజహితుడు ◆ బింబించ్చికలశంబు భిన్నమైపోయిన నర్కుండు జావనట్లాత్మజావ ◆ దంగ్గంబు పంచత్వమందిన ప్రళయముల్ రెండుపిండమున బ్రహ్మాండమందు ప్రళయములు రెండుగలిండు ప్రళయమొకట ◆ గురునిచేగల్గునివి మిధ్య లెరుగుమితర ◆ బోధలెవ్వియుదీనితో బోలవిలను ◆ మేలుసమకూర్చు నీకిదిచాలుచాలు ॥౯॥

క॥ అనిబోధించినదేశికు ◆ గనినుతులొనరించి పూజగా వించిముదం ◆ బునబొందెతిరిగి యీబోధను ◆ వినుకను నృతతిజొరదు తల్లికడుపునఁ ॥౧౦॥

గీ॥ భాగవతకృష్ణుడీ బోధభావమందు ◆ నమ్మితక్కినబోధలజిమ్మివైచె ◆ అమలకమలమరందంబు నానుతేటి ◆ బోవ నేర్చునెదుత్తూరపుష్పములకు ॥౧౧॥

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత గురుశిష్యసంవాదైకాదశకం సమాప్తం.

## ౧౨. కందార్థచతుష్కం ॥౪॥

శ్రీమద్భాగవతాన్వయ ◆ తామరసార్కునకుకృష్ణధాత్ర్యమరునకుఁ ◆ మామక గురనకుభక్తిని ◆ నేమ్రొక్కిరచింత్తువినుడీ ◆ నేర్పూమీరగనూ*వోజనులార ◆ నిగమాంత్తార్థమునూ*యేమానియనరాక యేకామౌబ్రహ్మామం ◆ ద్దీమాయజగమంత యేర్పాటాయను లేందే * నేర్పూమీరగనూ - వోజనులార ◆ నిగమాంత్తార్థమునూ ॥౧॥

ఈవిశ్వములోనొకసతి ◆ తావిన్నప మాచరించెతన దేశికుతో ◆ వోవిప్రవర్య నేనన ◆ నేవిధవుదొతెలియజెప్పు * మిది కూడదనకా శాంత్యోనెనామది ఇదివినకా * పావనచరితనాపలి కేనిట్లనిగురు ◆ డీవేబ్రహ్మావు మెనులేగానంచనుకుంట్టె * ఇది కూడదనకా - శాంత్యోనెనా మదిఇదివినకా ॥౨॥

అనినవినిఆ పెయిట్లనె ◆ తనువులుయెన్నట్లుగలిగె తనువుల నెల్లం ◆ కనినట్టిదెవ్వరిదియే ◆ ఘనునకుజన్మించెననిన॥ కరుణాతోడుతనూ * చూచిపలికె వరిపూర్ణముననూ * మననూబుట్టెనుదాని మహిమేం యీనకలాము ◆ మనసూబ్రహ్మామునందు ◆ మడసీనమాటేది ◆ కనినమీదటనూ * చూచిపలికె పరిపూర్ణముననూ ॥౩॥

దానబుట్టెనదిగనుకనె ◆ దీనకియీమహిమగలిగె దేవుడనంగ్గా ◆ మానసమెజీవుడనినను ◆ మానసమేవిశ్వమనిన॥ మరి మేనులనినా * మానసమేస ◆ ద్గురుశిష్యులనినా * మానాసమెప్పూడీ మర్మాముగురునీచె ◆ తానెరుగునోనాడె ◆ తానె లేకుండూను ◆ మరి మేనులనినా * మానసమేస - ద్గురుశిష్యులనినా ॥౪॥

ఇతి శ్రీమద్భాగవత శ్రీకృష్ణవిరచిత గురుశిష్యసంవాదంబను కంద్దార్థచతుష్కం

౧౨॥ సంపూర్ణం.



# నేత్ర స్థాన విమర్శ

| నేత్రస్థా నమంత్రా | శరీరం | అభిమాని | అవస్థ | గుణము | మాతృక | భూతములు | వాక్కులు | భీజము | శక్తులు | స్థానము | దేవతలు | ప్రమాణము | | | స్థానము | | పంచాక్షరి | | | | చక్రము | అదిదేవత | హంసలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| యెరుపు వర్ణం | స్థూలం | విశ్వుడు | జాగ్రత | రజో గుణం | అకారం | పృధివి | వైఖరి | "ల" కారం | క్రియా శక్తి | త్రికూ టం | బ్రహ్మ | అంగు ళంవర | అహం కారం | | నేత్రం | | య | | యినాలుగూత్వంపదార్థం యిదే పిండాండం | త్వంపద వాచ్యార్థం | ఆధారం | గణపతి | ౬౦౦ జపం |
| తెలుపు వర్ణం | సూక్ష్మం | తైజ సుడు | స్వప్నం | సత్వ గుణం | ఉకారం | ఉదకం | మధ్యమ | "వ" కారం | జ్ఞాన శక్తి | అహ టం | విష్ణు | అంగుష్ఠ మాత్రం | చిత్తం | | కంఠం | | వా | | | | స్వాధి ష్ఠానం | బ్రహ దిపతి | ౬౦౦౦ జపం |
| కృష్ణ వర్ణం | కారణం | ప్రాజ్ఞుడు | సుషుప్తి | తమో గుణం | మకారం | అగ్ని | పశ్యంతి | "ర" కారం | ఇచ్ఛా శక్తి | కోల్హా టం | రుద్రుడు | అంగు ష్ఠార్థం | బుద్ధి | మాయ | హృద యం | జడో పాధి | శి | అజ్ఞానం అవిద్య | | | మణి పూరకం | విష్ణు | ౬౦౦౦ జపం |
| సునీల వర్ణం | మహా కారణం | ప్రత్య గాత్మ | తుర్యం | శుద్ధ సత్వం | ఓంకారం | వాయు | పరాం | "య" కారం | ఆది శక్తి | లయా టం | ఈశ్వ రుడు | మసురా మాత్రం | మనుసు | మాయ | మూర్ధ్ని నాభి | | మ | శుద్ధ జీవుడు | | త్వంపద లక్ష్యార్థం | అనా హతం | రుద్రుడు | ౬౦౦౦ జపం |
| పీత వర్ణం | కైవ ల్యం | | తుర్యా తీతం | | | ఆకాశం | పరాత్ప రం | "హ" కారం | పరా శక్తి | బ్రహ్మ రంధ్రం | సదా శివుడు | అణు రూపం | అంతః కరణ | చిద్బిం దువు | | | న | | | | విశుద్ధం ఆజ్ఞేయం | జీవుడు ఈశ్వరుడు | ౧౦౦౦ జపం |
| స్ఫటికం యిదే చైతన్యం | | | | | | | | | | | | | | | | | | | కూట స్థుడు | అసి పదము | సహ స్రారం | గురుడు | ౧౦౦౦ జపం |
| యెరుపు లోపచ్చన | విరాట్టు | వైశ్వా నరుడు | సృష్టి | రాజసా హంకారం | అకారం | | | | | | | | | | రవి మండలం | | | | ఈశ్వరుని మాయ యిదే తత్పదార్థం యిక్కడి నుంచి యిది అంతా బ్రహ్మాండం | తత్పద వాచ్యార్థం | | | |
| తెలుపులో కర్పూరం | హిరణ్య గర్భం | ప్రాజ్ఞు డు | స్థితి | సాత్వికా హంకారం | ఉకారం | | | | | | | | | | చంద్ర మండలం | | | | | | | | |
| కృష్ణంలో శ్యామం | అవ్యా కృతం | అంత ర్యామి | ప్రళ యం | తామసా హంకారం | మకారం | | | | | | | | | | అగ్ని మండలం | అజడో పాధి | | | | | | | |
| సునీలంలో పీతఛాయా | మూల ప్రకృతి | పరమా త్మ | సర్వసా క్షిత్వం | శుద్ధ సాత్వికా హంకారం | ఓంకారం | | | | | | | | | మూలమా యా ఈశుని ఛాయ | అర్ధచంద్ర మండలం | | | | | తత్పద లక్ష్యార్థం | | | |

# నేత్ర స్థాన విమర్శ

| | లోకములు | ముఖము | | | కోశములు | | లింగములు | స్థలములు | భక్తి | సేవలు | రుచులు | | నాడులు | | మండలము | బీజములు | | అభిమానులు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రేచకం | సాలోక్యం | | | | | | చర లింగం | భక్త స్థలం | సద్భక్తి | వుచిత సేవ | లవణ తృప్తి | | | | | | | | | | | |
| రోచకం | సాలోక్యం | సద్యోజాత | తారకం | | అన్న మయం | | గురు లింగం | మహేశ్వరస్థలం | నైష్ఠిక భక్తి | | మధుర తృప్తి | | | | | కామ బీజం | | లక్ష్మణుడు | గణపతి | | | |
| వూరకం | సారూప్యం | వామ దేవ | దండకం | అండం | ప్రాణ మయం | | శివ లింగం | సమరస స్థలం | అవధానభక్తి | సంబుద్ధిసేవ | కటు తృప్తి | నాదం | ఇడా | గంగా | అగ్నిమండలం | | | శత్రుఘ్నుడు | నంది | | | |
| కుంభకం | సామీప్యం | అఘోర | కుండలి | పిండం | మనోమయం | | ప్రసాద లింగం | శరణైక్య స్థలం | భవ భక్తి | సుజ్ఞాన సేవ | తిక్త తృప్తి | నాదం వూ | ఇఢాతం | గంగ్గానా | అగ్నిమండలం | కామకళా బీజం | విత్తు | భరతుడు | వీరభద్రుడు | నిద్రాస్థళం | హృదయ కమలం | |
| సూచకం | సాయుజ్యం | తత్పురుష | చంద్రకారం | బ్రహ్మాండం | విజ్ఞాన మయం | | మహా లింగం | | స్వానంద భక్తి | సద్భావ సేవ | కషాయ తృప్తి | బింధు | పింగళా | యమునా | రవిమండలం | మాయా బీజం | చిత్తు | శ్రీరాము | పార్వతి | | | లింగ దేహం |
| సూచనం | సాక్షిత్వం | ఈశాన్య | ప్రణవం | | ఆనంద మయం | | | | | | | కళ | సుషుమ్న | సరస్వతి | చంద్ర మండలం | | సత్తు | సీతా | శివుడు | | | |
| | | గోప్యం | పరం జ్యోతి | | హిరణ్మయం | నారాయణమూర్తి | | | | | | | | | | | ఆనందం | తారకం | | | | |

శృతి ॥ బింధుమధ్యే జగత్సర్వం - బింధుత్రైలోక్య దర్పణం
బింధుమధ్యే స్థితం విశ్వం - బింధు శేఖర మవ్యయం ॥

శృతి ॥ లక్ష్మణోరక్త వర్ణశ్చ - శతృఘ్నోశ్వేత వర్ణకః
భరతాకృష్ణ వర్ణశ్చ - శ్రీరామో నీలవర్ణకం
వైదేహి పీతవర్ణశ్చ - తారకం స్పటికాకృతిం ॥